దొరకెను దొరకెను బొబ్బిలి జాబులు నేటికి దొరకెను
దెబ్బదెబ్బకూ మూరెడు కోట వుర్లి వుర్లి పడెను
రోకళ్ల గుద్దీ పండబెట్టిరీ తెల్లవాండ్ల నేమి
గోలకొండ యీ సందున నీకు గోరీ కట్టించు
మారు(ర్) మారు(ర్) మా రన్నమాటకు మరుమాటే లేదు
వంచిన యీటెలు యెత్తక పొడిచిరి వెలమలు తెలగాలు
పోకు పోకు మరి వెంగళరాయడ పోకు మన్నా డేమి
మడమతిరిగి పొయ్యేది మీకూ మర్యాదే కాదు
వెన్నెల కాస్తే యెండే దయ్యా కళింగరాజ్యముగ
మంచులు కురిస్తే పండే దయ్యా మన రాజ్య మేమి
చిత్తవర్షము కురిసినట్టుగా తుపాకి పేలింది

ఈబొబ్బిలి కథ రచన మొదటినుంచి చిట్టచివరివరకు చరణము చరణమునను రస ముట్టిపడుచు ఒక్కరీతిని ఉజ్జ్వలతతో, శక్తిమంతముగా సాగిపోయినది.

ఈ బొబ్బిలి కథ వ్యావహారిక భాషలో నున్న పదము. బొబ్బిలి పాట యనియు దీనిని వ్యవహరింతురు. గ్రాంథిక భాషలో నున్న గ్రంథమును పరిష్కరించుట సులువు. కాని వ్యావహారిక భాషలోని గ్రంథమును పరిష్కరించుట కష్టము. వ్యావహారిక భాషకు ఒక నియమము లేదు. దాని కొక వ్యాకరణము లేదు. ఒక్కొక పదమును పలువురు పలురూపముల ఉచ్చరింతురు; అందు క్రియారూపముల విషయమున ఇంకను వ్యత్యాసము కలదు. ఒకటే రూపమును ఒకరు ఒక విధమున వ్రాయగా మరొకరు మరొకవిధమున వ్రాయుదురు. ఉచ్చారణ భేదమువలన కలిగిన ఈ రూపములు అసంఖ్యములు. ఈ రూపములకు ఒక ప్రామాణికత లేదు. అన్నిరూపములును ఉచ్చారణ సౌకర్యము నిమిత్తము స్వరసూత్రములకు లోబడి సిద్ధించినవే. అవి తప్పులు కావు. కాని వ్రాతలో ఏ రూపమును స్వీకరింపవలె నన్నదే సమస్య. ప్రకరణమునుబట్టి ఒక్కొక రూపమును ఒక్కొకచో

వాడవచ్చును. దీని కొక నియతి లేదు. ఇందువలననే వ్యావహారిక భాషాగ్రంథమును పరిష్కరించుట కష్టము.

అందునను ఈ బొబ్బిలి కథ గేయము: ఇది లయబద్ధమయినది. పాట యనగనే లయకు సరిపడునట్లు మాటలలోని కొన్ని యక్షరములను హ్రస్వము లయినచో దీర్ఘములు చేయవలసివచ్చును ; కొన్నిటిని దీర్ఘము లయినచో హ్రస్వము చేయవలసివచ్చును. ఈ విధముయిన మార్పులు చేసినచో సరియైన శబ్దరూప మేదో తెలియకుండ పోవును; మార్పులు చేయక పోయినచో లయకు సరిపడక పాట భ్రష్ట మగును. శబ్ద స్వరూపముమీద దృష్టియుంచకుండ పాట పద్ధతినే గమనించి పరిష్కరించుటా ? లేక పాటపద్ధతిని ఉపేక్షించి శబ్దస్వరూపమునే గమనించి పరిష్కరించుటా యన్నమీమాంస చాల కలవర పెట్టినది. త్యాగరాజ స్వామి కీర్తనలు, క్షేత్రయపదములు మొదలైనవానిలోగూడ వచ్చు చిక్కు ఇదే కాని ఇంతవరకు ప్రకటితమైన కీర్తనలలోను, పదములలోను శబ్దస్వరూపములు సరిగనే యున్నవి. కీర్తనలు, పదములు పాడువారే సందర్భోచితముగ లయ కనుకూలించునట్లు ఆయామాటలలోని దీర్ఘాక్షరములను హ్రస్వములు, హ్రస్వాక్షరములను దీర్ఘములు చేసి పాడు చుందురు. అందువలన సాధ్యమయినంతవరకు సుసంగతములయిన శబ్ద స్వరూపములతోనే పాఠపరిష్కారము చేయబడినది. కాని ఈ పాట పాడువారికి ఆయాయిమాటలలోని యక్షరములకు ఎక్కడ దీర్ఘములుగా ఉండవలెనో, ఎక్కడ అవి హ్రస్వములుగ ఉండవలెనో తెలియుటకు పాటలోని శబ్దముల స్వరూపము ఉన్నది ఉన్నయట్లు అధోజ్ఞాపికలలో సాధ్యమయినంతవరకు చూపబడినది. ఇంకను ఎక్కడనైన లయాను గుణముగా మార్పులు కావలసినచో వానిని పాటపాడువారే చూచు కొనదగును.

పాటలును, పదములును తాళ లయానుబద్ధములగుటచేత వానికి మాత్రలే ప్రధానము. ఒక విధముగా వీనిని మాత్రాగణ బద్ధములైన దేశిచ్ఛందములలో చేర్పవచ్చును. కాని ఈపాటలకు, పదాలకు లక్షణ

గ్రంథములలో ఛందస్సు చెప్పను లేదు ; ఛందస్సును గమనించి వీనిని రచింపను రచింపరు. తాళము, లయ - ఇవే ప్రధానమైనవి. ఇట్టి పాటల, పదముల రచన వీని ననుసరించియే సాగిపోవును.

ఈ బొబ్బిలి పదములో సమచరణములు, విషమ చరణములు అని రెండు రకములైన చరణము లున్నవి. తాళ లయానుబద్ధముగా సరళముగా సాగిపోవునది సమచరణము. ఇందు 24 లేక 25 మాత్ర లుండును (లఘువునకు ఒక మాత్ర ; గురువునకు రెండు మాత్రలు). ఇందుకు ఉదాహరణములు :

దువ్వతోటలో దిగివున్నారు * బూసీ దొరగారు (24 మాత్రలు)

మాడువు లేలే లింగా రావుకు * జాబు లంపినారు (25 మాత్రలు)

పైనిచ్చిన మొదటి చరణములో 'దిగివున్నారూ' అని 'రు'కు దీర్ఘమిచ్చినచో అది 25 మాత్రల చరణ మగును. పైనిచ్చినవి రెండు సమ చరణములు. ఈపాట ప్రతిచరణములోను ముఖ్యమైనది విరతి - విశ్రాంతి. ఒక్కొక చరణములోగల ఈవిరతి ననుసరించియే పాట తాళ లయానుబద్ధముగ, సరళముగ సాగిపోవును. ప్రతి చరణములోను 15, 16 మాత్రల తరువాత విరతి యుండును ; అనగా ప్రతిచరణమున రెండు భాగము లుండును ; మొదటిది 15, 16 మాత్రల భాగము ; రెండవది 9 మాత్రల భాగము. 19, 20, 22, 23 మాత్రలు, 26, 27, 28 మాత్రలు గలవి విషమ చరణములు. వీనికి ఈ క్రింది చరణము లుదాహరణములు:

కట్టుమనె జండాలతాళ్లు * కదలుమనె బలము (21 మాత్రలు)

కాకిమూక పరాసులమూక * కమ్మక వున్నది (22 మాత్రలు)

పరాసువారికింద నీవు * దుబాసి కుదిరేవా (23 మాత్రలు)

అదుగో, పచ్చబణాతుడేరా సుమ్మీ * దొర వెంగళరావు(28 ,,)

మా అన్న పెండ్లికి చామర్లకోటలో * నిన్ను చూచినాను (28 ,,)

ఈవిధముగానున్న చరణములలో 24, 25 మాత్రలకు తగ్గినచో వీలును

బట్టి హ్రస్వములకు దీర్ఘము లిచ్చి లయ కలుపుకొనవలెను. 24, 25 మాత్రలకు మించియున్నచో పాటకు, లయకు సరిపోవునట్లు దీర్ఘములను హ్రస్వపరచి, మొదటి మాటను లేదా మాటలను కాని, అక్షరమును కాని విడదీసి వచనమువలె చెప్పి, మిగిలినది పాటగా పాడుకొనవలెను. పైనిచ్చిన చరణములలో అదిగో యన్నది, మా యన్నది విడదీసి చదివినచో పాట కొదుగును. ఇట్లే ఇతర చరణములును చూచుకొనవలసి యుండును. ఈకథలోని చరణములలో కొన్నిటికి లయానుకూలముగ దీర్ఘము లీయబడినవి. ఈ † † గుర్తుల మధ్యనుండు చరణములు గతి మార్చి వచనపద్ధతిని చదువవలసియుండును. ఎందరో మందిని,ఎన్నో వస్తువులను, కథా సందర్భములోని ఆవేగమును, ఉద్వృత్తిని సూచించు టకు సమయోచితముగా ఈకథలో వచనము ప్రయుక్తమైనది.

ఈకథలో వర్ణితమైన ఇతివృత్తము బొబ్బిలియుద్ధము ఆంధ్ర దేశములోనే కాదు, హిందూదేశములో జరగిన చిరస్మరణీయములైన మహాయుద్ధములలో ఒకటి. ఇది బొబ్బిలి వెలమవారికిని, విజయనగరము క్షత్రియులకును జరగిన సంగ్రామము. ఉభయయవంశములవారికిని వైరము కొంచె మించుమించుగా క్రీస్తుశకము పదునేడవ శతాబ్దములో ఉభయసంస్థానములును ఏర్పడిన కాలమునుండియు నున్నది. అది తెలుగు దేశమును గోలకొండ రాజధానిగా కుతుబ్ శాహిసుల్తానులు పరిపాలించుచుండిన కాలము. ఆకాలములో సముద్రతీరస్థమయిన పూర్వాంధ్రదేశమున చాల భాగము కొండవీడు, కొండపల్లి, ఏలూరు, రాజమహేంద్రవరము, శ్రీకాకుళము అని పరిపాలన సౌకర్యము నిమిత్తము అయిదు సర్కారులుగ విభక్తమైనది. ఒక్కొక సర్కారును కుతుబుశాహిసుల్తానుకు లోబడి ఒక్కొక ఫౌజుదారు పరిపాలించు చుండెను. ఫౌజు, పౌజు, ఫౌంజు అను మాటలకు సైన్యమని యర్థము. ఫౌజుదారనగా కొంత సైన్యమునకు అధిపతి. ఈసర్కారులు సైనికపరి పాలనముక్రింద నుండెను. ఫౌజుదారుకే నవాబని పేరు. క్రీ.శ. 1652లో శ్రీకాకుళము సర్కారుకు షేర్ ముహమ్మదుఖాను ఫౌజుదారుగా

నియమితుడయినప్పుడు అతనితోపాటు బొబ్బిలి వెలమవారి పూర్వుడు పెద్దరాయడును, విజయనగరము మాధవవర్మవంశజుడయిన పూసపాటి మాధవవర్మయు ఈ సర్కారుకు వచ్చి నవాబు అనుగ్రహమును సంపాదించి చిన్న సంస్థానములను సంపాదించుకొనిరి. పెద్దరాయడు చేసిన సేవకు సంతసించి ఫౌజుదారుడు అతనికి రాజామువహుండాను ఇచ్చెను. ఇతని కుమారుడు లింగప్ప. ఇతడు తనప్రభువైన ఫౌజుదారుకుమారుని విపత్సమయములో అతని కెదురు తిరిగిన స్వామిద్రోహిబారినుండి రక్షించినందుకు అమితసంతోషమును పొంది ఆ లింగప్పకు పండ్రెండు గ్రామములను, అతనికిని అతని సంతతి పరిపాలకులకును వంశపారంపర్యముగ రంగారావను బిరుదమును ప్రసాదించెను. లింగప్ప ఒక నగరమును కట్టించి, దానికి తన ప్రభువుబిరుదముపేర 'పెద్దపులి' (షేర్ అనగా పులి) అని పేరు పెట్టె ననియు, పెద్దపులి యను పేరే జనవ్యవహారమున పెబ్బులి, బెబ్బులియై తుదకు బొబ్బిలి యైన దనియు చెప్పుదురు. బొబ్బిలి యుద్ధకాలమున తత్సంస్థానమును పాలించుచుండినవాడు గోపాలకృష్ణ రంగారావు.

కుమిలి, భోగాపురములు విజయనగరము వారిక్రింద నుండిన మొదటి ప్రాంతము. వారికి పొట్నూరు ముఖ్యనగరము. ఈపూసపాటివారిలో మొదటి రాజులు క్రమముగా కొంత కొంత దేశమును సంపాదించుకొని తమ యధికారమును, రాజ్యమును విస్తరింపజేసికొనిరి. అటుతరువాత వారు 1713-14 లో విజయ సంవత్సరమునందు ఒక నగరమును కట్టించి, దానిని కట్టించిన విజయరామరాజుపేర దానికి విజయనగరమని పేరిడిరి. అదియే విశాఖపట్టణము జిల్లాలోని యిప్పటి విజయనగరము. విజయనగర నిర్మాణానంతరము వారు పొట్నూరినుండి యీనగరమునకు తమ రాజధానిని మార్చుకొనిరి. బొబ్బిలి యుద్ధకాలము నాటికి విజయనగరము నేలుచుండినవాడు కళింగరాజ బిరుదాంచితుడైన పెదవిజయరామ గజపతి మహారాజు. విజయనగరాధిపతులకు సైన్యములో గజదళ మెక్కువ యుండుటవలన వారికి గజపతులని పేరు కలిగినది.

సర్కారులలోగల సంస్థానము లన్నిటిలోను విజయనగరమే బొబ్బిలి యుద్ధకాలమునాటికి ప్రాభవాధికారవిస్తీర్ణములలో గొప్పది. ఇది క్రమముగా బొబ్బిలి సంస్థానము సరిహద్దులవరకు వ్యాపించినది. వ్యవసాయము నిమిత్తము ఏళ్లు వాగులలోని నీరు ఎగువనున్న బొబ్బిలి సంస్థానమునుండి విజయనగర సంస్థానములోనికి రావలసి యుండుటచేతను, బొబ్బిలివారు నీరు రానీయక తరచుగా ఆటంక ములు కలిగించుచుండుటచేటను ఉభయ సంస్థానాధీశులకును తరచుగా వివాదములు సంభవించి యది ఇంచుమించుగా సంతత కలహా ముగా పరిణమించినది. బొబ్బిలి సంస్థానము పర్వతారణ్యమయమయి దుర్గమ మగుటచేతను, బొబ్బిలి వనదుర్గ మగుటచేతను ఆసంస్థా నాధిపతులను జయించి వారిని అదుపులో నుంచుటకు విజయనగరాధి పతులకు సాధ్యము కాకపోయినది. అణచి వేయుటకు సమయ మెప్పుడు దొరకునాయని వేచియున్న విజయనగరాధిపతి పెద విజయరామరాజు నకు సర్కారులు ప్రెంచివారికి దఖలుపడినకాలములో త్వరలోనే అట్టి యవకాశము లభించినది.

1687 లో ఢిల్లీపాదుషా ఔరంగజేబు గోలకొండదుర్గమును జయించుటతో తెలుగుదేశము మొగలాయిసామ్రాజ్యములో చేరి పోయినది. ఢిల్లీపాదుషాకు చేపడిన ఈగోలకొండరాజ్యమును పరి పాలించుటకు దక్కనుసుబాదా రనుపేర ఒకయుద్యోగి నియమితు డయ్యెను. ఇతని రాజధాని హైదరాబాదునగరము. సాధారణ ముగా ఈదక్కను సుబాదారును హైదరాబాదు నిజామని వ్యవహరించు చుండిరి. ప్రాగాంధ్రదేశము, తెలంగాణా, రాయలసీమలతో కూడిన సర్వాంధ్రదేశమునకు అత డధిపతి యయ్యెను. ప్రాక్సముద్రతీరస్థ ఆంధ్రదేశములోని పాళెగాండ్రును, సంస్థానాధిపతులును అతని యధి కారమునకు లోబడి యతనికి కప్పము చెల్లించుచుండిరి.

1707 లో ఔరంగజేబుపాదుషా కాలధర్మము నొందెను. తరువాత ఆసఫ్‌జా నిజాముల్ ముల్కు దక్కనుసుబాదారుగా నియ

మితుడయ్యెను. ఇతడు మొదట కొంతకాలము ఢిల్లీపాదుషాకు విధేయుడుగా నుండి తరువాత స్వతంత్రుడై రాజ్యమును పరిపాలించెను. ఇతడు 24 సంవత్సరములు రాజ్యమేలి క్రీ. శ. 1748 లో కాలధర్మమునొందిన మీదట హైదరాబాదుసింహాసనముకొరకు అతని రెండవ కుమారుడు నాజరుజంగుకును, ఆసఫ్‌జాదౌహిత్రుడయిన ముజఫరుజంగుకును, పోరాటము సంభవించెను. తండ్రిమరణసమయమున హైదరాబాదులో నుండిన నాజరుజంగు ధనాగారము మొదలైనవి వశముచేసికొని హైదరాబాదుకు నిజాముయ్యెను.

హైదరాబాదుసింహాసనమునకు ఆసఫ్‌జా తన్ను నియమించెనని చెప్పి ముజఫర్‌జంగు నాజరుజంగుతో కలహించెను. ఆతడు కర్నాటకపు నవాబుపదవికి కలహించుచుండిన చందాసాహేబుతో చేరి ఫ్రెంచివారి సాయము కోరెను. ఫ్రెంచివారు చందాసాహేబు, ముజఫర్‌జంగుల పక్షమవలంబింపగా ఇంగ్లీషువారు నాజరుజంగు కర్నాటకమునకు నవాబుగా నియమించిన మహమ్మదాలిపక్షమవలంబించిరి. ఫ్రెంచివారి అండ చూచుకొని తాను దక్కనుసుబాదారునని ప్రకటించుకొన్న తనశత్రువు ముజఫరుజంగును అణచివేయుటకును, కర్నాటకరాజకీయ వ్యవహారములను చక్కబెట్టుటకును నాజర్‌జంగు సైన్యసమేతుడై కర్నాటకమునకు వెళ్లెను; కాని దారిలో హతుడయ్యెను. వెంటనే ఫ్రెంచివారు ముజఫర్‌జంగును దక్కనుసుబాదారుగా ప్రకటించి పుదుచ్చేరికి తీసికొనివచ్చి గొప్ప ఉత్సవముతో వైభవముతో హైదరాబాదురాజ్యమునకు 1750 లో పట్టము కట్టి, యథావిధిగ రాజ్యమునకు అభిషేకించి సింహాసన మెక్కించుటకు బుస్సీనాయకత్వమున హైదరాబాదు నగరమునకు అత్యంతవైభవముతోను ఉత్సవముతోను తీసికొని వచ్చుచుండగా అతడు దారియందు 1751 జనవరిలో హతుడయ్యెను.

వెంటనే ఫ్రెంచివారు ఆసఫ్‌జామరియొకకుమారుడును, నాజర్ జంగు సోదరుడును అయిన సలాబత్‌జంగ్‌ను దక్కను సుబాదారుగ

ప్రకటించి, హైదరాబాదులో అతనికి యథావిధిగ పట్టము కట్టిరి. సలాబత్ జంగ్ అదివరకు ఫ్రెంచివారు తీసికొన్న మచిలీపట్టణమును వారికి స్థిరపరచుటేకాక నరసాపురమును, నిజాంపట్నమునుకూడ వారికి దఖలుపరచెను. బుస్సీనాయకత్వమున ఫ్రెంచి సైన్యములు నిజాము సలాబతుజంగు రక్షణనిమిత్తమును, ఉపయోగము నిమిత్తమును హైదరాబాదులోనే యుండిపోయినవి. ఈ సైన్యపోషణమున కయినవ్యయమును సలాబతుజంగు ఫ్రెంచివారికి తనఖజానానుండి రొక్కము రూపమున ఇచ్చుచువచ్చెను. ఈసలాబత్ జంగే బొబ్బిలి కథలోని 'పాఛావు'.

సలాబత్ జంగు దర్బారులో క్రమముగా ఫ్రెంచివారి పలుకుబడి అధికమైనది. రాజకీయవిషయము లన్నిటిలోను బుస్సీ సలాబతు జంగుకు ముఖ్యుడైన సలహాదా రయ్యెను. బుస్సీతో ఆలోచింపకుండ అత డేపనియు చేయువాడు కాడు. ఫ్రెంచివారి పలుకుబడి యధిక మగుట నిజాముకొలువులోని ఉమ్రావులకును, ఇతరోన్నతోద్యోగుల కును కొందరికి దుర్భరమయినది. సలాబత్ జంగు దివానుకే అది కంటకమైనది. వారు ఫ్రెంచివారికిని, సలాబత్ జంగుకును గలమైత్రిని చెడగొట్టుటకు చాల ప్రయత్నించిరి కాని విఫలమనోరథు లైరి. తుదకు వారు ఫ్రెంచిసైన్యముయొక్క పోషణమున కీయవలసిన రొక్కము వారికి సకాలమున గాక తరచుగా చాల ఆలస్యముగా చెల్లింపబడునట్లు చేయగలిగిరి. దీనితో బుస్సీ విసిగి వేసారి తుదకు ఫ్రెంచి సైన్యముయొక్క పోషణమునిమిత్తము రొక్కమునకు బదులుగా శాశ్వతముగా సర్కారుల నీయవలసినదని సలాబతుజంగును కోరెను. నిజాము సలాబతుజంగు తుద కందు కంగీకరించి సంవత్సరమునకు ముప్పదిలక్షలకు పైబడిన ఆదాయము వచ్చు కొండపల్లి, ఏలూరు, రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారులను 1753 లో ఫ్రెంచి వారి కిచ్చివేసెను.

సర్కారుల కప్పుడు మచిలీపట్టణము ప్రధానస్థానముగా నుండెను. మురారిరావు దాని కధిపతి. క్రొత్తగా ఫ్రెంచివారికి చేపడిన సర్కారులను

వశపరచుకొనవలసినదని బుసీ్సి మొరాసినుకు ఉత్తర విచ్చెను. ఆ సమయమున శ్రీకాకుళము ఫౌజుదారు జాఫ రలీ. నిజాము సర్కారులను ఫ్రెంచివారి కిచ్చివేయుట అతని కెంతమాత్రము ఇష్టము లేదు. అందువలన వానిని వశపరచుకొనుటకు వచ్చు ఫ్రెంచి సేనను కలిసి అడ్డగింతమని అతడు సర్కారులలో బలవంతుడును, గొప్ప జమీన్ దారును అయిన విజయనగర సంస్థానాధిపతి పెదవిజయరామరాజును ప్రోత్సాహపరచెను. కాని, కనీసము వెల కట్టి చాల తక్కువ కప్పము చెల్లించు పద్ధతిని శ్రీకాకుళము, రాజమహేంద్రవరము సర్కారులను ఇచ్చెదనని చెప్పి మొరాసిన్ జాఫ రలీపక్షమునుండి పెదవిజయరామ రాజును విడదీసి తనతో సహకరించునట్లు చేసికొనెను. తన యెత్తు భగ్నమయిపోయినందుకు చింతించి పెదవిజయరామరాజుమీాది కోపముతో జాఫ రలీ తన సర్కారు విడిచిపెట్టిపోయి నాగపూరులోని మహారాష్ట్రుల నాశ్రయించి, వారిని శ్రీకాకుళముసర్కారుపై దండెత్త ప్రోత్సహించెను. మహారాష్ట్రులకును సలాబతుజంగుకును యుద్ధము జరగుచుండిన సమయ మది. జాఫ రలీప్రోత్సాహమున 1754 లో మహారాష్ట్రులు శ్రీకాకుళము సర్కారుపై దండెత్తి వచ్చిరి. కాని, వారికి కొండలవరుస లడ్డువచ్చినవి. ఈకొండలలో పాచిపెంటనుండి జయపురరాజ్యములోనికి వచ్చుటకు ఒక్కకనుమ (కొండ త్రోవ) కలదు. జయపురరాజ్యములో ప్రవేశించినచో సముద్రతీరప్రదేశమునకు వచ్చినట్లే. శత్రువులు ఎగువదేశమునుండి ఈకనుమగుండ రాకుండ అరికట్టి కాపాడుటకు జయపురాధీశ్వరులు కొన్నిగ్రామములను, దక్షిణ కవాటయువరాజబిరుదమును ఇచ్చి, పాచిపెంటలో కొండదొరలను నియమించిరి. పైనుడివిన కనుమ – పర్వతదక్షిణద్వారమును – కాపాడుచు పాచిపెంటజమీన్ దారులు జయపురాధీశ్వరులకు విశ్వాసపాత్రులైన మిత్రులై మెలగుచుండిరి. 1752 ప్రాంతమున పాచిపెంటజమీా విజయనగరాధీశ్వరుల అధికారముక్రిందికి వచ్చెను. వెంటనే విజయనగరము పెదవిజయరామరాజు పాచిపెంట వీరప్పరాజును తొలగించి

దేశమునుండి వెడలగొట్టెను. ఈపగ మనసులో పెట్టుకొని వీరప్పరాజు దండెత్తివచ్చు మహారాష్ట్రులకు దారి చూపి శ్రీకాకుళము సర్కారు లోనికి వెళ్లుటకు సాయపడెను. మహారాష్ట్రులు కొండలు దాటి రాలేరన్న ధైర్యముతో పెదవిజయరామరాజు సైన్యములను సిద్ధముచేయక అలక్ష్యముగా నుండెను. ఇంతలో మహారాష్ట్రసైన్యములు ఆకస్మికముగ వచ్చి విజయనగరరాజ్యముపైబడి పెదవిజయరామరాజు నోడించినవి. పెదవిజయరామరాజు శత్రువుల నణచివేసి పారద్రోలుటలో మొరాసిను సాయము వేడుటకు మచిలీపట్టణము పారిపోయెను. ఈలోగా మహారాష్ట్రులు శ్రీకాకుళము సర్కారు నంతను, అందు, ముఖ్యముగా విజయనగరసంస్థానములోని యూళ్లను దోచుకొని, ఇండ్లను తగులబెట్టి ఎంత బీభత్సము చేయవలెనో అంతయు చేసిరి. మచిలీపట్టణము పరిపాలకుడు మొరాసిను తనవద్దనున్న సైన్య మంతయు పెదవిజయరామరాజునకు తోడిచ్చి మహారాష్ట్రులపై పంపెను. విజయానంతరము మహారాష్ట్రులు గుంపులు గుంపులుగా విడిపోయి, గ్రామములను కొల్లగొట్టి తీసికొనిపోవుటకు సాధ్యమయినంత కొల్లను కొంతమంది సాయముతో సురక్షితముగా తమ దేశమునకు పంపివేసి ఫ్రెంచివారియొక్క, పెదవిజయరామరాజుయొక్క సైన్యములను అనకాపల్లి దగ్గరనున్న తుమ్మపాలవద్ద ఎదుర్కొనిరి. అక్కడ జరగిన యుద్ధములో మహారాష్ట్రులు ఓడిపోయినను, కొల్లతో పంపిన తమ సైన్యమున కిక అపాయము లేదని తెలిసికొనినంతవరకు వేరు వేరు చోట్ల వారు శత్రువు నడ్డగించుచు ఈప్రాంతములనే యుండి రాజమహేంద్రవరము సర్కారునుకూడ కొల్లగొట్టి పిదప ఆకస్మికముగా గోదావరినదిని దాటి ఏలూరు సర్కారుగుండ పోయి తుదకు ఫ్రెంచిరాజ్యమును దాటిపోయిరి.

> పెండారి గుర్రముచేత దేశము దోపిడి పోయింది
> డెబ్బయిరెండు మన్యాలవా రొక డబ్బుకట్టలేదు (పుట 30)
> నా దేశంలోనే డబ్బు లేదుగా బూసీ మహరాజ
> మరాటి గుర్రముచేత దేశమే దోపిడి పోయింది (పుట 112)

అను చరణములలోని పెండారి గుఱ్ఱము, మరాటి గుఱ్ఱము కథ యిదే.

బుస్సీ హైదరాబాదునుంచి మచిలీపట్టణము వచ్చి అక్కడి నుండి రాజమహేంద్రవరము వెళ్లి వ్యవహారములను చక్కబెట్టుకొని ఫ్రెంచియధికారమును మరల సర్కారులలో స్థాపించెను ; ఇబ్రాహీమ్ ఖాన్ అనునతనిని శ్రీకాకుళము సర్కారుకు ఫౌజుదారుగ నియమించెను.

త్వరలోనే మరల బుస్సీకిని సలాబత్ జంగుకును గలమైత్ర్యను బంధము చెడినది. బుస్సీ దూరప్రాంతమున యుద్ధము చేయుచుండిన కాలమున అతని విరోధులు సమయము చూచి అతనిమీద కొండెములు చెప్పి సలాబతుజంగు మతి విరిచిరి. బుస్సీ మరలి వచ్చి ఔరంగాబాదులో నుండిన సలాబత్ జంగును కలసికొనుటకు వచ్చినపుడు అతనికి నిజాముదర్శనము దొరకకపోవుట అటుండ, అతనిని నిజాము తన కొలువునుండి బర్తరఫ్ చేసినట్లు అతని కొకయుత్తరువు అందజేయబడెను. ఇది కేవలము నిజాముపని కాదనియు, అతని సలహాదారులు చేసిన కుతంత్ర మనియు, ఎప్పటికైనను నిజాము మరల తన్ను చేరదీసి ఆదరింపక పోడనియు విశ్వసించి, నిజాముపై కేవలము వైరము వహింపక బుస్సీ తదనుగుణముగా ప్రవర్తింపజొచ్చెను. ఆసమయమున బుస్సీవ్యతిరేకపక్షమువారు అతనిని సైన్యముతో ఎదుర్కొని, మదరాసులోని ఇంగ్లీషు కుంఫిణీవారి సాయము వేడిరి. ఇదియే తగిన యదనని ఇంగ్లీషువారు స్వలాభాపేక్షతోను, ఫ్రెంచివారి నణగద్రొక్కవలెనను ఉద్దేశముతోను సంతోషముతో వారి సాహాయ్యార్థము సైన్యమును పంప దలపెట్టునంతలో కలకత్తాలోని ఇంగ్లీషువారి సాహాయ్యార్థము సైన్యములను పంపవలసినదని వారి కుత్తరువులు వచ్చుటచేత వారేవిధమునను సాయపడలేకపోయిరి.

నిజాము సైన్యము వెన్నంటి తరుముచుండగా రక్షణచేసికొనుచు బుస్సీ ఎట్టెట్లో తన సైన్యముతో ఔరంగాబాదునుండి 1756 లో మేనెల

25వ తేదిని బయలుదేరి హైదరాబాదుకు వచ్చి అక్కడికి దగ్గరనున్న చార్ మహల్‌తోటలో స్కంధావారము నేర్పాటుచేసికొని, స్వసైన్య రక్షణకు తగిన కట్టుదిట్టములు కావించుకొని శత్రువుతో పోరాడుటకు కృతనిశ్చయుడై, తాను చాల ప్రమాదకరమైన పరిస్థితిలో నుంటినని, తనకు కొంత సైన్యమును సాయముగ పంపవలసినదని పుదుచ్చేరికిని, మచిలీపట్టణమునకును రహస్యముగ వార్త లంపెను.

ఇట్టి పరిస్థితిలో బుస్సీవ్యతిరేకులైన నిజాము ఉన్నతోద్యోగులు కొందరు ఫ్రెంచివారికి సర్కారుల నిచ్చిన ఉత్తరువును రద్దుపరచి నిజాము మరల వానిని తనవశముచేసికొనెనని యొకవార్త పుట్టించిరి. బుస్సీమీద నిజాము కత్తి కట్టి యుద్ధముచేయుచుండెనను వార్తతోపాటు అది క్రమముగా సర్కారు లన్నిటిలోను వ్యాపించెను. దానితో దేశ మరాజకమైనది. విజయనగరసంస్థానాధీశ్వరుడయిన పెదవిజయరామ రాజు తక్క మిగిలిన జమీన్‌దారులును, పాళెగాండ్రును మాత్రమే కాక తుదకు ఫ్రెంచివారిచే నియమితుడయిన శ్రీకాకుళము ఫౌజుదారు ఇబ్రాహీముఖానుకూడ ఫ్రెంచివారికి చెల్లింపవలసిన పైకము చెల్లింపక వారి యధికారమును ధిక్కరించి స్వతంత్రముగ వ్యవహరింప జొచ్చిరి. పెదవిజయరామనృపాలుడుమాత్రము తాను ఫ్రెంచివారికి (పరాసు వారికి) విశ్వాసపాత్రుడయిన విధేయసామంతుడ ననియు, తప్పక కప్పము సరిగా చెల్లింతు ననియు నచ్చజెప్పుచు హైదరాబాదులోని తన కార్యకర్తద్వారా ఆవిపత్సమయమున బుస్సీకి రహస్యముగా వార్త లంపుటయే కాక అతనికి చేతిలో ఎర్రని యేగాని లేని చాల సంకటసమ యములో అతనికి తన కార్యకర్తద్వారా అతడు గుప్తముగా తీసి కొనిపోగలిగినంత బంగార మిచ్చి పంపి తనరాజభక్తిని రుజువు చేసికొనెను.

చార్‌మహాలులో దండుతో విడిసినకాలములో సలాబత్‌జంగు పక్షమువారు మహారాష్ట్రులను కొందరిని కూడగట్టుకొని తమ తమ సైన్య ములతో బుస్సీని మార్కొనిరి; సామ దాన భేదోపాయములచేత బుస్సీ

సిపాయిలను, ఇతర సైనికోద్యోగులను తమపక్షమునకు త్రిప్పుకొనిరి. తన సేనలోనివారు కొందరు పరసైన్యములో కలసినను ధైర్యమును విడనాడక ఫ్రెంచిసైన్యముల రాకకు ఎదురుచూచుచు బుస్సీ అయిదు వారములకు పైగా శత్రువులతో పోరాడుచునే యుండెను.

పుదుచ్చేరినుండి కొంత సైన్యము ఓడలో మచిలీపట్టణమునకు పంపబడినది. అది మచిలీపట్టణము చేరకమునుపే లా దొర నాయకత్వమున మొరాసిను కొంత సైన్యమును బుస్సీసాహాయ్యార్థము పంపెను. ఈసేన హైదరాబాదులోని బుస్సీసైన్యముతో కలియకుండ జేయుటకు శత్రువులు అడ్డంకులు కల్పించి దారిలో దాని నెదుర్కొని సర్వవిధముల నాశముచేయ బ్రయత్నించిరి. కాని వారిప్రయత్నము పూర్తిగా ఫలింపలేదు. తనకు సహాయముగ వచ్చిన సేన చేరువ నున్నదని తెలియగనే బుస్సీ తన స్కంధావారమును విడిచి వెలుపలికి వచ్చి తన పరిమిత సైన్యముతోనే నిజాముసైన్యములను బహిరంగముగ ఎదుర్కొని పోరాడెను. ఇంతలో మచిలీపట్టణమునుండి వచ్చిన సేన అతనిని కలసికొనెను. ఫ్రెంచివారు అజేయు లనియు, తమకు అపజయము తథ్య మనియు భావించి సలాబత్ జంగు రాజీనిమిత్తము బుస్సీ వద్దకు రాయబార మంపెను.

బుస్సీ అనుకొన్నంత జరిగినది. అతడు తనకు వ్యతిరేకముగ పని చేసినవారిని కొలువులోనుండి తీసివేయుమని కాని, తన సేనలోనుండి పోయి పరసేనలో చేరినవారిని శిక్షింపుమని కాని, పరిత్యజింపుమని కాని ఎట్టి షరతులును పెట్టలేదు; ఎవరిమీదను ఏవిధమైన కార్పణ్యమును చూపలేదు; నిజాము తన్ను పూర్వమువలె ఆదరింపవలెననిమాత్రమే కోరెను. బత్తరపుచేసిన మూడు నెలలకు తరువాత 1756లో ఆగస్టు 20వ తేదిని సలాబత్ జంగు బుస్సీని అతనికి పూర్వము నడచుచుండిన బిరుదములతోను, గౌరవములతోను, మర్యాదలతోను బహిరంగసభ చేసి తనకొలువులోనికి తిరిగి తీసికొని అతనిని ఆదరించి సంభావించెను. సలాబత్ జంగు కొలువులో తాను కోల్పోయిన గౌరవాదరములను;

మర్యాదలను బుస్సీ మరల సంపాదించుకొని ఫ్రెంచివారి ప్రతిష్ఠను, పలుకుబడిని ఇనుమడింపజేసెను.

దేశ మెరుగని పరాసుబలము దేశము కొచ్చెను
భూము లెరుగని పరాసులు మన భూముల కొచ్చిరి
పాఛావుని సాధించిన పరాసులే వీరు
గోలకొండ దరబారీమీద కొట్టి పోరినారు.

అను చరణములలో గల ఇతిహాస మిదే.

బుస్సీ ఆగస్టు 26వ తేదినుండి నవంబరు 16వ తేదివరకు హైదరాబాదులోనే ఉండి, తన స్థితిని చక్కబరచుకొని పిదప సర్కారులలో ఫ్రెంచివారికి రావలసిన కప్పమును రాబట్టుకొనుటకును, అస్తవ్యస్తమయిన ఫ్రెంచివారి అధికారమును తిరిగి స్థాపించుటకును 500ల యూరోపియనుల (సోలుజాదుల)తోను 4,000ల మంది సిపాయిలతోను 16వ తేదిని బయలుదేరి సర్కారులకు వచ్చెను. ఇట్లు వచ్చుటలో ఫ్రెంచివారి కష్టసమయములో వారియెడల రాజభక్తివిశ్వాసములు కలిగియుండి వారిని ఆదుకొన్నవారిని బహుమానించుట, వారన్న అనిష్టము చూపినవారిని, వారిమీద తిరుగబాటు చేసినవారిని శిక్షించుట బుస్సీప్రధానోద్దేశమయినట్లు కనబడును. బుస్సీ హైదరాబాదు నుండి సర్కారులకు బయలుదేరిననాటినుండియే మనబొబ్బిలికథ ఆరంభము.

బుస్సీదివాను హైదరుజంగు. బెజవాడలో బుస్సీ లక్ష్మన్నను దుబాసిగా ఏర్పాటుచేసికొనెను. కొండపల్లిసర్కారు నేలుచుండిన నూజవీడి పొట్టెయ్యవద్దనుండి ఏలూరిపరగణా పరిపాలించుచుండిన నూజవీటి అప్పారావువద్దనుండి, మొగలితుర్రు కలిదిండి వెంకటరామరాజువద్దనుండి, కొవ్వూరిమహాలు నేలుచుండిన రావల్ దేవువద్దనుండి వారు బాకీపడిన కప్పమును వసూలుచేసికొని బుస్సీ కతిపయప్రయాణముల 1756 డిసెంబరు 19వ తేదికి రాజమహేంద్రవరము చేరుకొనెను.

రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారులలోని జమీన్‌దారు లందరిలో విజయనగరసంస్థానాధిపతి పెదవిజయరామరాజు గొప్ప జమీన్‌దారు, పెద్దాపుర సంస్థానాధిపతులు వత్సవాయ జగపతులును, పిఠాపురముసంస్థానము వెలమప్రభువులు రావువారును విజయనగర సంస్థానాధిపతుల తరువాతివారే హోదలో. బుస్సీ రాజమహేంద్రవరమునుండి వార్త నంపగా పెదవిజయరామరాజు పదివేల బలముతో విజయనగరమునుండి బయలుదేరి కతిపయప్రయాణముల రాజమహేంద్రవరముదగ్గర రాజానగరమునకు వచ్చి విడిసి అచ్చటి నుండి వచ్చి బుస్సీని సందర్శించెను. పెదవిజయరామరాజు బయలుదేరి వచ్చునపుడే తనకు అణకువయైన సంస్థానాధిపతులకును, పాళెగాండ్రకును బుస్సీదర్శనార్థము తనతో రావలసినదని జాబులు వ్రాసి పంపెను. ఆవిధముగానే బొబ్బిలి రంగారావునకుకూడ వెనుకటి కోడిపందెములనాటి, పిగిలిపిట్టల పందెములనాటి పగలు మనసులో పెట్టుకొనక విజయనగరము వచ్చినచో కలిసి రాజమహేంద్రవరము వెళ్లుదమని జాబులంపెను కాని, రంగారావు వాటిని చించివేసి అతని కోరికను తిరస్కరించెను.

రాజమహేంద్రవరమున బుస్సీదర్శనము చేసినప్పుడు విజయరామరాజు బొబ్బిలివారిమీద తన పగ తీర్చుకొనుటకు అదియే తగిన అదనని సర్కారులలో ఫ్రెంచివారికి రావలసిన పైకము చెల్లకుండజేయుటకును, ఫ్రెంచివారి యధికారమును పాళెగాండ్లు మొదలైనవారు ధిక్కరించుటకును మూలకారణము రంగారావే యని ఇంకను అతనిమీద ఏవేవో నిందలు మోపి, బొబ్బిలికోటలోనుంచి రంగారావును వెళ్లగొట్టి దానిని తనయన్నకుమారుడు ఆనందగజపతిరాజునకు దఖలుపరచవలసినదని బుస్సీని వేడుకొనెను. బుస్సీ తుదకు అందుకు సమ్మతించి రాజమహేంద్రవరమునుండి, పెద్దాపురము పిఠాపురములమీదుగా విజయరామరాజుతో కలసి కతిపయప్రయాణముల బొబ్బిలి చేరి దాని సమీపమున దండు విడిసెను. అక్కడనుండి, బొబ్బిలికోట విడిచి

పెట్టి పోవలసిన దనియు, బొబ్బిలికి బదులుగా శ్రీకాకుళము సర్కారు లోనే మరొకచోట అంతకంటె ఎక్కువ భూమిని ఇచ్చెద ననియు, బుస్సీ రంగారావుకు చెప్పి పంపెను. బొబ్బిలికోట విడిచిపెట్టి పొమ్మని బుస్సీ ఆజ్ఞాపించుట రంగారావుకు తల కొట్టిన ట్లయినది. అది వెలమవారి గౌరవప్రతిష్ఠలకు ఆఘాతము కలిగినట్లయి బుస్సీ యుత్తరువుకు రంగారావు అంగీకరించ లేదు. రాజమహేంద్రవరము దర్శనమునకు రాకపోవుట మాది నేరమే యైనచో రాజమహేంద్రవరము హద్దు చేసికొని బొబ్బిలి వరకు మజిలీకి వేయేసి రూపాయ లిచ్చెదము, తీయుమన్న కోటలు తీసెదము, నిలువుమన్న మీ జెండాక్రింద నిలిచెదము, ఎంత పైకము కావలెనన్న అంత పైకము ఇచ్చెదము, అంతేకాని బొబ్బిలికోటమాత్రము వదలమని కచ్చితముగా రంగారావు బుస్సీకి బదులు చెప్పి పంపెను. చుట్టుపట్ల దేశములోని మన్నెగాండ్లను సాధించుటకు ఒకదళము సిపాయిలను పంపవలసిన అవసరము కలిగి బొబ్బిలి అడవులలోనుండి దగ్గరత్రోవ యుండగా వారా త్రోవను వెళ్లుటకు బుస్సీ బొబ్బిలివారి అనుమతిని తీసికొనెను; కాని పెదవిజయరామరాజు కుతంత్రమువలననో, లేదా రంగారావు పూర్వమే నిశ్చయము చేసికొనియుండుటవలననో ఆదళము సిపాయులు దారిలో అడ్డగింపబడిరి; పోరాటము జరిగినది. దళములోని ముప్పదిమంది హతులైరి; చాలమంది గాయపడిరి. తుదకు మిగిలిన దళమువారు తిరిగి వచ్చి బుస్సీకి ఈవిషయ మంతయు నివేదించిరి. అదివరకే బుస్సీ కోట వదలి వెళ్లనని చెప్పి తనయాజ్ఞ తిరస్కరించి నందుకు రంగారావుమీద కోపముగా ఉండెను: ఈజరగిన యుదంతము మండుచున్న అగ్నిహోత్రములో ఆజ్యము పోసిన ట్లయినది. బుస్సీ కోపము మరింత అధికమయినది. దీనికితోడు ఈసంఘటనను అవకాశముగ దీసికొని పెదవిజయరామరాజు రంగారావుమీద ఏవేవో చెప్పి బుస్సీ క్రోధావేశముతో మరింత మండిపోవునట్లు చేసెను. వెలమవారి పౌరుష పరాక్రమములు కాని, ముందు జరుగనున్న సంహారకాండను గాని కించిత్తయినను ఊహింపలేక రంగారావును బొబ్బిలినుండి లేవగొట్టి కోట వశముచేసికొనవలెనని బుస్సీ నిశ్చయించుకొనెను.

రాబర్ట్ ఆర్మ్ అను ఆంగ్లేయ చరిత్రకారుడు బొబ్బిలికోటను, బొబ్బిలి యుద్ధమును ఈక్రిందివిధమున అభివర్ణించియున్నాడు :

ఫిరంగులు కాని బత్తేరి (మోర్చా-battery) యితరసాధనములు కాని ఉపయోగములోనికి రాని పూర్వకాలములో రక్షించుకొనుటకు తగినంత కట్టుదిట్టముగానే బొబ్బిలికోట నిర్మితమయినది. ఈకోట చదరముగా ఉన్నది. ఒక్కొక్క వైపు 200ల గజములకు మించి ఉండదు. గోడలో ప్రతికోణముదగ్గర గుండ్రని పెద్దబురుజు లున్నవి. ప్రక్క గోడలు మధ్యభాగమున చదరముగా ముందు పొడుచుకొనివచ్చినవి. ప్రాకారపుగోడ యెత్తు 22 అడుగులు; కాని లోపలి అలంగము యెత్తు 12 అడుగులు మాత్రమే. పైభాగమున దాని వెడల్పు అంతే. కాని దిగువభాగమున అది ఇంకను వెడల్పుగా ఉన్నదని చెప్పుదురు. ఇదంతయు పదనుచేసిన మట్టితో ఒక కీటు వేసి అది బాగుగా ఎండ కెండి గట్టిపడినపిదప మరొక కీటు వేసి యిట్లు కీట్లు క్కట్లుగా కట్టిన గోడ. అలంగముపైని పిట్టగోడయెత్తు పదడుగులు, మందము మూడడుగులు మాత్రమే: ఈగోడపైనుండి అయిదడుగులుక్రిందివరకు మూడు నాలుగడుగుల ఎడములో వరుసగా ఆరడుగుల వెడల్పుగల సందులతో గంట్లు గంట్లుగా ఉన్నది. ఈసందులయొక్క, బురుజుగోడలయొక్క అడుగునుండి ఒకయడుగు ఎగువను ఒకరంధ్రముల వరుసయును, రెండడుగులు దిగువను మరొకవరుసయును ఉన్నవి. అలంగమునకు రెండడుగుల యెడములో మూడవ వరుస యున్నది. వాడుకప్రకారము ఈరంధ్రములు తుపాకులు, బాణములు, ఈటెలు ప్రయోగించుటకు కాల్చిన కుండగొట్టములతో ఏర్పాటయినవి. ఈ రంధ్రములకు బదులుగా ఈయాయుధముల నన్నిటిని స్వేచ్ఛగా ఉపయోగించుట కుపయోగపడునవి ఈసందులు. ఆయుధములను రంధ్రములలో ఉంచుటకు కాని, మట్టిలో వాటిని చెరువుటకు కాని వీలు లేదు. బురుజులమీదను, ప్రాకారపుగోడలో మధ్య ముందుకు పొడుచుకొని వచ్చిన చచ్చౌకముమీదను మిగిలిన గోడమీదవలెనే

అదేవిధమైన పిట్టగోడ ఉండును. కోట ఎదురుగోడలలోని రెండు చచ్చౌకములలోను సింహద్వారము లున్నవి. వీటిలోనికి దారి ఎదురుగా కాకుండ ఒకప్రక్క కుండును. అక్కడినుండి అది సగము దూరముపోయి అక్కడ సమకోణముగా మలుపు తిరుగును. అపాయ మని ఎచ్చరిక తెలుపబడినప్పుడు ఈదారి కడ్డముగా కొట్టివేసిన చెట్లు వేయుదురు. ఈత్రోవ వెలుపలిప్రక్కల కొంతదూరమువరకు ముండ్ల తీగెలు ఒత్తుగా వేయుదురు. అలంగముమీద, పిట్టగోడమీద గడ్డితో నేసి స్తంభముల ఆధారమున వేసిన పాక యుండును. ఈపాకచూరులు బురుజుపైగోడలమీద ముందు కుండును కాని ఈచూరు, గోడకు మధ్య శరీరమును ఎంతబలవంతముగా త్రోసికొనియైనను మనుష్యుడు లోపలికి దూరుట కష్టసాధ్యమగునంత దగ్గరగా ఉండును. అలంగమునకు లోపలి రక్షకులకు ఎండ వాన తగులకుండ కాపాడుటకు ఉపకరించునది యీపాక. కోటకు చుట్టును 500ల గజముల, అంతకు మించిన ప్రదేశము ఖాళీగా ఉండును. ఈప్రదేశముచుట్టు 3, 4, 5 మైళ్ల లెక్క దట్టమైన మహారణ్యము. ఇటువంటి కోటలదగ్గరికి వెళ్లుటకు అడవిగుండ సాధారణముగా ఒకటేదారి యుండును. వెలుపలినుంచి ఈదారి ప్రవేశస్థలము రక్షణకు సరిగా కోటప్రక్కల చచ్చౌకములోని నిర్మాణము వంటిదే, అంతటి బలమైనదే — కొనలను గుండ్రని బురుజులతోను, మధ్య ద్వారసహితమైన చచ్చౌకముతోను — గోడ యుండును. సహజ వివేకమువల్ల కోటలోనివా రెప్పుడును ఈ బురుజును అడవియంచున నిర్మించరు. పల్లపుప్రదేశ మున్నచోట ప్రత్యేకము అడవిని నరికి దాని యడుగుభాగమున ఈబురుజును నిర్మింతురు. ఈపల్లపు స్థలము నకు ఇరుప్రక్కలను శత్రువులు చొరుచుకొని రాకుండ ఇబ్బంది కలి గించుటకు రొమ్ముఎత్తున మట్టిగోడయైనను కట్టెదరు; లేదా కంచె యైనను వేయుదురు. ఈదారిగుండ అడ్డముగా ముగ్గురు మనుష్యులు మాత్రమే పట్టుదురు. అడుగడుగునకు వంకరతిరుగుచు పోవు ఈ త్రోవలో అడవిలో రొమ్ముఎత్తున గోడయో కంచెయో ఉండి, ద్వారముదగ్గరవంటివే అన్నిపార్శ్వములందును రొమ్ముఎత్తున గోడయో

కంచెయో గలబురుజులు అనేక ముండును. బొబ్బిలికోట రక్షణ లట్టివి. ఇటువంటి బొబ్బిలికోటమీదికి స్వయముగా 10,000ల బలమునకు నాయకత్వము వహించిన పెదవిజయరామరాజు తోడు రాగా బుస్సీ 250 గుర్రపుదళముతోను, 500ల కాల్బలముతోను, నాలుగు ఫిరంగుల తోను వెళ్లినాడు.

" అడవిద్వారమువద్ద మొదటిబురుజుపిట్టగోడకు గురిపెట్టిన చిన్న ఫిరంగులు పేలుచుండగా కొన్నిదళములు నిప్పుతోను, చిన్న గొడ్డలి తోను వంకదారిప్రక్కలను చేరి దారిచేసికొనుటకు ఆరంభించెను. ఈవిధముగా ఆబలము బురుజుదగ్గరికి పోగలిగెను. అపాయము కలుగు నని తోచినవెంటనే కావలివారు వారిస్థానమును వదలిపెట్టి తమ వెను కటిస్థానములలో నున్నవారిని కలిసికొనిరి. అయిదుమైళ్ల దారిపొడుగు నను ఈవిధముగానే జరగుచువచ్చినది. ఫ్రెంచిసేనలో కొందరు నష్టమైపోయినను సేన ముందుకు సాగుచునే వచ్చినది. కోట దృష్టి పథములో పడినవెంటనే కోటను నాలుగువైపుల ముట్టడించుటకు బుస్సీ ఆతనిసైన్యమును నాలుగు విభాగములు చేసి బురుజులను పడగొట్టుటకు ప్రతిబురుజుకు ఎదురుగా ఫిరంగులు పెట్టి మోహరించెను. రంగారావు ఆయుధపాణులైన 250 మందితోను, దాదాపు అంతకు రెట్టింపుమంది - స్త్రీలు, పిల్లలు, తన కులమువా రందరితోను కోటలో నుండెను.

" బొబ్బిలికోటముట్టడి 1757వ జనవరి 24వ తేది తెల్లవారగట్ల ఆరంభమైనది. ఫ్రెంచివారు బురుజులమీదికి ఫిరంగులను గురిపెట్టి కాల్చుచుండగా అలంగముమీది పాక నిప్పంటుకొనునని కోటలోనివారు దానిని పీకివేసినారు. ఉదయము తొమ్మిదిగంట లగుసరికి కోట కొమ్మ లనేకము భగ్నముయినవి. అప్పుడు నాలుగుసేనా విభాగముల లోను ముందున్న తుకిడీ లన్నియు ఏకకాలములో లగ్గలు పట్టుటకు నిచ్చె నలతో ముందుకు సాగినవి. ఒకగంటసేపు గట్టిప్రయత్నము చేసినప్పటి కిని పిట్టగోడమీదికి ఒక్క మనిషికూడ ఎక్కలేకపోయినాడు; అనే కులు క్షతగాత్రులై నేల కూలినారు. మిగిలినవారుకూడ అందరు

బాగుగా అలసిపోవువరకు ముందువారి వెన్నంటి వెళ్లిరి కాని వారి కెంతో అంతమాత్రమే వీరికిని లభించినది జయము. ఫ్రెంచిసేనలో యుద్ధమాపవలసినదని ఉత్తరువైనది. ఈవిరామకాలములో ఫిరంగులు ప్రేల్చుటవలన పిట్టగోడ వెనుకటికంటె ఎక్కువగా పడిపోయి రెండవ తడవ యుద్ధమునకు లాభించినది. కాని, ప్రమాదకరస్థితి అధికమగు టతో దుర్గరక్షకులకు కోటను కాపాడుకొనవలెనను పట్టుదల కూడ హెచ్చి వారు పెద్దపులులవలె క్రోధోద్రేకములోను, క్రౌర్యములోను తమ విడిదిపట్టులు, కుటుంబములను రక్షించుకొనుచు తీవ్రముగ పోరా టము సాగించిరి. వారిలో అనేకులు శత్రువుల గుండ్లను లక్ష్యము సేయక కోటకొమ్మలపై నిలబడి నిచ్చెనలను నరికివేసి పైకి రానీయ కుండజేయు నుద్దేశముతో ముందుగా పై కెక్కివచ్చువారితో తలపడి నారు. ఈప్రయత్నము విఫలమగుటతో వారిని ఈటెలతో పొడిచి నారు. కాని, వారు మరుగులేక పూర్తిగా బట్టబయలయినందువలన లగ్గలు పట్టు బలమునకు వెనుకనుండు సైనికులు గురి చూచి వారిని సులువుగా కాల్చివేసిరి. కోట ముట్టడించువారు దుర్గరక్షకుల ఈసాహస స్థితికి ఆశ్చర్యపడిరి. ఎందువలన ననగా హిందూస్తానులోని దేశీయులలో అంతటి అపారధైర్యసాహసములు యూరోపియను లెవ్వరును చూచి యెరుగరు ; చంపక వారికి సంతతము రక్షణ యిచ్చుచువచ్చిరి · దీనికి బదులుగా దుర్గపాలకులు వారిని హతమార్చు తలంపుతో విక్రమించుచు వచ్చిరి. మధ్యాహ్నము రెండుగంటలగుసరికైనను ఒక్కడుకూడ అలంగముమీఁది కెక్కలేకపోయెను. యుద్ధమును విరమింపవలసినదని మరియొకతడవ పరాసుసైన్యమున కుత్తరువయినది. అప్పుడు రంగారావు ముఖ్యులైన తనవారి నందరిని సమావేశపరచి, ఇక కోటను రక్షించు కొగలమను ఆశ లేదని చెప్పి తమ భార్యలు బిడ్డలు యూరోపియనుల బారిబడి మానభంగమునొందకుండను, అంతకంటెను ప్రధానముగా విజయరామరాజు అవమానకరమైన అధికారముక్రిందికి రాకుండను తక్షణము రక్షింపలసినయావశ్యకత కలదని విశదపరచెను. వివేచన లేకుండ కొందరిని పిలిచి వారిని ఈపనికి నియోగించెను. వారిలో

ఒక్కొక్కడు ఒకకాగడాతోను, ఈటెతోను, చురకత్తితోను బయలు దేరి కోటమధ్యనున్న వాసగృహములలోనికి వెళ్లి గంధకముతోను, తారుతోను అయత్తపరచిన వెంటితో జ్వాల రగుల్చుచు వివేచన లేకుండ వాటికి నిప్పంటించెను. వారు ఆమంటలలోనుండి, ఊపిరాడని ఆపరిస్థితినుండి తప్పించుకొని పారిపోవుటకు ప్రయత్నించిన ప్రతిస్త్రీని, ప్రతిబిడ్డను దయాదాక్షిణ్యములు లేకుండ పొడిచి పారవేసిరి. తల్లి వక్షస్థలమున కంటిపెట్టుకొనియుండిన దౌర్భాగ్యపు శిశువయినను భర్తచేతి నుండి తండ్రిచేతినుండి ప్రాణము కాపాడుకొనలేక పోయినది. ఈ హత్యాకాండ పూర్తిచేసి వారు వికలహృదయములతోను, భయంకరావేశముతోను గోడలమీద చచ్చుటకు కృతనిశ్చయులై తిరిగి వచ్చిరి. ఒక సేనావిభాగమున కధిపతిగా నుండిన లా యనునతడు కోటలోపలి అగ్నిజ్వాలలు చూచి, దుర్గరక్షకుల సంఖ్య చాల తగ్గినదని యోజించి మరల యుద్ధమునకు తలపడెను. కోట లగ్గలు పట్టుటకు నిచ్చెన లెక్కుచుండినవారనేకులు మరణించినవెనుక పొడుగుపాటి సిపాయిలు కొద్దిమంది పిట్టగోడ మీది కెట్లో యెక్కి చాలమంది వచ్చువరకు బురుజులో తమ స్థానమును భద్రముగా కాపాడుకొనిరి. శత్రువును తరిమివైచి బురుజును రక్షించుకొనవలెనను ఆత్రముతో వచ్చుచుండిన దుర్గాధిపతి రంగారావుకు తుపాకిగుండు దెబ్బ తగిలి అతడు వెంటనే మృతినొందెను. అతని పతనము అతని మిత్రులలో నిరుత్సాహము కలిగించుటకుబదులు తెంపరితనము నభివృద్ధిపరచినది. వారాతని హత్యకు పగతీర్చుకొనుటకు అతడు పడిన చోటికి మూగుటతో కొత్తళములోని యితరభాగములు ఖాళీయైనవి. ఫ్రెంచిసైన్యములోని ఇతర విభాగములు ఆరీతిగానే ముందుకు సాగి తమకు నియతములైన భాగములలో యుద్ధమారంభింపగా అన్నివైపులనుండి యనేకులు ఏయడ్డంకియు లేకుండ పిట్టగోడమీది కెక్కిపోయిరి. అయినప్పటికి ఒక్కరుకూడ దుర్గరక్షకులు బురుజు విడిచిపోనులేదు ; శత్రువు లిచ్చెదమన్న రక్షణకు సమ్మతించనులేదు. ప్రతివాడును శత్రువుమీది కురుకుచు శత్రువుతో తలపడుచు వీరశయనము నందెను. నేల గూలినతరువాతకూడ ప్రాణసంకటసమయమున చచ్చి

సనేకాని ఎవ్వడును తన చురకత్తిని వదలలేదు. ఈ సంగ్రామము లోని జనసంహారకాండ పూర్తియయిన తరువాత క్రిందిప్రదేశములో వారి కింతకంటెను అమితభయంకరమైన దృశ్యము కనులబడినది. విజయానందము మటుమాయమైనది. అందరు ఒకరి నొకరు అనుతాపముతో, వెరగుపాటుతో చూచుకొనిరి. వారిలో అతిక్రూరస్వభావముకలవారు కూడ తమ ముందు గోచరించిన ఘోరవిధ్వంసమును చూచి కంట తడిపెట్టకుండ ఉండలేకపోయిరి. ఇట్లు జరగుచుండ దూరముననున్న ఏదో యొకరహస్యప్రదేశమునుండి ఒకబాలుని తీసికొనివచ్చుచుండిన ఒకవృద్ధుడు వారికి కనబడెను ; శ్రద్ధాగౌరవాదులతో అతని నాదరించి సేనాని లాదొరవద్దకు తీసికొనివెళ్లగా ఆవృద్ధుడు 'ఇతడు రంగారావు కుమారుడు. ఇతని తండ్రియుద్దేశమునకు వ్యతిరేకముగా నే నితనిని రక్షించితి'నని చెప్పచు ఆబాలుని అతని కొప్పగించెను. మరల ఇంకొక మారు అక్కడివారిలో ఉద్రేకము రేగినది. తాము కారణముగా జరగిన ఈఘోరమైన సంహారకార్యమున కొంత ఉపశమనముగా ఉండునని అందరును ఆపిల్లవానిని రక్షింప నుద్దేశించిరి. వెంటనే అతనిని వృద్ధునితోగూడ బుస్సీవద్దకు గొనిపోయిరి. బుస్సీ కోటస్థితి విని దాని లోనికి వెళ్లక తన పటకుటీరముననే ఉండిపోయి అక్కడనే వారిరు పురిని సహాజసంరక్షకునివలె ఆదరించి బొబ్బిలిప్రాంతమునకు బదులుగా రంగారావు కిచ్చెదనన్న ప్రదేశమునకు అతని కుమారుని అధిపతిగా నియమించి శత్రువులబారినుండి ఆవృద్ధుని, బాలుని చాల భద్రముగా కాపాడుటకు ఉత్తరువు లిచ్చెను.

"ఆరాత్రియు, తరువాతి రెండుదినములును మామూలు పనులలో, ముఖ్యముగా సంఖ్యాతీతముగ నుండిన క్షతగాత్రుల సంరక్షణలో గడచి పోయినవి. కాని మూడవనాటి యర్ధరాత్రమున విజయరామరాజు శిబిరప్రాంతమందలి గంధ్రగోళముతో స్కంధావారములోని దండు భయ విభ్రాంతమయినది. రంగారావు హతుడగుట చూచి అతని సైని కులు నలుగురు చాల రాత్రిపడువరకు కోటలో ఎవరు పోవని ప్రదేశము

నందు దాగొని తరువాత మెల్లగా గోడలమీదినుండి క్రిందికి జారి విజయరామరాజుపక్షములోనివారివలెనే మాటాడుచు, అత దున్న ప్రాంతములో అనుమానము తగులకుండ సంచరించి దగ్గరి యడవిలోనికి పోయిరి; తరువాతి రెండుదినములు శిబిరములోని సందడి తగ్గువరకు కని పెట్టుచు అక్కడనే యుండిరి. తరువాత వారిలో ఇద్దరు అడవిలోనుండి తిరిగి వచ్చి తమ్ము ప్రశ్నించినవారిని ఇదివరకువలెనే రాజపక్షమున మాటాడి మరల మోసపుచ్చి విజయరామరాజు గుడారమువద్ద చేరి వెనుక వైపుండి నేలమీదుగా ప్రాకి గుడారములో ప్రవేశించి పరుపు మీద పరుండి నిద్రాముద్రితుడై ఒంటరిగానున్న ఆప్రభువును చూచిరి. విజయరామరాజు చాల స్థూలకాయుడు. ఆసనముమీదినుండి సహా యము లేనిదే లేవలేడు. ఆయిద్దరు ఊపిరికూడ విడువకుండ ఆపుకొని ఒకశే మారు తమ చురకత్తులతో విజయరామరాజుగుండెలలో పొడిచి నారు. మొదటిమూలుగుతో పారావా డొకడు లోపలికి వచ్చి వారిమీద తుపాకి ప్రేల్చెను కాని గురితప్పిపోయినది. ఇంతలో అనేకులు లోప లికి వచ్చి మూగిరి ; కాని హంతకులు తమ జాగ్రతయైనను చూచుకొన కుండ విజయరామరాజును చూపుచు, ఇదిగో చూడుడు, మాకు సంతృప్తి కలిగినదని బిగ్గరగా అరచిరి. వెంటనే వారి నక్కడ మూగిన వారు తక్షణము కాల్చిపారవేసి, పడిపోయిన తరువాత వారిని కడి కండలుగ కోసివేసిరి. అంతకు పూర్వమే వారు విజయరామరాజును ముప్పదిరెండు చోట్ల పొడిచిరి. ఈయిరువురును కృతకృత్యులు కాక పోయినచో అడవిలో దాగియున్న మిగిలిన యిరువురును విజయరామ రాజును వధించుటకు, లేదా తత్ప్రయత్నములో నశించుటకు శపథము పూనిరట."

ఇది రాబర్ట్ ఆర్మ్ (క్రీ. శ. 1728–క్రీ. శ. 1801) బొబ్బిలియుద్ధ వృత్తాంతము. బొబ్బిలియుద్ధ కాలమునాటివాడు కావున అతడు వ్రాసిన వృత్తాంతము పూర్తిగా కాకపోయినను చాలవరకు సరిగా నుండునని విశ్వసింపవచ్చును. కాని ఈబొబ్బిలికథలోని విషయమునకు, రాబర్ట్

ఆర్మ్ వ్రాసిన వృత్తాంతమునకు కొన్ని వ్యత్యాసములు లేకపోలేదు. 'రంగరాయ చరిత్ర', 'బొబ్బిలి కథ'ల ప్రకారము పెదవిజయరామ రాజును వధించినవారు రాబర్ట్ ఆర్మ్ చెప్పినట్లు ఇద్దరు మనుష్యులు కారు; ఈపని చేసినవాడు రాజాముకోటను కాపాడుచుండిన రంగారావు బావమరది తాండ్ర పాపయ్య. పెదవిజయరామరాజుహంతకుల విషయ మునసే కాదు, చరిత్రకును, 'బొబ్బిలి కథ'కును ఇంకను వ్యత్యాసము లనేక మున్నవి. బొబ్బిలి కథలో రంగారావు తమ్ముడు వెంగళరావు అనేకు లను హతమార్చి తుదకు శత్రువులచేత హతము కాకుండుటకై తన్ను తానే పొడుచుకొని చనిపోవును. కాని నిజముగా జరగిన విషయ మది కాదు. రంగారావుకుమారుడు బాలుడయిన వెంకట రంగారావును కూడ తీసికొని వెంగళరావు యుద్ధములో తప్పించుకొని భద్రాచలము నకు పారిపోయి, రెండుసంవత్సరములకు తరువాత విజయనగరసంస్థానా ధీశుడు ఆనందరాజు కల్నల్ ఫోర్డు అను ఆంగ్లేయ సేనానితో మచిలీ పట్టణములో ఉండిన కాలమునందు కొంతమందిని గూర్చుకొని వచ్చి రాజాము కోటను తిరిగి పట్టుకొనెను. విజయనగరము పూసపాటి వారు చివరకు వెంగళరావుతో రాజీ చేసికొని సంవత్సరమునకు రు. 20,000లు చెల్లించుపద్ధతిని కవిలె, రాజాము హుండాలను అతనికి కౌలు కిచ్చిరి. ఇది జరగిన తరువాత వెంగళరావు మూడేళ్లు జీవించెను. పిదప అవి వెంకట రంగారావు అధికారము క్రిందికి వచ్చెను. ఈతనిని చినరంగారా వందురు. 'బొబ్బిలి కథ' ప్రకారము బొబ్బిలి యుద్ధము రాత్రి యారంభమయినది; కాని చరిత్రప్రకారము ఇది నిజముగా ఆరంభమయినది తెల్లవారగట్ల. యుద్ధములో ఉభయపక్షములందును పాల్గొన్న సేనల సంఖ్యావిషయమునగూడ చరిత్రకును, 'బొబ్బిలి కథ' కును చాల వ్యత్యాసము కలదు. గోలకొండ చేరిన తరువాత హైదరు జంగు తన సేనలో అంత మంది హతులయినతరువాత తాను నిజామున కేమని చెప్పుదునని, ఇంకేటి బ్రతుకని తలపోసి బాకుతో పొడుచు కొని చచ్చినట్లు కథలో తెలుపబడినది. కాని యిది చరిత్రకు విరుద్ధము. బుస్సీ సర్కారులనుండి తిరిగి వచ్చి ఔరంగాబాదు వెళ్లి అక్కడి

రాజకీయవ్యవహారములను చక్కబెట్టుకొని హైదరాబాదుకు తిరిగి వచ్చునపుడు ఔరంగాబాదులో నుండిన సలాబతుజంగు సోదరుడు నిజామలీ హైదరుజంగును పటకుటీరములోనికి కపటముగా రప్పించి అతని నక్కడ కడతేర్చెను. ఈహత్య బొబ్బిలియుద్ధము జరగిన నాలు గైదు నెలలకు జరగినది. అందువలన చరిత్రననుసరించి చూచి నచో హైదరుజంగు ఆత్మహత్య కావించుకొనలేదు. ఈవ్యత్యాస ముల నన్నిటిని అనుసరించి చూడగా ఈకథగ్రంథకర్త ఈ గ్రంథమును కేవలము విషాదాంత గేయకావ్యముగానే తీర్చి దిద్దుటకు చారిత్ర విషయములను తారుమారు చేసి రసపోషణమునే ప్రధానాశయముగా బెట్టుకొని రచియించినట్లు కనబడును. కథలోని యుద్ధకాల సన్ని వేశము లన్నియు రసోద్వృత్తి కతడు కల్పించినవే.

ఈబొబ్బిలికథ ప్రధానముగ బొబ్బిలి అధిపతుల శౌర్యసాహస పరాక్రమముల నభివర్ణించుటకే రచియింపబడినది. గ్రంథకర్త బొబ్బిలి పక్షపాతి. బొబ్బిలినివాసికూడ అగునేమో. అందువలననే అత డీకథలో రంగారావును ఉత్తమనాయకునిగాను, అతని ప్రత్యర్థిని ద్వితీయనాయకునిగాను చేసెను. పెదవిజయరామరాజు కథలో చిత్రింప బడినంతటి క్రూరుడును, దుష్టస్వభావుడును కాడని ఆతని చరిత్రవలన విశదమగును. కథానాయకుడయిన రంగారావుపాత్రకు ఆధిక్యము కల్పించుటకే ప్రతినాయకుని పాత్ర నావిధముముగ చిత్రించె ననుట స్పష్టము.

ఈ కథలో తురకముమాటలు అనేకము వచ్చును. తెలుగు దేశము ముస్లిముల పరిపాలనక్రింద చాల కాల ముండుటవలన పరి పాలనకు, సైన్యమునకు సంబంధించిన పదము లనేకము పారసీభాష నుండియో అరబ్బీభాషనుండియో, ఉర్దుభాషనుండియో వచ్చి, తెలుగు దేశములో వాడుకలో నుండినవి. అవి యిప్పుడు వాడుకలో లేకపోవుట చేత వీటిలో కొన్ని పదముల యర్థము తెలియవచ్చుట లేదు.

బొబ్బిలికథ ఇప్పు డచ్చయినదే మూలమని నానమ్మకము. వేమన పద్యములవలెనే 'బొబ్బిలికథ' పాటయును కాలక్రమమున పెరిగి

పోయినది. ఇప్పుడు 'బొబ్బిలికథ' పాఠాంతరములు చాల కలవు. 'పెదబొబ్బిలిమహారాజు కథ' అనుపేర గుజిలీప్రతి ఒక టున్నది. దానిలో బొబ్బిలివారికి విజయనగరమువారికి జరగిన కోడిపందెముల పోట్లాటనుగురించిన కథకూడ నున్నది. ఈకోడిపందెములవిషయ మునకు ఈకథలో సూచనమాత్రమే కలదు. విజయరామరాజు బుస్సీ దర్శనమునకు రాజమహేంద్రవరము పోవునప్పుడు అందరు సామంతు లకును, పాళెగాండ్లకును వ్రాసినట్లే బొబ్బిలి రంగారావునకును జాబులు వ్రాయుసందర్భమున పూర్వపు కోడిపందెములనాటి, పిగిలిపట్టెలపందె ములనాటి పగలు తలప వద్దనెను. ఈచిన్న విషయ మాధారముగ పెదబొబ్బిలిమహారాజు కథలో కోడిపందెములకథ ఎక్కినది. ఈపెద బొబ్బిలి మహారాజుకథయును బొబ్బిలియుద్ధవృత్తాంతకథయే. అందు వలన ఇప్పుడు ముద్రితమయిన బొబ్బిలికథ చాల అమూల్యమయినది. దీనిలో హైదరాబాదునుండి బెజవాడకు, బెజవాడనుండి రాజమహేంద్ర వరమునకు, విజయనగరమునుండి రాజమహేంద్రవరమునకు, రాజ మహేంద్రవరమునుండి బొబ్బిలికిని గల మార్గమునందలి మజిలీ లన్నియు వర్ణితమైనవి.

శాతవాహన, కాకతీయ, విజయనగరసామ్రాజ్యములు కూలి పోయినవెనుక బొబ్బిలి, వెంకటగిరి, నూజవీడు, పెద్దాపురము, పిఠా పురము మొదలైన సంస్థానముల అధిపతులే కవులను, పండితులను పోషించి ఆంధ్రసంస్కృతికి ఆలంబములై నిలిచిరి. వారు తెలుగు భాషకు చేసిన సేవ అపారమయినది. ఈకథలో వచ్చునట్టి చాల విషయములనుగురించి యింకను వ్రాయవలసియున్నను గ్రంథ మిప్ప టికే విస్తర మగుటవలన విరమించితిని.

ఈ గ్రంథమును పరిష్కరించుటకు నాకొసగినందుకు క్యూరేటరుగారైన శ్రీటి. చంద్రశేఖరన్‌గారికి నాకృతజ్ఞతా పూర్వక వందనము లర్పించుచున్నాను.

పురశవాకము,
మద్రాసు, మన్మథ ఫాల్గుణము. } మల్లపల్లి సోమశేఖరశర్మ

# అర్థ వివరణము

అగాదు – శబ్దము, గుండ్ల ప్రయోగము (ఫిరంగి మొదలగు
అగ్ని ఆయుధముల గుండ్లు పేలుటవలన గలుగు శబ్దము
అడుపు – అడుకు(?), గుట్ట, దొంతర
అనుపు - పేర్పు(?)
అనుపు దిద్దుట – పేర్చుట(?)
అరాబు – అరాబాయన ఫిరంగిబండి, తుపాకిమందు
అరాబు పరపించు – మందు పరిపించు(?)
అవాజు – ధ్వని, శబ్దము
అసరాబుద్ధి - అసురబుద్ధి (రాక్షస బుద్ధి) లేదా అల్పపు బుద్ధి
ఆణిదారుడు – ఇజారాదారుడు(?)
ఆలకి - కుర్చీవంటి పల్లకి
కూచి – యుద్ధయాత్రా ప్రయాణము
కూచిలగుట – దండయాత్రకు సైనికుల కెచ్చరిక తెలుపుటకు
యుద్ధవాద్యములను వాయించుట
కొప్పుదబ్బ – వింటిబద్ద
కోశకి – రాజనింద(?)
ఖుర్నీసులుచేయు – వంగిసలాములుచేయు
గనీబులగుట – ముట్టడివేయుట(?)
గిరదాయించు – చుట్టుకొను
గిదరాయించు – గిరదాయించు రూపాంతరము
గుజిలీవేళ – సాయంకాలము
చదురుకట్నము – సభాకట్నము
చపేగారు – ఛాపాగారు (ఛాపా-ముద్ర); ముద్రవేయువాడు
చిట్టెలుపెట్టు – తంత్రముచేయు
చిట్టెలవాడి – తంత్రాలమారి
చోపుదారు – వేత్రహస్తుడు

చౌకీ - కావలి

జానకీ త్రాడు - పూర్వపు తుపాకి చెవియందుండు మందు ముట్టించెడు త్రాడు

ఝరేలున - వెంటనే

తఖ్తు - సింహాసనము

నఫిరి - సన్నాయివంటి యుద్ధవాద్యము

నిశాను - జెండా

నిమాని - మకాము(?)

నెలవరి - పరిచయుడు

పరాసువారు - ఫ్రెంచివారు

పురతగీసులు - పోర్చుగీసువారు

ఫేష్కారు - తాలూకా శిరస్తాదారుడు

భేటికట్నము - దర్శనముచేసినప్పుడు చెల్లించు కట్నము

మజుందారు - రెవిన్యూ ఉద్యోగి

మజూరు (మజ్దూరు - కూలి) - కూలీలు(?)

మసూరు - కీర్తి, ప్రతిష్ఠ

మేమాను - కృపగోరి సమర్పించుకొను కానుక

మొకరారుచేయు - నిర్ణయించు, నియమించు

మొఖాస - పన్నులేకుండ ఇచ్చిన గ్రామము, భూమి

మోరు - మొహరు

మోరుజా - మోర్చా, ఫిరంగుల బత్తేరి (battery)

వరాలు - వరహాలు

వులఫా - ఉలుఫా, బహుమతి

వోలుఖాన - ఓల్ఖానా, ఒక విధమైన చెరసాల

వోలుఖానా చేయు - నిర్బంధములో ఉంచు

సోలుదారులు - సోల్జర్లు

హుదుర్న - హుజూరున, సమక్షమున

# తప్పొప్పుల పట్టిక

| తప్పు | పంక్తి | ఒప్పు |
|---|---|---|
| దొరలు తమరు | (83) | దొరలు వారు |
| దువ్వతోటలో | (295) | దువ్వతేటిలో |
| వీణిపుడకలు | (325) | వీణెపుడకలు |
| గుడిచెర్ల | (626, 627) | గొడిచెర్ల |
| వొంటిపొంజు | (728) | వొంటెపొంజు |
| ముజుందార్లతో | (832, 836) | మజుందార్లతో |
| తుమ్మపోల | (861, 862) | తుమ్మపాల |
| ఊరి.శులతో | (872) | ఊరిపసులతో |
| దనిగడ్డకు | (926) | గనిగడ్డ(?) |
| వెంకటగిరి దామెర్ల వారు | (934) | కాళహస్తి దామెర్ల వారు |
| నిమామి(?) | (1186) | నిమాని(?) |
| పీనుగలు | (1242) | పీనుగులు |
| చపేగార్ల | (1279) | చాఫాగార్ల |
| నిశానిపట్టే | (1883) | నిశానుపట్టే |
| చిట్టలమారి | (2179) | చిట్టెలమారి |
| చెరువు(?)కుండ | (2328) | చెరవ(?)కుండ |

Monsieur అన్న ఫ్రెంచిమాట ఇందు మూసా యని, ముసే యని వ్రాయబడినది.

# బొబ్బిలి కథ

తందానతాన

వినుడి బొబ్బిలివారి వృత్తాంత మెల్ల భళీభళీ
రావువంశంబున రంగరావు వుదయించెను భళీభళీ
రంగారాయుడు వెంగళరాయుడు అన్నదమ్ములున్ను, భళీభళీ
అతివీరసేవ్యులున్ను ; అన్నపోటు తమ్ముడు తమ్ముడి
పోటు అన్నకూడా మెచ్చనివారు బొబ్బిలివారు భళీభళీ
ఆలాగంటి బొబ్బిలివారిమీద నవలకు
కళింగభూమి యేలేవాడు కళింగభూపతి
ఎవరెవరిని సాధించెనంటే — మాడుగుల యేలే
లింగారావును సాధించెను ; మన్నె మేలే మన్నె
భూపతిని సాధించెను ; టెక్కలిలో[1] వున్న జగద్దేవును
సాధించెను ; కోయ(?) నున్న కోయభూపతిని
సాధించెను ; బొగ్గులూరి జగ్గిరెడ్డిని సాధిం
చెను ; దూసరి అప్పరావును సాధించెను; కొ
ప్పాడ రామయ్యగారిని సాధించెను ;— బొబ్బి
లిలోవున్న రంగారావును సాధించలేక సీమ
నున్న పరాసుల [యె]త్తుకట్టుకొని, మూసే గదిల్, మూ
సే సవాల్, మూసే పనాల్ల, హాలోజా ; షుకు
రుల్లా, సిద్దీచిరేలు, కుమందాను, హైదరుజంగు,
హాసానల్లీ, గోరుందొర మొదలైనవారిని యెత్తు
కట్టుకొని మొవాసులువున్న[2] బొబ్బిలిమీదికి దం
డు తర్లెను[3] బెజవాడ ; కథా క్రమం బెట్టి దనిన;
ఫాల్గుణ బహుళ నాడు బొబ్బిలివారు స్త్రీలు పురుషులు

---

1. టెక్కలీలా. 2. మోవాసుల (చ). 3. తర్లను.

మరణాలవుతూవున్నారు యెటువలెను:—†
పాఛాయీ పరమాన అందీ పరాసులా బూసీ
గోలకొండ నబాబు దగ్గర పరమా నందెను
కళింగరాజ్యం కటకందాకా బూసికి అములాయె
శికాకోళమే[1] సింధుకటకమే బూసికి అములాయె
కట్టుమనె జెండాతాళ్లు కదలుమనె[2] బలము
వేలంలోపల గడ్యారమైతే[3] హెచ్చుగ వేసిరిగా
దండుబూరలే డమామిజోళ్లు కూచీ లాయెను
వేలంలోపల రుంజదెబ్బలే హెచ్చుగ వేసిరిగా
లక్షాడెబ్భైనాలుగువేలతో బూసి లేచినాడు
గోలకొండమజిలీలు దాటగా[4]దోబాట సింగారం[5]
బాటసింగారం మజ్జీలన్నా మల్కాపుర[6] మేమి
మల్కాపురము[6] మజిలీలన్నా రాముపల్లెలోను
రాముపల్లె మజిలీలన్నా నారికేళపల్లి
*నారికేళపల్లి మజిలీలన్నా మునగాలలోను
మునగాల మజిలీలన్నా కోదాళలోను[7]*
కోదాళమజిలీ దాటగా బేరమ్మదుపేట
బేరమ్మదుపేట మజిలీలన్నా సూరంపేటేమి

---

† 3 నుండి 23 పంక్తుల వరకు వచనమని తోచును.

1. 'శితాకోలమే'.

2. కట్టుమానె, కదలుమానె అని మూలము; తాళము సరిపోవుటకు కథలో ఈ విధమున హ్రస్వాక్షరము లుండవలసినచోట దీర్ఘాక్షరములును, దీర్ఘాక్షరము లుండవలసినచోట హ్రస్వాక్షరములు నున్నవి.

3. 'గద్యార'. 4. 'గట్టిగా'. 5. సింగారము—సింగవరము. 'డోబాట సింగారము'.

6. 'మల్లాపురము'. 7. 'నారికేళపల్లి మిజిలీలన్నా కోడాళాలోను'.

* ఈ గుర్తులలోనివి ఈ ప్రతిలో లేనివి; 'క' ప్రతిలోనో లేక 'చ' ప్రతిలోనో ఉన్నవి.

సూరంపేట మజిలీలన్నా నందిగామలోను
నందిగామ మజిలీలన్నా యిభరాంపట్నాము
ఇభరాంపట్నం మజిలీలన్నా బెజవాడలోను
బెజవాడ కృష్ణవొడ్డున వేసిరి డేరాలు[1]
మూడురోజులే బెజవాడలో మకాము చేశారు
బెజవాడ కనకదుర్గకే పూజలు చేసిరయా
బెజవాడ గాలీబుసాబుకే పానకం చేయించి
హైదరుజంగును హసానల్లిని హుదుర్న పిలిపించి
ఈ—దేశం యేలే జమీన్‌దారుడు యెవ్వా రన్నాడు
మహాప్రభో!—కొండపల్లి సర్కారు యేలును సూరనీడివారు
ఎక్క డున్నారో[2] యేడ నున్నారో[3] సూరనీడివారు
మైలారములో నున్నాడయ్యా సూరనీడి పొట్టెయ్య
నా భేటి కేల రాకున్నాడు పొట్టెయ్యగారు
దివాణమంటే గడనలేదుగా జమీన్‌దార్ల కేమి
మేము వచ్చిన పరవ వున్నదా జమీన్‌దార్ల కేమి
కరకరకర జాబులు వ్రాయుము వో హైదరుజంగు
సూరనీడి పొట్టెయ్యగారికే జాబులు వ్రాసిరిగా
జాబులలోపల యేమి వ్రాసెను[4] తా హైదరుజంగు
కూర్చుంటే కూర్చుండులాగున భేటికి రావాలె
నిలుచుంటే నిలుచుండులాగున భేటికి రావాలె
లేకుంటే నీ—కోటకొమ్మలే రవద్దూళిగ చేయించకపోను
గుర్రపుధాటీ చేయిస్తాను మైలారముచుట్టు
జాబులు వ్రాసి బేగిరావులచేతి కిచ్చినారు
రెండుజాములకు మైలారము ప్రవేశించినారు
పరాసువారి పరమా నంటూ గాన్లో[5] నిలిచిరి

---

1. 'జండాలు'. 2. 'ఎక్కడున్నరో'. 3. 'యేడనున్నరో'.
4. 'వ్రాసిరి'. 5. 'గాంట్లో'.

కొలువుతీరి తా కూర్చున్నాడు పాట్టెయ్యగారు
ఇవిగో—పరాసువారి జాబు లంటును చేతి కిచ్చినారు
జాబు వ్రాలు తా చూచుకొన్నాడు[1] పాట్టెయ్యగారు
జాబులు తెచ్చిన బేగిరావులకు బత్యా లిప్పించె
దంతపుకట్ల పల్లకి అప్పుడు బైటపెట్టు మనిరి
నాలుగువందల రాణువవారికి[2] పైనము చెప్పిరిగా
సానిమేళము సంగీతమేళమె పైనం చెప్పిరిగా
నఫిరీలన్నా పిల్లంగోళ్లు నాదులు మ్రోయంగ
చదురుకట్నమే[3] భేటికట్నమే హుదుర్న తీసుకొని
†సన్నబియ్యమే, చారపప్పురా[4], వేటపో
తులూ, కోళ్లకావిళ్లూ, సీమచిలుకలూ, రామచిలుక
లూ, పచ్చివెన్నరా, కోడిగుడ్లురా, మద్దు[5]మాంస
ము, బ్రాందిసారాయి, బూతపల్లిబుక్కాయి
పెట్టెలే బూసికి మేమాను†
గుర్రాలమీద ఢంకాలను గుబులుగ వేసిరిగా
తళుకు తళుకున బైలుదేరెను పాట్టెయ్యగారు
ముందరమొననె నడుస్తున్నది ముకుందబల్లెముగా
వెండికట్ల వెదురాకు యీటెల[6] వెలమదొరలు తమరు
సాక్కి(?)సన్నచువ్వీటెలవారు తెలగాలైతేను
బెజవాడాకు కలియవచ్చెను పాట్టెయ్యగారు
డేరాలోపల—వ్రాకువేసి మరి చూస్తున్నాడు బూసీదొరగారు
ఆవచ్చేవారు[7] యెవ్వరు చూడు హసానల్లిభాయి

---

1. 'చూచుకొన్నడో'. 2. 'రాజులవారికీ' (క). 3. 'కట్టమే'.
4. 'చాయపప్పురా'. 5. 'మద్య(?)'.
† 75-79 పంక్తులు ద్రుతగతిలో వచనమువలె చెప్పవలసినవి.
6. 'యెదురాకయీటెలూ'. ఎదురాకుటీటెల అని యుండవలెను.
7. 'ఆవలవారు' (క).

మహాప్రభో !— సూరనీడి పొట్టెయ్యగారు నీ భేటికి వస్తుండె
వెయ్యి తివాసులు మరి జముఖానాలు తీరుగ పరిపించు
చదురుచాపలే వేయించుమయా హుసానల్లి భాయి
చదురు చాపలు వేసినారయా మరి డేరాలోపలను
చేరువనే పల్లకి తగ్గెను పొట్టెయ్యగారు[1]
కాలినడకనే వస్తున్నాడు డేరాలోపలకి
చదురుమీదనే నిలబడ్డాడు పొట్టెయ్యగారు
సన్నబియ్యము చారపప్పు[2]ను చదురున వుంచిరిగా
వేటపోతులు కోళ్లకావిళ్లు నదరుపెట్టినారు
పచ్చివెన్నరా కోడిగుడ్లుగా నదరుపెట్టినారు
మద్యమాంసము బ్రాందిసారాయి చదురున వుంచిరిగా
సీమచిలుకలే రామచిలుకలే నదరుపెట్టినారు
బూతపల్లి బుక్కాయిపెట్టెలే నదరుపెట్టినారు
పన్నెండువందల[3] రూపాయ లప్పుడు చదుర్న పోగోసి
సలాము నీకు సలాము నీకు బూసీదొరగారు
సలాము లనగా కుళాయి లెత్తిరి పరాసుదొర లంత
సలామంటే సలా మన్నాడు[4] తా హైదరుజంగు
చదురుమీదనె బైఠాయనెను పొట్టెయ్య గారిని
కొలువుతీరి తా కూర్చున్నాడు పొట్టెయ్యగారు
ఏమి విచారము చేస్తూవున్నావు[5] సూరనీడి పొట్టెయ్య
మేము వచ్చినా పరవాలేదా జమీందార్ల కేమి
మహాప్రభో !—మీరు వచ్చిన వర్తమానము మాకు తెలియ లేదు
దివాణ మనగా తల్లిల్లయ్యా బూసీదొరగారు

---

1. 'చేరువనే పల్లకి తగ్గే పొట్టయ్యగారూ' అని తాళగతిని దీర్ఘములిచ్చికూడ సరిపుచ్చుకొనవచ్చును.

2. 'చాయపప్పు'.

3. 'పన్నెండొందలే'.

4. 'సలామన్నడూ'.

5. 'చేస్తూవున్నవు'.

మాకు తూర్పు పైనం తగిలిందయ్యా పాట్టైయ్యగారు
ఎక్కడ పైనం యేడ సైనము బూసీదొరగారు
కళింగరాజ్యం కటకందాక కండ్ల చూడవలెను
శికాకోళమే సింధుకటకమే కండ్ల చూడవలెను
మహాప్రభో !—ముందర మొనను నేనే నడుతు బూసీదొరగారు
నీవు మావెంబడి రావద్దేమి పాట్టైయ్యగారు
ఈదేశములోకి దుబాసి మాకు కావలె నన్నాడు
దుబాసి నిప్పుడు కుదుర్చగలవా పాట్టైయ్యగారు
మహాప్రభో !—బందరులో వున్నాడయ్యా గోరుందొరగారు
గోరుందొరా రెడ్డినాయుడూ భేటికి వస్తేను
వారు—యిద్దరు భేటికి వస్తే నీకు దుబాసి కుదిరేని
అలాగైతే గోరుందొరకు జాబులు వ్రాయండి
గోరుందొరకు రెడ్డినాయుణికి జాబులు వ్రాసిరిగా
జాబులమీద బూసీగారు మోరు వేసినారు
బేగిరావుల చేతి కప్పుడు జాబు లిచ్చినారు
పడమట జాము ప్రొద్దు(ండగనే)[1] బందరు చేరిరిగ
జాబులు తీసుకవచ్చినారుగా బేగిరావు లేమి
గోరుందొరా రెడ్డినాయుడూ కొలువైవున్నారు
పరానువారీ పరమానంటూ చేతి కిచ్చినారు
గోరుందొరా రెడ్డినాయుడూ జాబులు చదివిరిగా
చదువుతూనె దిగ్గున లేచిరి వార లిద్దరేమి[2]
జాబులు తెచ్చిన బేగిరావుకు బత్యా లిచ్చిరిగా
బారాపద్దెనిమిది పేటలు వెలికించినారు

---

1. ఇట్లు కుండలీకరణమున జూపబడినవి మూలములో లేవు. తాళగతి నిమిత్తము చేర్పబడినవి. 'జాముప్రొద్దుకే బందరుకేమి' అని మూలము.

2. 'వారిద్దరేమి'.

ఉస్తుంబాదలో వున్నాడేమి సోమదాసు లక్ష్మన్న[1]
కలంకారి మరి వ్రాస్తున్నాడు లక్షుమన్న తాను
సోమదాసుమరిలక్ష్మన్నను హుందుర్న పిలిపించి
ఇంగిలీషు మరి ఫారసి యేమి విడువక చదివావు
పరాసువారికింద నీవు దుబాసి కుదిరేవా
దుబాసిగిరీ కుదిరేవంటోయి లక్షుమన్న నీవు
బూసికి నాకు భేటీచేయించు గోరుందొరగారు
బెజవాడాకే పైనంకట్టు లక్షుమన్న నీవు
నాకు గట్టిగ ద్రస్సు లేదు గోరుందొరగారు
రెడ్డినాయిణి ద్రస్సు యిచ్చిరి లక్ష్మన్న కేమీ
రెడ్డినాయుడూ గోరుందొరా పాలకి నెక్కిరి
చదురుకట్నమే భేటికట్నమే హుందుర్న తీసుకొని
రామచిలుకల సీమబాతుల హుందుర్న తీసుకొని
బూతపల్లి బుర్కాయిపెట్టెలె నదరు తీసుకొని
బందరులో లేచినారయా గోరుందొరగారు
బెజవాడాకు కలియవచ్చిరి వారు ముగ్గురేమి
పరాసువారి డేరాకాడ సవారి తగ్గిరి
డేరాలోకి సెలవులాయెను గోరుందొరగారికి
గోరుందొరా రెడ్డినాయుడూ చదురుకు వచ్చిరి
ఆవెనుకా లక్షుమన్న తా కూడవెళ్లినాడు
చదురుమీదను బైఠోమనెను తా హైదరుజంగు[2]
రెడ్డినాయుడూ గోరుందొరా కొలువుతీరినారు
సన్నబియ్యమూ చారపప్పూరా[3] బూసికి మేమాను
రామచిలుకల సీమబాతుల నదరుపెట్టినారు

---

1. లక్ష్మన్న—లక్షుమన్న—రెండు రూపములును ఇందు వాడబడినవి.
2. 'తా సైదరుజంగు' అని మూలము.
3. 'చాయపప్పు' అని మూలము.

పచ్చి వెన్నరా కోడిగుడ్లుగా నదరుపెట్టినారు
బూతపల్లి బుక్కాయిపెట్టెలే నదరుపెట్టినారు
నాల్గువందల రూపాయీలు నదరుపెట్టినారు
సల్లాంజీ సల్లాంజీ (మీకు) బూసీదొరగారు
భాయి సలాము భాయి సలాము గోరుందొరగారు
వంగి మూడు ఖుర్నీసులు చేసిరి వేగమందు ధొరకు
చదురుమీదనే కూర్చున్నారు వారు ముగ్గురేమి
మాకు తూరుపు పైనం కలిగింది గోరుందొరగారు
ఎక్కడ పైనం యేడ పైనము బూసీదొరగారు
కళింగరాజ్యం కటకందాక కండ్ల చూడవలెను
శికాకోళమే సింధుకటకమే కండ్ల చూడవలెను
ఆదేశములోకి దుబాసి మాకు కావలె నన్నాడు
లత్సుమన్ననే బూసిగారికి భేటీచేయించె
ఇంగిలీషున మాటలాడెను లత్సుమన్న తాను
ఆమాటలాకు తా మెచ్చుకొన్నాడు[1] బూసీదొరగారు
మాతావున—దుబాసిగిరికి కుదిరివుంటవా లత్సుమన్న నీవు
మహాప్రభో!—నాకు తగిన జీతము యిస్తే వుంటా నన్నాడు
నెలకు యేభైరూపాయ లప్పుడు జీతం చేసిరిగా
జీతమైన మొకరారుచేసిరి[2] లత్సుమన్న కేమి
కట్టుమనె జెండాలతాళ్లు కదలుమనె బలము[3]
దండుబూరలె డమామిజోళ్లు కూచీ లాయెను
వేలంలోపల రుంజదెబ్బలె హెచ్చుగ వేసిరిగా
మూడో కూచిన లేచినాడుగా బూసీదొరగారు
బెజవాడామజిలీలన్నా క్యాసరపల్లేమి[4]

---

1. 'మెచ్చుకున్నడూ'. 2. 'వోకరారు చేసిరి' (క).
3. 'కట్టమానె జండాల తాళ్లు కదలుమానె బలము' అని మూలము.
4. 'క్యాకరపల్లేమి'. (కేసరపల్లి).

క్యాసరపల్లిలో దిగివున్నాడు బూసీదొరగారు
అక్కడ—సెలవు పుచ్చుకొని యింటికి వెళ్లెను పొట్టెయ్యగారు
గోఱుందొరా రెడ్డినాయడు- బందరు వచ్చిరి
క్యాసరపల్లిమజిలీలన్నా తేలప్రోలు కాడ
తేలప్రోలుమజిలీలన్నా పెరికేటిలోను
పెరికేటీమజిలీ దాటగా[1] యేలూరులోను
ఏలూరులో దిగివున్నాడు బూసీదొరగారు
శనివారప్పేటలోనుగా[2] లక్షుమన్న దిగెను
ఆదివారప్పేట[3]లోనుగా హైదరుజంగేమి
ఆహైదరుజంగును లక్షుమన్ననే బూసీ పిలిపించి
ఈదేశం యేలే జమీన్దారుడు యెవ్వా రన్నాడు
దేశం యేలే జమీన్దారుడు అప్పరాయణిగారు
ఎక్కడున్నాడో యేడ నున్నాడో[4] మేకా అప్పయ్య
మహాప్రభో!—నూజేటిలో[5] వున్నాడయ్య అప్పయ్యగారు
నాభేటి కేల రాకున్నాడేమి మేకా అప్పయ్య
దివాణమంటే గడనలేదుగా జమీన్దార్ల కేమి
పెరికేటికాడికి మాకు యెదురుగ రాలేదు
ఏలూరుకాడికి మాకు కలియ(గ)రాలేదు
మాకాళ్లధూళిని లేచిపోను యీ నూజేటికోట
జాబులు వ్రాయి జవాబు వ్రాయి లక్ష్మన్న నీవు
జాబులలోపల యేమని వ్రాసెను దుబాసి లక్ష్మన్న
కూర్చుంటే[6] కూర్చున్నలాగున భేటికి రావాలె
నిల్చుంటే[7] నిల్చున్నలాగున భేటికి రావాలె
లేకుంటే నీ—కోటకొమ్మలే రవద్ధూళిగా చేయించకపోను

1. 'గట్టిగ' అని. 2. 'శనివారపుపేట' (క). 3. 'ఆదివారపేట' (క).
4. 'ఎక్కడున్నడో యేడ నున్నడో'. 5. నూజేటిలో = నూజవీటిలో.
6. 'కూర్చున్న'. 7. 'నిల్చున్న'.

జాబులు వ్రాసి బేగిరావులచేతి కిచ్చినారు
జాబులు తీసుక లేచినారయా బేగిరావులేమి
రెండుజాములకు వచ్చినారయా నూజేటి కేమి
పరాసువారి పరమానంటూ గాన్లో నిలిచిరి
కొలువుతీరి తా కూర్చున్నాడు అప్పారాయుడు
పరాసువారి పరమానంటూ చేతి కిచ్చినారు
జాబులమీద మోరు[1] చూచెను అప్పారాయుడు
తమ్ముణ్ణి నారయ్యగారిని హుదుర్న[2] పిలిపించి
జాబులు చూడు జవాబు చూడు తమ్మయ్య నీవు
గణగణగణ జాబులు చదివెను తమ్ముడు నారయ్య
ఇంకను మనకు యేమున్నది అన్నయ్య దొరగారు
దేశ మెరుగని పరాసుబలము దేశము కొచ్చెను
భూము లెరుగని పరాసులు మన భూముల కొచ్చిరి
పాఛావుని సాధించిన పరాసులే వీరు
గోలకొండ దరబారీమీద కొట్టిపోరినారు[3]
అంతలేసి మరాటిభూములు హతముచేసినారు
నిలువబోదయా తాళబోదయా నూజేటికోట
కూర్చుంటే కూర్చుండులాగున భేటికి రమ్మనెను
నిలుచుంటే నిలుచుండులాగున భేటికి రమ్మనెను
ఏలూరికోటలో దిగివున్నాడు పరాసుల బూసీ
బూసిగారి భేటికి వెళ్లుమా అన్నయ్య దొరగారు
దంతపుకట్ల పల్లకి అప్పుడు బైట పెట్టినారు
ఆటలవారు పాటలవారూ నాటకాలవారు
నఫిరీలన్నా పిల్లంగోళ్లే నాదులు మ్రోయంగ
ఝుంఝుంఝుం డంకా వేసిరి గుర్రాలమీదనుగ

1. మోరు—మోహరు. 2. 'హాయిదరు'. 3. 'కొట్టిపోయినారు'.

చదురు[1]కట్నమే ఖేటికట్నమే హుదుర్న తీసుకొని
నాలుగువందల వెలమదొరలను వెంబడి బెట్టుకొని
నూజేటిలో లేచినాడయా అప్పారాయడు
ఏలూరికి కలియవచ్చెను మేకా అప్పయ్య
అప్పరాయడి రాక చూచెను దుబాసి లక్ష్మన్న
హైదరుజంగు లక్షుమన్నగా గుర్రాల నెక్కిరి
ఎదురుగుండ తా మొచ్చినారయా అప్పారాయణికి
లక్షుమన్న రాక చూచెను అప్పారాయడు
చివుకున పల్లకి తగ్గుమన్నాడు[2] బోయివాండ్లనేమి
చివుకున పల్లకి తగ్గినారయా బోయివాండ్లు తాము
జోడుగురాల గప్పున దూకిరి వారు యిద్దరోయి
హైదరుజంగును లక్షుమన్నను కౌగిలించుకొనెను
ధట్టివోర[3] యిటు పట్టుమన్నాడు[4] లక్షుమన్ననేమి
నాలుగు సంచులు గుమ్మరించిరి లక్షుమన్న కేమి
వారికి మాకు కత్తులు పెట్ట(కు)[5] నీది భారమయ్య
వారిని మమ్ముల సమ్మతిచెయ్యా నీది భారమేమి
మా దేశములోకి నెలవరి నీవు లక్షుమన్న యేమి
మీకాపురమైతే రుస్తుంబాదా యెరిగేవున్నాను
వారిమాటలే మాకు తెలియవు దుబాసి లక్ష్మడా
మామాటలే వారికి తెలియవు లక్షుమన్న యేమి
మీకార్య మెల్ల సఫలమాయేను అప్పారాయణిగారు
నే నెంత చెప్పితే అంత కద్దుగా బూసిగారితోటి
నే చెప్పినట్టు మరి వింటాడు బూసీదొరగారు
ఈ యభిమానము నీదే సుమ్మా హైదరుజంగూ
లక్షుమన్నగారి డేరాకాడ పాలకి తగ్గారు

1. 'నదురు'. 2. 'తగ్గుమన్నడు' అని మూలము.
3. 'ధట్టిపోర' (క). 4. 'పట్టుమన్నడో'. 5. 'కత్తిలు పెట్టా'.

ముగ్గురు కలుసుక వచ్చినారయా బూసీడేరాకు
ముందర మొనను నడుస్తున్నది ముకుందబల్లెము
పరాసువారి డేరా లప్పుడు గిదరాయించిరి
డేరాలోపల బూసీగారు తా తొంగిచూచినారు
తళుకు తళుకు తళ తళ తళ మన్నది ముకుందబల్లెము
వచ్చేవారు యెవ్వరు చూడు హాసానల్లిభాయి
నూజేటి అప్పారాయణింగారు భేటికి వచ్చేరు
తివాసీలు మరి జముఖానాలు తీరుగ పరిపించు
చదురుచాపలే వేసినారయా డేరాలోపలను
డేరాలోకి సెలవులాయెను అప్పారాయణికి
డేరాలోకి వచ్చినాడుగా అప్పారాయడు
చదురుమీదనే బైఠోమనెను హాసానల్లిభాయి
హైదరుజంగు అప్పారాయడు కొలువుతీరినారు
సన్నబియ్యమే చారపప్పుగా[1] బూసికి మేమాను
వేటపోతులు కోళ్లకావిళ్లు బూసికి మేమాను
వలందుసారా సీసాబుడ్లు చదుర్న దింపిరిగ
మద్దు[2] మాంసమూ బ్రాందీసారా చదుర్న వుంచిరిగ
బూతపల్లి బుక్కాయి పెట్టెలు నదరుపెట్టినారు
పన్నెండువందల రూపాయలు చదుర్న పోగోసి
సలాము నీకు సలాము నీకు బూసీదొరగారు
అప్పుడు కోడిగుడ్లసాన పుచ్చుకొన్నారు[3] పరాసుదొర లంతా
వెన్నపూస మరి మెక్కుతున్నారు[4] పరాసు లందరుగ
సలాము లనగా కుళాయి లెత్తిరి పరాసుదొర లేమి
ఏమి విచారము చేస్తున్నావు అప్పారాయడా
మా కేమి విచారము వున్నదయ్యా మమ్మేలిన మహారాజ

1. 'చాయపప్పు'. 2. మద్యం (?).
3. 'పుచ్చుకొన్నరో' అని. 4. 'మెక్కుతున్నరూ' అని మూలము.

మాకు—తూరుపు పైనము తగిలినదయ్యా అప్పారాయడా
ఎక్కడ పైనము యేడ పైనము బూసీదొరగారు
కళింగరాజ్యం కటకందాకా కండ్ల చూడవలెను
శికాకోళమే సింధుకటకమే కన్నుల చూడవలెను
మహాప్రభో! గోదావరిదాకా మిమ్మును సాగనంపుతాను
ఆవల నీళ్లు మాకు (వొంటికి పడవు[1]) బూసీదొరగారు
(ఆ)మాటలాకు బహు సంతోషించె బూసీదొరగారు
కట్టుమనె జెండాలతాళ్లు కదలుమనె బలము[2]
వేలములోపల రంజదెబ్బలే హెచ్చుగ వేసిరిగ
కట్టివేసిన అరబ్బిబాజా గణగణ మోగింది
దండుబూరలే డమామి జోళ్లూ కూచీలాయెను
*ఏలూరు మజిలీలన్నా గుండుగోలను కాడ
గుండుగోలను మజిలీలన్నా పెంటపాటిలోను
పెంటపాటి మజిలీలన్నా దువ్వతోటలోను*
దువ్వతోటలో దిగివున్నారు బూసీదొరగారు
హైదరుజంగును లక్షుమన్నను బూసీ పిలిపించి
ఈ—దువ్వలేటి సర్కారుకు దొరలు యెవరంటడిగెనుగ
మహాప్రభో!—దువ్వలేటి సర్కారుకు దొరలు కలిదిండివారు
ఎక్కడున్నారు యేడ వున్నారు[3] కలిదిండివారు
మొగల్తుర్తిలో వున్నాడయ్యా వెంకట్రామరాజు

---

1. 'వంటవు' అని మూలము.

2. 'కట్టుమానె జండాలతాళ్లు కదలుమానె బలమూ'.

* ఈ గుర్తులకు నడుమనున్న చరణములు 'క', 'చ' ప్రతులలో నున్నవి. ఈ ప్రతిలో 'ఏలూరు మజిలీలన్నా దువ్వతోటలోను' అను చరణమే కలదు. 'గుండుగొల్లు' అని మూలము.

3. 'ఎక్కడున్నరో యేడ వున్నరో' అని మూలము.

నా భేటీ కేల రాకున్నాడు కలిదిండిరాజు
దివాణమంటే గడన లేదయా జమీందార్లకేమి
కలిదిండి వెంకట్రామరాజుకే జాబులు వ్రాయండి
జాబులు వ్రాసి బూసిగారిది మోహరు వేసినారు
జాబులు గట్టిగ బేగిరావుల చేతి కిచ్చినారు
త్వరగా మీరు మొగల్తూర్తికి వెళ్లుమన్నారేమి
మూడు జాములా పగటి కొచ్చిరి మొగల్తూర్తి కేమి
పరాసువారి పరమానంటూ గాన్లో నిలిచిరి
కొలువుదీరి తా కూర్చున్నారు అన్నదమ్ములేమి
పరాసువారి పరమానంటూ చేతి కిచ్చినారు
ఈ జాబులు గట్టిగ తెలియజూడుమీ తిరుపతి మహారాజ
జాబులు గట్టిగ చదివినాడయా తిరుపతి మహారాజు
ఇంకను మనకు యేమున్నది అన్నయ్య దొరగారు
దేశ మెరుగని పరాసులైతే దేశము కొచ్చిరిగ
భూము లెరుగని పరాసులైతే భూముల కొచ్చిరిగ
మన దువ్వలేటి సర్కారులోపల నబాబులే దిగిరి
నబాబువారి భేటికి వెళ్లుమ అన్నయ్య దొరగారు
దంతపుకట్ల పల్లకి అప్పుడు బైట పెట్టు మనిరి
పన్నెండువందల బలములు గలవు వెంకట్రామ రాజు
ఈ—పన్నెండువందల బలమునకే[1] పైనము చెప్పిరిగ
సానిమేళమే సంగీతమేళమే పైనం చెప్పిరిగ
నఫిరీలన్నా పిల్లంగోళ్లే నాదులు మ్రోయంగ
గుర్రాలమీాద డంకాలైతే గుబులుగ వేసిరిగ
మూడునెల్లకే బియ్యం పప్పు రస్తూ చేయించి
విస్తరంటలూ పీణిపుడకలూ కొట్లో వేయించి
కోటలోపల పదిలము సుమ్మీ తిరుపతి మహారాజ

1. 'ఈ పన్నెండొందల బహు బలముకే' అని మూలము.

చదురుకట్నమే భేటికట్నమే హుదుర్న తీసుకొని
*వలందుసారాసీసాబుడ్లూ నదరు తీసుకొని*
బూతపల్లి బుక్కాయి పెట్టెలే నదరు తీసుకొని
బంగారంపు పావురాయిని నదరు తీసుకొని
సీమబాతులూ సివంగు లప్పుడు వెంట తీసుకొని
దంతపుకట్ల పాలకిలోనే కొలువుతీరినాడు
గోవిందంటూ భజ గోవిందంటూ రాజు లేచినాడు
మొగల్తుర్తి మజిలీలన్నా పూలపల్లిలోను
పూలపల్లి మజిలీలన్నా సెనగపాటికాడ
సెనగపాటి మజిలీలన్నా కొప్పర్తి కొచ్చిరిగ
కొప్పర్తి మజిలీలన్నా పెనుగొండలోను
పెనుగొండ మజిలీలన్నా తాళ్లపూడిలోను
తాళ్లపూడి మజిలీ దాటగా[1] దువ్వలేటిలోను
దువ్వలేటి సర్కారుకు దొరలు కలియవచ్చినారు
ఊకు వేసి మరి చూస్తూవున్నాడు[2] బూసీదొరగారు
ఆవచ్చేవారు యెవ్వరు చూడు దుబాసి లక్ష్మడా
మహాప్రభో!—కలిదిండి వెంకట్రామరాజు మరి భేటికి వస్తాడు
తివాసీలు మరి జముఖానాలు తీరుగ పరిపించు
చదురుచాపలే వేయించిరి డేరాలోపలను
ఆపైన మరి తివాసీలు తీరుగ పరిపించె
డేరాలోకి సెలవులాయెను రాజుగారి కేమి
కాలినడకనే వస్తున్నాడు వెంకట్రామరాజు
కట్టు కమ్మి మరి వస్తున్నారు పన్నెండువందలుగ
సిబ్బందివారికి వెనక్కు రాజు సెలవు లిచ్చినాడు
డేరాలోకి వచ్చినాడుగా వెంకట్రామరాజు

---

1. 'గట్టిగా' అని.
2. 'చూస్తువున్నదూ' అని మూలము,

సన్నబియ్యమే చారపప్పుగా[1] చదుర్న వుంచిరిగ
వలందుసారా సీసాబుడ్లూ చదుర్న దింపారు
*బూంతపల్లి బుక్కాయి పెట్టెలూ చదుర్న దింపారు*
బంగారంపు పావురాన్నిగా నదరు పెట్టినారు
సీమబాతులు సివంగు లప్పుడు చదుర్న వుంచిరిగ
పన్నెండువందల రూపాయలు చదుర్న పోగోసి
సలాంజీ సలాంజీ బూసీ దొరగారు
సలాము లనగా కుళాయి లెత్తిరి పరాసుదొర లేమి
సలాము భాయి సలాము భాయి హాసానల్లి భాయి
సైరే భాయి సలాము భాయీ వెంకట్రామరాజు
వంగి మూడు ఖుర్నీసులు చేసిరి వేగముగా[2] దొరకు
నీ వేమి విచారము చేస్తూవున్నావు[3] వెంకట్రామరాజు
మా—కేమి విచార మున్న(దయ్యా)[4] బూసీ దొరగారు
మాకు తూరుపు పైనము తగిలిందేమి వస్తావా నీవు
ఎందాక మీరు వెళ్లుతారండి దొర హైదరుజంగు
కళింగరాజ్యం కటకందాకా కండ్ల చూడవలెను
శికాకోళమే సింధుకటకమే కండ్ల చూడవలెను
ముందర మొనను నేనే నడుతూ హైదరుజంగూ
(ఆ)మాటలకు బహు సంతోషించె బూసీ దొరగారు
కట్టుమనె జెండాలతాళ్లు కదలుమనె బలము[5]
గణ గణ గణ గణ మంటూ అరబ్బి మోగెను[6]
దువ్వలేటి మజిలీలన్నా నిడుదవో[7] లొచ్చిరి
నిడుదవోలి మజిలీలన్నా కొవ్వూరిలోను

---

1. 'చాయపప్పుగా' అని మూలము.  2. 'వేగమందు దొరకు' అని.
3. 'చేస్తూవున్నవు' అని.  4. 'విచారమున్నది' అని.
5. చూడు, పుట 2, పంక్తి 28.  6. 'అరబ్బి మోగేనూ' అని మూలము.
7. 'నిడుదోలి' అని,

కొవ్వూరి మామిడితోటలో మొత్తిరి జెండాలు
మూడు రోజులే కొవ్వూరిలో మకాములైనారు
హైదరుజంగును లక్షుమన్నను బూసీ పిలిపించి
(ఈ)కొవ్వూరి మహలుకు దొరలు యెవరంటడిగెనుగ
మహాప్రభో!—కొవ్వూరి మహలుకు దొరలు రెడ్డివారు యేమి
ఎక్కడున్నారో[1] యేడ నున్నారో రెడ్డివార లేరి
పోలారంలో వున్నాడయ్యా రావల్ దేవారు
దివాణమంటే గడన లేదుగా జమీన్‌దార్ల కేమి
పన్నెండు వేల రూపాయలతను బాకీదారుడుగ
నే కోటకొమ్మలు యేలాంవేసి అమ్మించకపోను
నా కాళ్లధూళిని లేచిపోనుగ పోలారపుకోట
కర కర కర జాబులు వ్రా(యుమా)[2] లక్షుమన్న నీవు
జాబులలోపల యేమని వ్రాసెను లక్షుమన్న తాను
కూర్చుంటే కూర్చున్నలాగున భేటికి రావాలె
నిలుచుంటే నిలుచుండు లాగున భేటికి రావాలె
లేకుంటే మరి నిలువబోదుగా పోలారపుకోట
జాబులు వ్రాసి బేగిరావుల చేతి కిచ్చినారు
రెండు జాముల లోపల వచ్చెను పోలారములోకి
రెడ్డివారి మరి దివాన్‌గిరీ అద్దంకి చెంచు
మూడువందల సిబ్బందితోను పెద్దబజారునా
వస్తూవున్నాడయ్యా అప్పుడు అద్దంకి చెంచు[3]
ఆయనే రాజంటూ పల్లకి అటకాపులు చేసిరి[4]
నేను గాను న న్నేలిన ప్రభువు కోటలో వున్నాడు
నీ—వెవ్వరి తాలూకని అడుగుతున్నాడు[5] అద్దంకి చెంచు

1. 'ఎక్కడున్నరో యేడ నున్నరో' అని మూలము. 2. 'జాబులు వ్రాయి'.
3. 'వస్తున్నాడు అద్దంకి చెంచు' అని మూలము. 4. 'అటకాపులు చేసీ'.
5. 'నీ వెవ్వరి తాలూ కడుగుచున్నడో' అని.

మేము—పరాసువారితాలూ కంటూ జాబులు చూపిరిగ
పైవిలాసము చూచినాడుగా అద్దంకి చెంచు
జాబులు తెచ్చిన బేగిరావుకే విడుదులు చూపించి
జాబులు తీసుక కచ్చేరి కొచ్చె అద్దంకి చెంచు
పరాసువారి పరమాను వచ్చె[1] రావల్ దేవారు
పరాసువారీ పరమా ననగా గుండె జల్లు మనెను
పన్నెండ్వేల[2] రూపాయలు మనము బాకీదారులము
ఆ జాబులు తెలియు చదివినారుగా రావల్ దేవారు
దేశ మెరుగనీ పరాసుదొరలు దేశము కొచ్చిరి[3]
మన యింటి మీదికి వచ్చి దిగిరి పరాసులై తేను
పన్నెండ్వేల[2] రూపాయలు మనము బాకీదారులము
కోటకొమ్మలే యేలాంవేసి అమ్మించక పోరు
నూటికి వరహా చొప్పున పైకము వడ్డికి తీసుకొని
పన్నెండ్వేల[2] రూపాయ లప్పుడు సంచుల పోసిరిగా
సంచులలో పోసి సీలు చేసిరి రావల్ దేవారు
దివాణగిరీ అంద్దంకి చెంచును పైనము చేసిరి
నీవు—పరాసువారీ భేటికి వెళ్లు అంద్దంకి చెంచు
అబ్బా!—తాతలనాడు తండ్రులనాడు పరాసుల నెరుగనుగ
కోట—పరామరిక చేస్తూవుంటాను రావల్ దేవారు
పరాసువారీ భేటీకైతే మీరే వెళ్లండి
నే—పరాసువారి భేటికి వెళ్లితే అద్దంకి చెంచు
నీ దివాణగిరి యేడని అడిగితే యేమని చెప్పేది
ఆరు నెలలామట్టే[4] అతను పాండు రోగముతో
ఆ పాండురోగముతో నట్లే[5] కోటలో వున్నాడు

---

1. 'పరమాన్నొచ్చె'. 2. 'పన్నెంజేల'.
3. 'దేశము కొచ్చిరి'. 4. 'ఆరు నెలలానుంచీ' (క).
5. 'పాండురోగముతో టట్లు'.

ఆలాగంటూ మనవి చేయుమీ రావల్ దేవారు
కోమటి పిరికి(గ) వున్నావోయి అద్దంకి చెంచు
నీకు వచ్చిన భయములు లేవు అద్దంకి చెంచు
రుస్తుంబాదా కాపురస్తుడు దుబాసి లక్షుముడు
ఆ లక్షుమన్నను కలుసుక వెళ్లు అద్దంకి చెంచు
బూసికి నీకు భేటి చేయిస్తాడు లక్షుమన్న యేమి
అక్కడినుంచి లేచినాడయా అద్దంకి చెంచు
చదురు కట్నము పన్నెండువందలు చేత పుచ్చుకొని
సన్నబియ్యమే చారపప్పుగా[1] నదరు తీసుకొని
బూతపల్లి బుక్కాయి పెట్టెలే నదరు తీసుకొని
గరిణే లన్నగుర్రాన్ని యెక్కె అద్దంకి చెంచు
మూడు వందల సిబ్బందివారిని వెంటబెట్టుకొని
పన్నెండ్వేల[2] రూపాయ లప్పుడు యేనుగ మీదనుగ
పట్టించుకను[3] వస్తున్నాడు అద్దంకి చెంచు
కొప్ప్వారీ మామిడితోపులో గుర్రాన్ని దిగినాడు
కాలినడకనే వస్తున్నాడు పరాసు డేరాకు
ఊకు వేసి మరి చూస్తున్నాడు పరాసుల బూసీ
ఆ వచ్చేవారు యెవ్వరు చూడు లక్షుమన్న నీవు
పోలారపు రెడ్డివారుగా భేటికి వస్తారు
తివాసీలు మరి జముఖానాలు తీరుగ పరిపించు
చదురు మీదకే వచ్చినాడయా అద్దంకి చెంచు
చదురు మీదనే బైఠోమనె(ను) తా హైదరుజంగు
కొలువు తీరి తా కూర్చున్నాడు అద్దంకి చెంచు
సన్నబియ్యమే చారపప్పుగా[1] చదుర్న వుంచారు
వేటపోతులు కోళ్ల కావిళ్లు చదుర్న వుంచిరిగ
బూతపల్లి బుక్కాయి పెట్టెలే నదరు పెట్టినారు

1. 'చాయపప్పుగా' అని. 2. 'పన్నెంతేల'. 3. 'కట్టించుకనూ'.

చదురు కట్నము పన్నెండు వందలు చదుర్న వుంచిరి
ఈ—పన్నెండువేల రూపాయ లపుడు చదుర్న వుంచిరి
సలాం నీకు సలాం నీకు బూసీ దొరగారు
సలా మనగనే సలా మన్నాడు బూసీదొరగారు
వంగి మూడు ఖుర్నీసులు చేసెను బూసిగారి కేమి
చెంచును చూచి కిలకిల నవ్వెను పరాసుల బూసీ
భూమికి జానెడు పొడు గున్నాడే అద్దంకి చెంచు
కులాన యేమిటి వాడ వన్నాడు[1] బూసీ దొరగారు
నే కులానకు కోమటి నన్నాడు అద్దంకి చెంచు
రెడ్డివారి దివాను నంటూ బూసికి చెప్పెను
రెడ్డివారి మరి దివానుగిరికీ చెల్లు నన్నా డేమి[2]
మాకు—తూరుపు పైనం తగిలిందేమి అద్దంకి చెంచు
గోదావరి మమ్ముల గట్టిగా దాటించగలవా
ఆ మాటలకు బహు సంతోషించె అద్దంకి చెంచు
*అక్కడినుంచి జాబులు వ్రాసెను అద్దంకి చెంచు*
కాపులపాలెం మాధవపాలెం జాబు లంపినాడు
రేగుర్తికీ నరసాపురమూ జాబులు వ్రాసెనుగ
పాలకొల్లుమరి రేవు కప్పుడు జాబులు వ్రాసెనుగ
†రేవు రేవునా వున్నపడవలు ముప్పదోనెలు తెకు తె
ప్పలు బల్లకట్టులు పడవలు గట్టిగ రాజమహేంద్రం
రేవులోకి మరి తెలవారేసరికి తయారు కావాలె†
కోడి కూసి ప్రొద్దు పొడిచేవరకు[3] పడవలు తయారు[4]
కొవ్వూరిలో లేచినాడుగా బూసీదొరగారు
బల్లకట్లు[5] పడవలమీదనే బూసి దాటినాడు

1. 'యేమిటి వాడ వన్న శే' అని. 2. 'చెల్లు నన్న శేమి' అని.

† ఈ గుర్తుల పంక్తులు వచనమని తోచును; ఇవి ద్రుతగతిలో చదువవలసినవి.

'పల్లెకట్లు' అని.

3. 'ప్రొద్దొడిచేవరకు' (క). 4. 'తయారుకావాలె' (క). 5. 'పల్లెకట్ల'.

రాజమహేంద్రము జిల్లాలోను వేసిరి డేరాలు
విడువక నల్పై రోజులు దాటె బూసిగారి బలము
ఒక్క దమ్మున దాటినదయా[1] జమీన్దార్ల బలము
హైదరుజంగును లక్షుమన్నను బూసీ పిలిపించి
ఈ దేశం యేలే జమీన్దారుడు యెవ్వా రన్నాడు
ఈ దేశానికి జమీన్దారుడు విజేరామరాజు
డెబ్బైరెండు మన్యాలవారికి రాజు ; గొప్పరాజు
గోలకొండ పాఛావుకు రాజు ; రాజు గొప్పరాజు
అతనెక్క డున్నాడు యేడ నున్నాడు విజేరామరాజు
విజేనగరంలో వున్నాడయ్యా పూసపాటిరాజు
దివాణమంటే గడన లేదా కళింగభూపతికి
దివాణ మనగా తల్లిల్లయ్యా జమీన్దార్ల కేమి
అలాగునైతే రాజుగారికి జాబులు వ్రాయుండి
నాలుగ్గేళ్లమట్టీని రాజు పైక మివ్వలేదు
గోలకొండ నబాబులవారి సెలవు లాయె నాకు
జాబు—లందిన వెంటనే[2] రాజమహేంద్రం భేటికి రావాలె
లేకుంటే—డెబ్బైరెండు మన్యాలుగా నిలువబో వికను
జాబులు వ్రాసి లకోటచేసె లక్షుమన్న తాను
జాబులమీంద బూసిగారుగా మోరు[3] వేసినారు
తూరుపుదండులో వున్నాడోయి కీకాసాహేబు
హుదుర్న అప్పుడు తీసుకవచ్చిరి బూసిభేటి కేమి
ఎన్ని రోజులకు వెళ్లుతావురా విజేనగర మేమి
మహాప్రభో!—సెలవు లయితే రెండు రోజుల పగటికి వెళ్లేను
జాబు లప్పుడు తీసుకున్నాడు కీకాసాహేబు

1. ‘దాటినాదయా’.

2. ‘జాబులు చూచిన తక్షణమందున’ అని మూలము ; తాళగతి కనువుగా పరిదిద్దబడినది.

3. ‘మోరు’—మోహరు.

రొట్టె నీళ్లు కట్టుకున్నాడు లొట్టిపిట్టమీదను
రేయుంబగలూ తియ్యక నడచెను కీకాసాహేబు
రెండురోజుల పగటికి వచ్చెను విజేనగర మేమి
రాజుగారి వకీలు నాడు గుండా లప్పన్న
చల్లప్రొద్దున గుండా లప్పన్న సవారి బైల్దేరె
ఈటె పౌంజుతో వస్తున్నాడు గుండా లప్పన్న
ఆయనే రాజంటూ పల్లకి అటకాపులు చేసె
నేను గాను న న్నేలిన ప్రభువు కోటలో వున్నాడు
పరాసువారి పరమానంటూ కనులకు చూపాడు
పరాసువారి పరమా ననగా గుండా లప్పన్న
పరమాన తెచ్చిన బేగిరావుకు బత్యా లిప్పించి
రాజగారి కచేరికి వచ్చెను గుండా లప్పన్న
కొలువుతీరి తా కూర్చున్నాడు కళింగ పెదరాజు
పరాసువారి పరమానంటూ చేతి కిచ్చినాడు
అన్నకొడుకు ఆనందరాజునే[1] కొలువుకు (పిలిపించి)
జాబులు చూడు జవాబు చూడు ఆనంద మహారాజ
జాబులు తెలియ చదివినాడుగా ఆనంద మహారాజు
ఇంకను మనకు యే మున్నది[2] బాబుదేవుగారు
దేశ మెరుగని పరాసు బలము దేశము కొచ్చెను
పాఛావుని సాధించిన పరాసులే వీరు
గోలకొండదరబారీమీద కొట్టి పోరినారు
అంత లేసి మరాటి భూములు హాతముచేసినారు
బోనగిరిగా[3] కల్లికోటగా వీరు తీసినారు
అంతలేసి పరాసు బలముల నబాబు పంపించె
డెబ్బైరెండు మన్యాలు కొట్టి దోపు చెయ్యి మనేను

---

1. 'ఆనందరావునే అని'. 2. 'మనకూ యేమున్నాదీ' అని.
3. 'బోనగరీగా' అని.

నాలుగేళ్లమట్టీ మనము డబ్బు కట్టలేదు
వెన్నెల కాస్తే యెండేదయ్యా కళింగరాజ్యముగ
మంచులు కురిస్తే పండేదయ్యా మన రాజ్య మేమి
వాండ్ల కాళ్లధూళిని లేచిపోతది కళింగరాజ్యముగ
రాజమహేంద్రపు జిల్లాలోనే పరాసులు దిగిరి
పరాసువారి భేటికి వెళ్లుమ బాబుదేవు నీవు
మూర్తానికే[1] పూలతోటలో వేసిరి జెండాలు
సరసరన గుండా లప్పన్న యేమని పలికెను
మీరు వొక్కరే వెళ్లుతారా బూసిభేటి కేమి
మీపక్కగా పాళెగాండ్లకు జాబులు వ్రాయండి
రాజుగారు తా పాళెగాండ్లకు జాబులు వ్రాసిరిగ
గోలకొండ యెఱ్ఱభూపతికే జాబు లంపినారు
కిమిడినున్న నారాయణదేవుకు జాబు లంపినారు
ఆట్రగడ్డ హరిచంద్రుని కైన జాబు లంపినారు
మాడుగు లేలే లింగారావుకు జాబు లంపినారు
మన్యమ్మేలే మన్యభూపతికి జాబు లంపినారు
కోయనున్న కోయభూపతికి జాబు లంపినారు
వొంటిమీసపు[2] భూపతిరాజుకు జాబు లంపినారు
కొప్పాడ రామయ్యగారికి జాబు లంపినారు
దూసరి[3] వెంకప్పారావుకు జాబు లంపినారు
బొగ్గులూరి మరి జగ్గిరెడ్డికి జాబు లంపినారు
హాసర్ బేగుకు భైరవ రాజుకు జాబు లంపినారు
ప్రత్తిపాటి పాపయ్యరాజుకు జాబు లంపినారు
సూర్యరాజుకు చంద్రరాజుకు జాబు లంపినారు
కడపాల బుచ్చయ్యగారికి జాబు లంపినారు

1. 'మూర్తానికే' = ముహూర్తానికే.

2. 'పంటి మీసపు'. 3. 'దూసరీలి',

చిత్తాడ సూరయ్యగారికి జాబు లంపినారు
అనకాపల్లి పాపరావుకుజాబు లంపినారు
రాజశ్రీరామమూర్తి నీలాద్రిరావుకు జాబు లంపినారు
మహాప్రభో!—అందరు పాళెగాండ్లకు జాబులు వ్రాశాను
బొబ్బిలినున్న రంగరావుకు జాబులు పంపొద్దా
మన్నెగాండ్లలో(ని)కి అతడు గడుమన్నెగాడు
గడుమన్నెగాడై యున్నాడయ్యా[1] బొబ్బిలి రంగరావు
జాబు లంపితే భేటి కొస్తాడ రంగారాయుడు
జాబు లంపనిచో[2] మనది నేరము కళింగమహారాజ
ఆలాగైతే జాబులు వ్రాయుమి గుండా లప్పన్న
జాబులలోపల యేమని వ్రాతును వన్నెలినవారు
వెనుకటి పగలూ మదిలో వద్దు రంగారాయుడా
కోడిపందెమునాటి పగలూ మదియందున వద్దు
పిగిలిపిట్టలనాటి[3] పగలూ మదియందున వద్దు
రాజుగారికీ బొబ్బిలివారికీ భేటీ లున్నవి[4]
దేశమెరుగని పరాసుబలము దేశము కొచ్చెను
మా—రాజమహేంద్రపు కిల్లాలోను నబాబు లున్నారు
ఈ—వేళ రాతిరి జాబులు వచ్చెను విజేనగర మేమి
తెల్లవారి నీకు జాబు లంపితి రంగారాయడ
జాబులు చూచిన తక్షణమందున రంగారాయుడా
పాలకి యెక్కి విజేనగరము నా భేటికి రమ్మా
మీరూ మేమూ నబాబువారి భేటికి వెళుదాము
జాబులు వ్రాసి హరకారాలా చేతి కిచ్చినారు
మూడు జాములకు వచ్చినారయా బొబ్బిలికైతేను
రాజుగారివి జాబులు అంటూ గాన్లో నిలిచిరి

---

1. 'యున్నాడు' అని. 2. 'జాబులు పంపకపోతే' అని మూలము.
3. 'పిగిలిపిట్టలా నాటి'. 4. 'భేటీ లున్నావి'.

రంగారాయుడు వెంగళ్రాయుడు అన్నదమ్ములూ
బావమరదులూ తండ్రి కొమాళ్లు మేనమామలూ
వెంగళ్రాయని చంద్రశాలలో సొగటా లాడేరు
రాజుగారివి జాబులు అంటూ చేతి కిచ్చినారు
జాబులు చూడు జవాబు చూడు వెంగళ్రాయుడా
ఆ జాబులు తెలియ చూచినాడుగా వెంగళ్రాయుడు
జాబులు ఝరేలున చించివేసెను వెంగళ్రాయుడు
కండ్ల చూడక చెవుల వినక నే జాబులు చించేసి
మీకూ మాకూ పొత్తులు యేమి విజేరామరాజ
నీకూ మాకూ విహితము లేమి పూసపాటిరాజ
రాజుగారికి బొబ్బిలివారికి భేటీ లున్నవా[1]
జాబులు తెచ్చిన హరకారా(ల) చెంపలు గొట్టించి
జాబుకు ప్రతి జాబులు గట్టిగా వ్రాయ(నే)లేదు
గోడుగోడుమంటూను వచ్చిరి హరకారావారు
రాజుగారివో భేటికి వచ్చిరి హరకారావారు
నెత్తినున్న పాగాలను తీసి చదుర్న గొట్టిరి
గోడుగోడు మంటూను వారు దుఃఖపడి రేమీ[2]
ఏడోయీ బొబ్బిలి(లో)నున్న రంగారాయుడు
మహాప్రభో! మీరు జాబు లంపినా గడనున్నదా రంగారాయుడికి[3]
కండ్ల చూడకా చెవుల వినకనూ జాబులు చించేసె
మీకూ మాకూ పొత్తు లేమనె వెంగళరాయుడు
మీకూ మాకూ విహిత మేమనె వెంగళరాయుడు
రాజుగారికి బొబ్బిలివారికి భేటీ లున్నవా[1]
ఆలాగంటూ చెంపలు వేసె మమ్ము యిద్దరిని
పట పట పటా పండ్లు కొరికెనూ విజేరామరాజు

1. ‘ భేటీ లున్నావా ’ అని. 2. ‘ దుఃఖపడ్డరేమీ ’ అని.
3. ‘ మహాప్రభో మీరు ’ అన్నది చరణమున కెక్కువ.

పక్కలోనా బల్లెముగదరా బొబ్బిలి దరబారు
నా కంట్లో నలుసై[1] మెరుగుతున్నది యీబొబ్బిలికోట
పుట్టకోట చప్పంగా దున్ని పొగమొక్కలు వేతు
పాటిపొగాకు పుచ్చుకోక నా పగతే తీరేన
కాకుల గద్దల కారాడింతును బొబ్బిలిమీదనుగ
ఏనుగలమీద కట్టించేను పదార్థమైతేను
ఇరువైనాలుగువేల బలమునకు పైనము చెప్పెనుగ
చింతపువ్వు[2] గుర్రాలమీదనే వెండిపల్లాలు
వెండి పల్లాలమీదనే పైడికళ్లేలు
పైడికళ్లేలు గుర్రాల కప్పడు ముస్తాదు చేసిరి
మూడు వందల తురుపు గుర్రమే కవాతు తిరిగెను
ఆరువందల యేనుగలను శాదులు దీర్చిరిగ
నఫిరీలన్నా పిల్లంగోళ్లూ నాదులు మ్రోయంగ
దండుబూరలే డమామిజోళ్లూ కూచీలాయెను
ఆరునెల్లకే బియ్యం పప్పూ రస్తూచేయించి
విస్తరంటలే వీణపుడకళ్లే కోటలో వేయించి
అన్నకొడుకు ఆనందరాజునే కోటలోనె వుంచి
కోటలోపల పదిలముసుమ్మా ఆనందమహారాజ
మీా రెన్నాళ్లకు వస్తారండి బాబుదేవుగారు
వారికి మాకు సలహాపడితే దబ్బున వస్తాను
లేకపోతే నే గోలకొండకు వెళ్లే నన్నాడు
వేసిరి జాము జాము నగార దెబ్బలు డంకాబాజాలు
అంబారీలో కూర్చున్నాడు కళింగమహారాజు
అంబారి వరుసను[3] వస్తున్నది చువ్వీపెలబలము
పూలతోట మజిలీలన్నా భీమసింగిలోను

1. 'నెరుసై' (క). 2. 'చింతపప్వా' (చ); 'చింతవుప్వా' (కో).
3. 'వర్సుక' అని.

భీమసింగి మజిలీలన్నా అలమండాలోను
అలమండ మజిలీలన్నా కసిమికోటలోను
కసిమికోట[1] మజిలీలన్నా యెలమంచిలిలోను
ఎలమంచిలి మజిలీలన్నా యేటికొప్పాకోయి
*ఏటికొప్పాక మజిలీలన్నా (గుడిచెర్లా)లోను[2]
గుడిచెర్లా మజిలీలన్నా సత్యారములోను*
సత్యారము మజిలీలన్నా సబ్బారములోను
సబ్బారము మజిలీలన్నా చోడారములోను
చోడారము మజిలీలన్నా ఆలవెల్లిలోను
ఆలవెల్లి మజిలీలన్నా పితాపురములోను
ఆపితాపురము మజిలీలన్నా పెద్దాపురములోను
పెద్దాపురము మజిలీలన్నా రావులచెరు వేమి
రావులచెరువు మజిలీలన్నా నల్లచెరువుకాడ
నల్లచెరువు మజిలీలన్నా రాజానగరము
రాజానగరంలో దిగివున్నాడు కళింగమహారాజు
నబాబువారి డేరా లట్లా కానవస్తున్నవిగ
ఆడేరాలకు డేరా లిక్కడ యెదురుగనే వేసె[3]
ఏనుగలకూ యేనుగలన్నా యెదురుగనే కట్టె[4]
ఏవంకను చూచినాగానీ రాజుబలము దిగెను
ఊరి వ్రూరి కంసాలబత్తులా పిలిపించెను రాజు
మూసలు కట్టీ కరిగించెను పదార్థ మంతాను
బంగారంపు కోడిపుంజులా చేయించెను రాజు
బంగారంపు సీమచిలుకలా పావురాలనుగా

---

1. 'కసినికోట'.
2. 'ఏటికొప్పాక మజిలీలన్నా సత్యారములోను' అని మూలము.
3. 'యెదిరించి వేసె' అని. 4. 'యెదిరించి కట్టె' అని

రామచిలుకలా చేయించెను రాజు(గారుగనుక)[1]
బంగారంపు గొర్రెపొటేళ్లా చేయించెను రాజు
వెండివి——రెండు సివంగులను జాగిలముల చేయించెను రాజు
బంగారంపు కురిచీపీటా బూసికి చేయించె
కుట్టులేని మరి జోడంగీలు బూసికి మేమాను
నవరత్నాల కుళాయి జోళ్లు బూసికి మేమాను
మూడు మూళ్ల వోనిలువు టద్దమే బూసికి మేమాను
గుర్రాలమీద నగారదెబ్బా గుబులుగ వేయుమనెను
గడ గడ గడ గడ వాయించిరి రాజు వేలంలో
రాజు వేసిన నగారదెబ్బా బూసీ విన్నాడు
ఊకువేసి మరి చూచినాడుగా బూసీదొరగారు
ఏవంకను చూచినాగానీ యెల్లా డేరాలు
ఏవంకను చూచినాగానీ యేనుగలబారు
హైదరుజంగు లక్షుమన్ననే హుదుర్న పిలిపించి
నాయెదుటి వేలంలో వున్నవారు యెవ్వరు చూడండి
విజేనగరము రాజాగారు మీభేటికి వస్తుండె
నా డేరాలకూ డేరాలేమి యెదుట[2] వేసినాడు
నాగుర్రాలకూ గుర్రాలేమి యెదు రుంచి కట్టె
*నా యేనుగలకూ యేనుగలను యెదు రుంచి కట్టె*
నాతో మనవికి వచ్చేరాజుకు అంత బలము యేల
మనవికా యుద్ధానికా వస్తా[3] తెలుసుక రమ్మనెను
హైదరుజంగూ లక్షుమన్నగా పైనమ్మయినారు
లక్షుమన్నతో యేమి చెప్పెను బూసీదొరగారు

---

1. 'బంగారంపు సీమచిలుకలా పావురాలుగా రామచిలుకలా చేయించెను రాజూ' అని మూలము.

2. 'యెదురుంచినాడు' అని.

3. 'మనవి కొస్తాడో యుద్ధాని కొస్తాడో' అనిమూలము.

యుద్ధానికి వస్తూవుండెనా విజేరామరాజు
బల్లకట్లూ[1] పడవలూ మనకు తయారుచేయించు
తిరిగి మళ్లాను[2] గోలకొండకే మనమే పోదాము
రాజును—కొట్టడానికి గోలకొండలో సెలవు లేదు నాకు
అలాగంటూ చెప్పినాడుగా లక్షుమన్నతోను
రాజానగరం కలియవచ్చిరి వారు యిద్దరేమి
రాజుగారి వోడేరాసరసను గుఱ్రాలు దూకారు
రాజుగారుగా దిగ్గున లేచీ కచేరిమీదనుగ
డేరాగాన్లో నిలబడ్డాడు విజేరామరాజు
దండంపెట్టీ నిలబడ్డాడు దుబాసి లక్ష్మన్న
దండ మనగనే లక్షుమన్నను కౌగిలించుకొనెను
ఇంతమాత్రమూ తెలగబిడ్డవు మాకు దొరకినావ
ఏవ్వూరి కాపురస్తుడవు లక్షుమన్న నీవు
(మా)కాపురము బందరుపేటా రుస్తుంబాద నాది[3]
పరాసువారి దుబాసి నన్నాడు లక్షుమన్న తాను
చదురుమీదనే కూర్చున్నారు వారు ముగ్గు రేమి
కచ్చేరిమీద యే మన్నాడు లక్షుమన్న తాను
మీకు దివాణమంటే గడనలేదా విజేరామరాజ
నాలుగేళ్లమట్టీని నీవు డబ్బు కట్టలేదు
గోలకొండనబాబులవారి సెలవులాయె మాకు
లక్షాడెబ్బై నాల్గువేలతో బూసి వచ్చినాడు
విశాఖపట్నం రేవులదాపున పన్నెండువేలేమి
ఈపాటికి నీదేశమునూ దోస్తూవుండేరు
డెబ్బైరెండు మన్యాలు కొట్టి దోపుచెయ్యుమనెను
ఈమాటలకు మరి గడ గడ వణకెను విజేరామరాజు

---

1. 'పల్లెకట్లు' అని. 2. 'మల్లను'. 3. 'నేను' అని.

ఆలక్షుమన్నకు ఆరువేల రూపాయ లిచ్చెను[1]
ఈయభిమానము నీదేసుమ్మా లక్ష్మన్న వినుమా
పరాసుమాటలు మాకు తెలియవు దుబాసి లక్షుముడ
మాదేశములోను డబ్బు లేదుగ దుబాసి లక్షుముడ
పెండారిగుఱ్ఱముచేత దేశము దోపిడిపోయింది
డెబ్బైరెండు మన్యాలవా రొక డబ్బు కట్టలేదు
బొబ్బిలినున్న మన్నెగాడుగా మొవానుగున్నాడు
డబ్బు అడిగితే కత్తులు తీసుక వెంబడి పడతాడు
అందుచేతనే గోలకొండకే రాకపోయినాను
ఇక మరలబడ్డ మన్యాలు నేను సాధిస్తును రాజ
నీవు జడియబోకు మరి వెరవబోకు కళింగపెదరాజ
హైదరుజంగును దగ్గరకు పిలిచి దుబాసి లక్షుముడు
పరాసుమాటలు ఆమాటలే[2] రాజుకు చెప్పుమనెను
ఆమాటలే[2] వ్రాసియిచ్చెను రాజుగారి కేమి
నాలుగువేల రూపాయ లిచ్చెను హైదరుజంగుకూ
మామీదనే దయను వుంచుమీ వో హైదరుజంగు
జడియబోకుమా వెరవబోకుమా కళింగమహారాజ
రేపు గురువారము ప్రొద్దుపొడుపున భేటికి రమ్మనిరి
అప్పు డేమని పలికినాడుగా రాజుగారు తాను
ఏలాగైనా—బొబ్బిలి కొట్టి ఆనందరాజుకు పట్టము కట్టించు
బొబ్బిలి పైకము కళింగ పైకము నేనే కడతాను
చాలకుంటే పైకము మీకూ సాయము చేసేను
ఆలాగనగనే[3] వారు యిద్దరు గుఱ్ఱము లెక్కిరిగ
బూసిగారి డేరాకు వచ్చిరి వారు యిద్దరేమి
వెళ్లిన పనులూ యేమాయెనూ దుబాసి లక్ష్మడా

---

1. ‘రూపాయ లిచ్చినాడు’ అని. 2. ‘ఆరుమాటలే’ అని.
3. ‘ఆలాగంటనే’ అని మూలము.

ఇంకా యేమి చెప్పుమన్నారు[1] బూసీ దొరగారు
ఇరువైనాలుగువేల బలముతో రాజు వచ్చినాడు
ఉగ్రుడుగానే వున్నాడయ్యా కళింగపెద్దరాజు
మే మిద్దరమూ వెళ్లగ రాజు శాంతపడ్డాడేమి
రాజు—చెప్పినట్టు మనం వినకపోతే బూసీ దొరగారు
తూరుపు భూముల మనను గట్టిగా కండ్ల చూడనీడు
అందుకు నాకు యేమి చెప్పుతావు లక్షుమన్న నీవు
రాజు—చెప్పినట్టు మనం విందామయ్యా బూసీ దొరగారు
(ఆ)మాటలకు బహు సంతోషించిరి పరాసులా దొరలు
గురువారంనాడు ప్రొద్దుపొడుపున[2] రాజు లేచినాడు
ముందర మొనసూ నడిపించెను వొంటిపౌంజు తాను
ఆవెనుకాలనూ నడిపించెను పాలకీసరిదండె
ఆవెనుకాలనూ వస్తున్నది యేనుగ అంబారి
అంబారీలో కూర్చున్నాడు కళింగపెదరాజు
ఏనుగమీద నాటకశాలలు ఆడిస్తున్నాడు
అంబారివరుసను[3] వస్తున్నది చువ్వాయీబెబలము
ఆవల యీవల కలియవచ్చెను తురుపు గుర్రమోయి
ఆవెనుకాలనే వస్తున్నది యేనుగలబారూ
నఫిరీలన్నా పిల్లంగోళ్లూ నాదులు మ్రోయంగ
గుర్రాలమీద నగారాదెబ్బలు గుబులుగ వేసిరిగ
అంగరంగవైభవమూతోను రాజు వచ్చినాడు
లక్షుమన్న మరి డేరాకాడ అపుడా[4] దిగినాడు
†హైదరుజంగూ లక్షుమన్నగా రాజుగారుగా గుండా
లప్పయ్యా నల్గురు కలుసుక కాలినడకనే వస్తూవున్నారు†

1. ‘చెప్పనున్నది’ అని. 2. ‘గురువారము ప్రొద్దుపొడుపున’ అని.
3. ‘వరుసుక’ అని. 4. ‘అపుడ దిగినాడు’ అని.
† వచనమని తోచును.

రాజుగారుగా వచ్చీనంటూ బూసికి చెప్పిరిగ[1]
తివాసీలు మరి జముఖానాలు తీరుగ పరిపించె
డేరాలోనికి సెలవులాయెను రాజుగారి కపుడు
కచ్చేరిమీదికి వచ్చినాడుగ కళింగపెదరాజు
చదురుమీదనే బైఠోమనెను హాసానల్లిభాయి
కొలువు తీరి తా కూర్చున్నాడు కళింగపెదరాజు
సన్నబియ్యమే చారపప్పూగా[2] చదురున వుంచిరిగ
వేటపోతులు కోళ్లకావిళ్లు చదురున వుంచిరిగ
పచ్చివెన్నగా కోడిగుడ్లుగా చదురున వుంచిరి
మద్దు మాంసము బ్రాందీ[3]సారా చదురున నిలిపిరి
వలందుసారా సీసాబుడ్లు చదురున వుంచిరిగ
బంగారంపు కురిచీపీటా బూసికి వేయించి
నవరత్నాల కుళాయిజోళ్లూ శిరసున నుంచిరి
కుట్టు[4]లేని మరి నీమా జామా బూసికి తొడిగించి
బంగారంపు గొర్రెపోతుల్ల పోట్లాడ(గ) వేసి
బంగారంపు కోడిపుంజులా పోట్లాడ(గ) వేసి
సీమచిలుకల రామచిలుకల పావురాలగా చదుర్న వుంచిరి
వెండివి రెండు సివంగులాను జాగిలాయిల చదుర్న వుంచిరి
బూతపల్లి బుక్కాయిపెట్టెలూ చదుర్న వుంచిరి
మూడుమూళ్ల నిలువుటద్దము బూసి యెదుటను[5] పెట్టించి
పన్నెండువేల రూపాయ లపుడు చదురున వుంచిరిగ
సలాము నీకు సలాము నీకు బూసీదొరగారు
సలాము లనగా కుళాయి లెత్తిరి పరాసుదొర లేమి
సలాము నీకు సలాము నీకు హాసానల్లిభాయి

1. 'వచ్చీనంటునూ' అని మూలము. 2. 'చాయపప్పు' అని.
3. 'బ్రాంతి'. 4. 'మట్టు' అని.
5. 'బూసివారికి యెదట పట్టించి' అని మూలము.

భాయి సలాము భాయి సలాము విజేరామరాజ
రాం రాం రాం రామూ లక్షుమన్న నీకు
రాం రాం రాం రాం విజేరామరాజ
అద్దములోపల వింతవింతలే చూచెను దొరగారు
నీవు కళింగపాఛాకు తగివున్నావు విజేరామరాజ
ఇంత(టి) దొడ్డరాజవు నీకు నౌబతు[1] యేదయ్యా
మహాప్రభో బొబ్బిలికోటలో మోగుతున్నది నౌబత్తయితేను
(ఆ)రాజుమాట(లను) వింటూనే బూసీదొరగారు
బొబ్బిలినున్న రంగారాయుడు యేడని పలికెను
మహాప్రభో మీరు వచ్చినా గడనున్నదా రంగారాయునికి
మొవాసు తానై కూర్చున్నాడు బొబ్బిలి లోపలను
ఏడుయేండ్లనుంచీ అతడు పైకమివ్వలేదు
పైకమివ్వక రంగారాయుడు మరలబడ్డాడండి
నిన్న మీరు పంపిన జాబులు గట్టిగ చించివేసినాడు
(ఆ)మాటలకు బహుతామసమొచ్చెను బూసీదొరగారు
గుర్రపుఘాటీ చేయించేను[2] బొబ్బిలిదరబారు
ఏడుయేండ్లనుంచీ అతడు పైకమివ్వలేదా
అయితే యెక్కువైన నీవు పోయివస్తివా విజేరామరాజ
మహాప్రభో! యేడుతూర్లు నే వెళ్లినానయ్యా బొబ్బిలికైతేను
ఏడుతూర్లకు వకతూరైనా[3] భేటికి రాలేదు
ఒకతూరి వెళ్లి[4] పాలకీలు దిగదొక్కివెళ్లినాను
మజూర్లచేత పెట్టి[5] పంపిరీ పాలకీలు నాకు
అయితే నీవద్దేమి సిబ్బంది లేదా విజేరామరాజ

---

1. 'ఇంత దొడ్డరాజువున్నావు నౌబతు' అని.
2. 'చేయించానా' అని.
3. 'వాతూరైనా' అని.
4. 'ఒకతూరెళ్లి' అని.
5. 'బట్టి'.

మహాప్రభో మన్నెము తప్పితే పనికిరారయా మన్నె సిబ్బందీలు
నూటికి వొక్కడే(డా?) బంటున్నాడు బొబ్బిలిలోపలను
లక్ష్మన్ననే దగ్గరకు పిలిచి బూసీదొరగారు
బొబ్బిలినున్న రంగారావుకు జాబులు వ్రాయండి
అప్పు డేమని పలికినాడుగా కళింగపెదరాజు
మహాప్రభో జాబు లెందుకు జవాబు లెందుకు బూసీ దొరగారు
బొబ్బిలికోట ఆనందరాజుకు వ్రాసియివ్వమనెను
ఒకరిభూములు వొకరికి నేను యెట్లా యిచ్చేది
ఒకరిరాజ్యమే వొకరికి నేను యెట్లా యిచ్చేది
నిజా మెరిగిన పాళెగాడుగా రంగారాయడు
గోలకొండ నబాబులు విన్న మాటవచ్చు నాకు
మంచిది విజేనగరముకాడ నీకు చెప్పతాను పదమ
నీపాలక్కి[1] నిన్ను వదలనిస్తునా బూసీదొరగారు
ఎంతలేదు యీబొబ్బిలికోట వ్రాసి యివ్వమనెను
జడియబోకుమా వెరవబోకుమా బూసీదొరగారు
డెబ్బై యిద్దరు[2] మన్నెగాండ్లకు రాజును నే నేమి
మాటవస్తేను గోలకొండకు నేనే వస్తాను
గోలకొండ నబాబులతోను మాటలాడగలను
ఒంటికొమ్ము[3] పెద్దేనుగనైతే ఫులఫా పెట్టాడు
తనకు నిజా మిచ్చిన కరిగుర్రాన్ని బూసి కిచ్చినాడు
కచేరివారికి నాలుగుసంచులు గుమ్మరించినాడు
†బొబ్బిలికోట ఆనందరాజుకు ఆరునెలలకు[4] వ్రాసియిచ్చినాడు†
రాజమహేంద్రము నిమానీలోని వ్రాసియిచ్చినాడు
మేము, తూరుపు పైనము వెళ్లుతాముగా కళింగమహారాజ

---

1. 'పాలికి'
2. 'డెబ్బైరెండు'.
3. 'వంటకొమ్ము'.
4. 'ఆరునెలలుగా'.

ఎందాక మీరు వెళ్లుతారయా బూసీదొరగారు
కళింగరాజ్యం కటకందాకా కండ్ల చూడవలెను
బొబ్బిలిదనుకా రావలెనయ్యా బూసీదొరగారు
బొబ్బిలిమీదికి నేను రానుగా విజేరామరాజ
హైదరుజంగు లక్షుమన్నను కూడ యిస్తును తీసుకవెళ్లుమనెను
మహాప్రభో! కామందులేని కయ్యముయేమి[1] గడి
ఎంతో[2] లేదు మీ రందాకా రమ్మని పలికెను
గణితి[3]పట్టరా గణితిపట్టరా[4] మీరాసాహేబు
*రాజుబలములూ బూసిబలములూ గణితీ పట్టిరిగ*
రాజుబలములూ బూసిబలములూ రెండులక్షలాయె
కట్టుమనె[5] జెండాలతాళ్లు కదలుమనె బలము
దండుబూరలూ డమామిజోళ్లూ కూచీ లాయెనుగ
వేలము[6]లోపల రుంజదెబ్బలే హెచ్చుగ వేసిరిగ
మూడోకూచిని లేచినాడయా బూసీదొరగారు
రాజమహేంద్రము మజిలీలన్నా రాజానగరము
రాజానగరము మజిలీలన్నా నల్లచెరువుకాడ
నల్లచెరువు మజిలీలన్నా రావులచెరువేమి
రావులచెరువు మజిలీలన్నా పెద్దాపురములోను
పెద్దాపురములో వున్నరాజు జగపతి మహారాజు
నాలుగువందల ముజుందార్లతో[7] రాజును కలిశాడు
పెద్దాపురము మజిలీలన్నా పిఠాపురములోను
పిఠాపురములో దిగివున్నారు పరాసుదొర లేమి

---

1. 'మేమూ'.
2. 'ఘడియంత'.
3. 'గడితి'.
4. 'గడిపట్టు'.
5. 'కట్టుమానె' 'కదలుమానె'.
6. 'యాలము'.
7. 'మర్జాదాళ్లతో'.

* 'క', 'చ' ప్రతులు.

చామర్లకోటలో వున్నాడయ్యా నీలాద్రిరాయుడు
నాలుగువందల ముజుందార్లతో[1] నీలాద్రిరాయుడు
పిఠాపురములో రాజుగారి భేటి కొచ్చినాడు
ఎన్నాళ్లకు చూడడమాయె(ను) నీలాద్రిరాయడ
నిన్ను చూచి బహుదినములాయెను కళింగపెదరాజ
అప్పు డేమని పలికినాడుగా విజేరామరాజు
నీవు బొబ్బిలివారి వర్తమానము యేమి విన్నావు
బొబ్బిలివారి వర్తమానము యేమీ వినలేదు
బొబ్బిలికోట ఆనందరాజుకు వ్రాసియిచ్చినారు
బొబ్బిలిదాకా వెళ్లి వస్తాము వస్తావా నీవు
తోడల్లుడిమీదికి[2] నేనూ కయ్యాని కొచ్చేదా
బొబ్బిలిమీదికి నేను రానుగా విజేరామరాజ
పెటపెటపెట పండ్లు కొరికెను విజేరామరాజు
మీరూ మీరూ వకటైనారా నీలాద్రిరాయడ
బొబ్బిలి వెళ్లి తిరిగి వచ్చి చామర్లకోట పాడుచేస్తాను
బొబ్బిలి వెళ్లిన రాక లెక్కడివి విజేరామరాజ
మళ్లీ రాకలు లేవన్నాడు రాజుగారికైతె
మంచిది వచ్చిననాటికి, చామర్లకోట తీతువుగాని పొమ్మన్నాడేమి
కోపంమీద కోటకు వచ్చెను నీలాద్రిరాయుడు
లేచిరి పిఠాపురము మజిలీలన్నా ఆలవెల్లిలోను
ఆలవెల్లి మజిలీలన్నా చోడారంలోను
చోడారము మజిలీలన్నా సబ్బారంలోను
సబ్బారము మజిలీలన్నా సత్యారంలోను
సత్యారం మజిలీలన్నా యేటికొప్పాకేమి
ఏటికొప్పాక మజిలీలన్నా గొడిచెర్లలోను
గొడిచెర్ల మజిలీలన్నా యెలమంచిలిలోను

1. 'మజ్జాదార్లతో'. 2. 'తోడల్లుండి మీదికి' అని.

యెలమంచిలి మజిలీలన్నా తుమ్మపోలలోను
తుమ్మపోల మజిలీలన్నా సాదోడలోను
సాదోడ మజిలీలన్నా రేగులగడ్డేమి
రేగులగడ్డ మజిలీలన్నా కందివలసలోను
కందివలస మజిలీలన్నా గనిగడ్డలోను
గనిగడ్డ మజిలీలన్నా రంగవాకలోను
రంగవాక మజిలీలన్నా పాలవేరులోను
పాలవేరులో దిగివున్నది[1] పరాసులబలము
వేలములోపల గడ్యారమైతే మాఖూబు చెయ్యండి
వేలములోపల ఋంజదెబ్బలే గట్టిగవెయ్యండి[2]
దండుబూరలే డమామి జోళ్లు గట్టిగ వేశారు[3]
ఊరి శులతో[4] లేచినాడయా బూసీదొరగారు
పాలవేరు మజిలీలన్నా పాతబొబ్బిలిలో
పాతబొబ్బిలిపాటిమీదనే పరాసుడేరాలు
కోడి కూసి ప్రొద్దు పొడిచేసరికి[5] కోట ముట్టడేసె
బొబ్బిలివారి చెరువులమీద బూసీ దిగినాడు
నారికడాలలో దిగినాడయ్య వెంకట్రామరాజు
మంచినీళ్ల మరి బావులకాడ దుబాసి లక్షుముడు
అడవిదారి(ని) కట్టేసి దిగెను హసానల్లిభాయి
గొల్లపల్లి రత్తమ్మతోటలో[6] రాజులు దిగినారు
అడ్డపల్లిమయ్యారములోను అనమరల్లి దిగెను
ఉల్లితోటల గరువులమీద జమీన్దార్ల బలము
సన్నాసులా మెట్టలమీదా శీకటిమయ్యేలు(?)

1. 'దిగి వున్నాది' అని. 2. 'కట్టివెయ్యండి' అని.
3. 'కట్టివేసినారు' అని.
4. వూరపనల్తో' అని. 'వూరపసల్' అని (క), (చ)లు.
5. 'ప్రొద్దొడిచేవరకు' అని. 6. 'రత్తమ్మ తోటలో' అని.

మాలపల్లి చావిళ్లా దిగెను[1] మల్లానాయకుడు
కోటగమిడిలో దిగివున్నాడు లాలు కుమందాను
కోటకు పడమట దిగివున్నాడు ముసే లాసువాడు[2]
ఉత్తరపువైపున దిగివున్నాడు ..ుసే టక్కితాను[3]
*తూరుపువాగున దిగివున్నాడు ముసే బుర్రి తాను*
*దక్షిణపువాగున దిగివున్నాడు ముసే కుంపలాము*
రాజారమూ బొబ్బిలిసందున రాజులచవి కేమి[4]
బొబ్బిలికోట నాలుగుతట్టులా ముట్టడేసినారు
ఇంతమర్మమూ యెరుగరుసుమ్మి బొబ్బిలిదొర లేమి
కోటలోపల యిరువైనాలుగు పెండ్లి అరుగు లేమి
మల్లెపూల తోరణాలు కట్టిరి ఆబొబ్బిలిలోను
పన్నీరు అత్తరు(లు) మొదలుగా కోటలో కళ్లాపి
అంగ రంగ వైభోగముతోను[5] రాయుడు వున్నాడు
కోటవెలుపటా రుంజదెబ్బ లే హెచ్చుగ వేసిరిగ
దండుబూరలూ డమామి జోల్లో కూచీ లాయెను
వెంగళ్రాయని చంద్రశాలలో సాగటా లాడారు
కోటవెలుపటా గల్లం తేమి తమ్ముడ వెంగళ్రావు[6]
ఏమోకానీ నేను ఎరుగను అన్నయ్య దొరగారు
దిగ్గు దిగ్గున లేచినారు దొర లన్నదమ్ము లేమి
అరిగనీడలా[7] గుబ్బగొడుగులా బురుజుల కెక్కిరి
హనుమంతబురుజు యెక్కి చూచిరి అన్నలు తమ్ములుగ
దండు చూచి మరి తల్లడించెను రంగారాయుడు
నే చెప్పినమాటలు వినకపోతివి తమ్ముడ వెంగళ్రావు[6]

---

1. 'భావిళ్లా దిగెను' అని. 2. 'వుసేలాసువాడు' అని.
3. 'ముసే కుంపలాము' అని. 'ముసేటక్కితాను ('క', చ' లు).
4. 'రాజుల చవికేలూ' అని. 5. 'రంగ రంగ వైభోగములోటి' అని.
6. 'తమ్ముడెంగళ్రావూ' అని. 7. 'అరగనీడలా' అని.

మనయింటిమీాదికి దండుతెచ్చెను విజేరామరాజు
మనలను చంపి మనబొబ్బిలికోట యేలదలచినాడు
శ్రీమహాలక్ష్మివంటి బొబ్బిలి చింద్రైపోతుంది
పెద్దలనాటి బొబ్బిలికోటకు ఋణము చెల్లె మనకు
కారణాలు యీలాగు నుండెనో తమ్ముడ వెంగళ్రావు[1]
ప్రాణంవంటి[2] నా బావమరదిగ తాండ్ర పాపయ్య
తాండ్రవారి పాపయ్య యిప్పుడు కోటలో లేడాయె
అతను పోయి రాజారపు కోటలో తాణా వున్నాడు
తాండ్రవారి పాపయ్య లేనిదీ యేమి తోచదేమి
ఇప్పుడు గనుక పాపయ్యయితే కోటలో వుంటేనా
ఏడేండ్లు పోరాడిన[3] సాధ్యము కాదు నా బొబ్బిలికోట
మహాప్రభో పిరికిమాటలూ ఆడిపోతిరి[4] యేలినవారేమి
నాకు సెలవులు యివ్వమంటాడు తమ్ముడు వెంగళ్రావు[1]
సెలవులు యిస్తే నబాబుడేరా సెలగని పొడిచొస్తు
దిగుతూ దిగుతూవున్నడేరా[5] వెనుకకు పట్టిస్తు
గోల్కొండదరబారులో బూసికి గోరీ కట్టిస్తు
గోరీమీాద సున్నపు నీళ్లు చల్లించకమాన
ఏరు దాటి యేలూరిదాకా బైలుగ నరికిస్తు
రాజమహేంద్రము గోదావరిలో యీటెలు కడిగిస్తు
దనిగడ్డకూ పీనుగులాను వొంటెల[6] తోలిస్తు
*రవద్ధూళిగా[7] విజేనగరమే తలుపులు కొట్టిస్తు*
అన్నయ్యా, విజేనగరముసందున రాజును దహానం[8] చేయిస్తు

1. 'తమ్మ వెంగళ్రావూ' అని.
2. 'ప్రాణమంటి' అని.
3. 'ఏడు యేండ్లు పోట్లాడినా' అని.
4. 'ఆడపోతివి' అని.
5. 'దిగుతున్న దిగుతున్న డేరా' అని.
6. 'పినిగెలానె వంటెలు'.
7. 'రవధ్ధూళినా' అని.
8. 'దానం' అని.

వెళ్లిమాటలా ఆడిపోతిరి యేలినవారండి
పడమటిసీమ వెలమలు విన్న మన పరువు లుండ బోవు
తూర్పు దేశము వెలమలు విన్న మన పరువు లుండబోవు
యార్లగడ్డ జూపల్లివారుగా విన్న పేరుండునె
మాణిక్యరావు మల్ రాజువారుగ విన్న పేరుండునె
వెంకటగిరి దామెర్లవారు విన్న పేరుండునె
అన్నా, రాజును కలుసుక రాజమహేంద్రమె మనము వెళ్లితేను
ముందరి మొననూ నడిపిస్తాడు విజేరామరాజు
వెనుక చేరి కొంకులు నరకడా పూసపాటిరాజు
చెరువులమీది తెలుపులేమయా అన్నయ్యదొరగారు
పంతగించుకొని పరాసులను రాజు తెచ్చినాడు
అన్నయ్యా! బూసిగారి బలములు అన్నీ జాతికొంగ[1] లేమి
జాతికొంగలమీదికి నేను సాళువడేగాను
రాజుగారి వో బలములు అన్ని పరిగెగుంపులేమి
పరిగెగుంపులమీదికి నేను భైరవడేగాను
పడుచుయవారము[2] చాలించోయి వెంగళ్రాయడా
వీరిని కొడితే రే పీవేళకు నిజాము వస్తారు[3]
నిజాము వెంబడి ఢిల్లీఫౌజు మరి చాలా వస్తుంది
మరాటిగుర్రము చేత దేశమే మాపైపోతుంది
వీరిమీదనే కత్తి కడితిమా మనము నెగ్గబోము
కత్తి కట్టిన మాడుగలవారు[4] యేమయిపోయినారు
కత్తి కట్టిన కొప్పాకవారు[5] అడవులపాలైరి
తాలిమినుమ్మా వోరుపునుమ్మా వెంగళ్రాయడా
తాలిమి యున్నది తనను గాచును యెదిరి గాచునేమి

---

1. 'సాతికొంగ' అని. 2. 'పడుచెవారమూ' అని.
3. 'నిజాము లొస్తార్రు' అని. 4. 'మాడుగులోరు' అని.
5 'కొప్పాకోరు' అని.

ఓరు పన్నది వొళ్లు కాచును వెంగళరాయడా
తిరిగి మళ్లీ దివాణమొచ్చిరి అన్నలు తమ్ములుగ
బొబ్బిలివారి రాజబంధువుల హుదుర్న పిలిచిరి
†రావువారు గజరావువారు వెలుగోటివారు
జూపల్లివారు దామెర్లవారుగా సెట్టిపల్లి చెలికాని
వారుగా మానెపల్లి మైగాపులవార్ని రాయడు పిలిపించె†
†గుమ్మళ్లవారు గుమ్మడివారు తాండ్రవారినీ చెలికాని
వెంకయ్యగారినీ రాయడు పిలిపించె†
కాకర్ల సూరయ్యగారినీ హుదుర్న పిలిపించె
కొలువు చావడి నిండినారయా వెలమదొరలు తాము
పేరువెళ్లిన తెలగాలోయి బొబ్బిలి తెలగాలు
తెలగాలకు పేరువెళ్లినవాడు పడాల[1]రాముడు
†ఆపడాలవారిని బండివారినే ముత్యాలవారిని
చిమటవారినే సిరసానివారిని హుదుర్న పిలిచిరి†
బత్తులవారి భీమయ్యగారిని హుదుర్న పిలిపించె
నాయకుల మొనగాళ్లను సరదార్ల వొంటర్ల పిలిచిరి
బొందిలీలకు సరదారు(గా) తులసీరామైతే
†ఆతులసీరాం జేజేరాం జానకిరాం పట్టాభిరాం
హరేరామునీ సీలారాం తులారామునీ హుదుర్న పిలిపించి†
తురకలకైన సరదారుడు మహమ్మదు ఖాసిము
అంతా, కొలువుచావడి నిండినారయా వెలమలు తెలగాలు
అన్నల్లార మాయన్నల్లార రాణువదొరలార
మిమ్ము—డేగలవలెనే సాకికొంటిని[2] వెలమదొరల్లార
బిడ్డలవలెనే పెంచుకొంటిని తెలగబిడ్డలార
మీ రుండగానె నేనేసుమ్మీ తెలగబిడ్డలార

† ఈ గుర్తుల మధ్యవి వచనమని తోచును.

1. 'పటాల' అని, 2. 'సాకొంటిని' అని,

నే నుండగా మీరేసుమ్మా వెలమదొరల్లార
గడెకో గడెకో పరాసుఅన్నము తినకతీరదేమి
మహాప్రభో!—అంతమాట నీవు సెలవులివ్వబోకు
నిన్ను గొల్చి దొరగారు యెన్నడు కార్యమ్మెరుగము
ఈపొ యీపొ కొక్కొక్కపూరుగ మొఖాస తిన్నాము
పేటున వున్న పడాల రాముడు యేమని పలికెను
ఎంత పిరికిమాట లాడిపోతిరి వెలమదొరలలార
రామ రామ రా మనంతకాలము రాజ్యము యేలేరా
యుగములు జగములు గలంతకాలము భూములు యేలేరా
తిరిగిపోయి మీ తల్లికడుపున మళ్లా పుట్టేరా
ఎన్నాళ్లు బ్రతికిన వొక్కక్షణములో చచ్చేదే[1] కాదా
నాకు సెలవులు యియ్యవయ్యా రంగరాయణింగారు
సెలవులు యిస్తే బలముల్నైతే[2] సెలగని పొడిచొస్తు
వాణ్ణి కొట్టీ నబాబుడేరా కొట్లో వేయింతు
చెల్లు చెల్లు పడాల రాముడా నీకే చెల్లును
రాయుడు మెచ్చి తురాయిబిరుదు చేతి కిచ్చినాడు
ఎడమకాల పైడందె వేసెను పడాల రామునికి
రొమ్మున గంధం పూయించాడు పడాల రామునికి
రంగరాయడి మేనమామగా దామెర్ల రామయ్య
ఆమేనమామ కొలువుకు వచ్చెను రంగారావోయి
మీ రేమి విచారము చేస్తున్నారు మామ రామయ్యా
మా కేమి విచారము వున్నదయ్య వెంగళరాయడా[3]
పెద్దలనాటి బొబ్బిలికోట ఋణము చెల్లె మామ
బొబ్బిలికోటకు మనకు గట్టిగా ఋణము చెల్లినది
శ్రీమహాలక్ష్మివంటి బొబ్బిలి చింద్రైపోతుంది
కాకిమూక పరాసుమూక కమ్ముక వున్నది[4]

---

1. 'బ్రతికేదే' అని. 2. 'బలముల మీదా' అని.
3. రంగారాయడా అని యుండవలెను. 4. 'వున్నాది' అని.

నేటితోను మా బొబ్బిలికోట నేల పాలయ్యా[1]
గడెకో గడెకో[2] పరాసు అన్నము తినకలేర దేమి
పెంటిమాటలూ ఆడిపోతివి రంగారాయుడ
దివాణానికి ఘెట్టి తప్పాలూ మనము చేయలేదు
ఇప్పటికి మన బొబ్బిలెత్తేది లక్షాపదివేలు
ఇప్పుడు, వీరు వచ్చి దిగినందుకు లక్ష అగావు కడుదాము
నిజాము చేసిన తేరుగడకే పైకము కడుదాము
వాయిదాలచొప్పున పైకము వొప్పుక వద్దాము
మన వెంగళరాయుని పెండ్లికల్నము మూడువే లిద్దాము[3]
సిబ్బందిఖర్చు వారి బత్తెపు ఖర్చుకూడా కడుదాము
సిబ్బందివారి కసాయిగొర్లు మనమే యిద్దాము
రాజమహేంద్రము భేటికి పోనిది మనది నేరమైన
రాజమహేంద్రము హద్దుచేసుక బొబ్బిలిదాకాను
మజిలీకి వేయేసి రూపాయలు యీనా మిద్దాము
చాలకుంటే పైకము వారికి సాయము చేతాము
నిలువుమంటే మరి జెండాక్రింద ముంగల నిలుతాము
వారు, కలువుమంటే రాజుతో యిప్పుడు కత్తిని కలిపేము
తీయుమన్న కోటలు ముందుగా గట్టిగ తీదాము
మనకు గోలకొండ నబాబు లిచ్చిన పరమాన వున్నది[4]
నబాబుమెరుకలేక బూసీ మన నేమి చేయగలడు
రాయబారము వెళ్లు మన్నాడు రంగారాయణ్ని
నేను, పరాసువారి భేటికి వెళ్లితే వూరికె వస్తానా
రాజరక్తమే కండ్ల చూడకను కోటకు తిరిగేనా
వేగిరస్తుడు వెంగళ్రాయుడు యేమని పలికెను

---

1. 'నేల సాఫులయ్యా' అని. 2. 'ఘడికో'.
3. 'మూడే లిద్దాము' అని.
4. 'గోలుకొండనా బొబ్బిలిచ్చినా పరమా నున్నాది' అని.

విరుగు తరుగులూ[1] యెరిగిన దొరలూ వకరూ లేరైరి
విరుగు తరుగులూ[1] యెరిగినవాడు బావ ధర్మరావు
బావమరదిని ధర్మారావును హుదుర్న పిలవండి
దామెర్ల దమ్మయ్యగారినే హుదుర్న పిలిచిరి
నీవు, పరాసువారి భేటికి వెళ్లుమూ బావ ధర్మరావు
రాయబారము వెళ్లుమన్నాడు ధర్మారాయణ్ని
బావా, పరాసువారి భేటికి వెళ్లి యేమని పలికేది
కీసా బాసా తెలియనివారి భేటికి వెళ్లేదా
మనమాటలే వారికి తెలియవు బావ రంగరావు
నీవు దుబాసి లత్సుమన్నను కలుసుక వెళ్లయ్యా[2]
హైదరుజంగూ లత్సుమన్ననూ యిద్దరినీ చూడు
బూసికి మీకు భేటి చేయిస్తారు వారు యిద్దరేమి
ఎంత పైకము కట్టుమన్నా వెనుకతియ్యబోకు
అడిగినంత పైకానికి బావా వొప్పుక రమ్మనెను
వారు లంచ మడిగిరా తమలపాకు మరి తోడిమకు వొప్పొద్దు
బావా మాట మాట పడసందు (?) వచ్చిన వూరక రావయ్య
తాలిమిచేసి కోటకు రమ్మా బావ ధర్మరావు
శోభనాల మరి బావులకాడ స్నానం చేసిరిగ
లాగు తొడిగెను కాసెపోసెనూ ధర్మారాయడు
చంద్రకావితలపాగ చుట్టెను బాలుడు ధర్మయ్య
కలంకారి జోడంగీలైనా అమర తొడిగినాడు
లత్సులు(?) తీరిన పచ్చలబాకూ రొండిన కట్టెను
దంతపుకట్ల పల్లకి అప్పుడు బైట పెట్టినారు
ముస్తాదయ్యా ధర్మారాయడు కదలి వచ్చినాడు
ఎవరోయి, నూగు నూగు మీసాలవారుగా నూటికి తైనాతి

1. 'యిరుగు తరుగులూ' అని.
2. 'నీదుబాసిగీరీ లత్సుమన్ననూ కలుసుక వెళ్లయ్యా' అని.

మీరు పెండ్లాల బిడ్డలమీద ప్రేమలు గలవారు
తల్లుల తండ్రులమీదను దయలున్నవారు
బొట్టెల తీసుక బిరేల్న బొబ్బిలి పైలుదేరి పోండి
మహాప్రభో! అంతటిమాటలు సెలవులివ్వకు ధర్మారాయడా
ఈటె యీటె కొక్కొక్క-వూరుగా మొఖాస తిన్నాము
నిన్ను గొలిచి దొరగారు యెన్నడూ కార్యమ్మెరుగము(?)
మీతో మేమూ చచ్చువారము ధర్మారాయడా
మీతో మేమూ బ్రతుకువారము ధర్మారాయడా
ఆలాగైతే బొబ్బిలికోటకు పేరే వుండీని
నీవు పైనము కట్టు పైనము కట్టు పడాల రాముడా
పడాల రాముడు స్నానం చేసి కాసె కట్టినాడు
చంద్రకావిరుమాల చుట్టెను పడాల రాముడు
సింగోట మరి వీపుమీదను అమర కట్టినాడు
చింతపువ్వు[1] గుర్రముమీదనే వెండీ పల్లము
*వెండీ పల్లాము మీదనే పైండి పల్లాము*
పైండి కళ్లెపు[2] గుర్రాన్ని యెక్కె పడాల రాముడు
దంతపుకట్ల పల్లకిలోను ధర్మారాయుడు
నూగు నూగు మీసాలవారుగా నూటికి దొరలేమి
వెండికట్ల వెదురాకుటీటెల వెలమ దొరలు వారు
చక్కనున్న చువ్వీటెలవారు[3] తెలగాలైతేను
ముకుందపూరి[4] జల్లియీటెలా ముత్తుబాసులోయి
నఫరీలన్నా పిల్లంగోళ్లు నాదులు మ్రోయంగ
గుర్రాలమీద ఢంకాదెబ్బా గుబులుగ వేసిరిగ
చదురుకట్నమే భేటి కట్నమే హుదుర్న తీసుకొని
బూతపల్లి బుక్కాయిపెట్టెలూ నదరు తీసుకొని

---

1. 'చింతపప్వు' అని.
2. 'పైండి కళ్లమే'.
3. 'సక్కసన్నసువ్వీటెలవారు'.
4. ముకుందపురపు?

బంగారంపు సీమగొర్రెనే నదరు తీసుకొని
గోవింద భజ గోవిం దంటూ కోటగవనికొచ్చె
కోటగవనిలో వున్నాడయ్యా గోపాలస్వామి
చస్తామో బ్రతుకుతామో స్వామిని చూతాము
గోవింద భజ గోవిం దంటూ పాలకి దిగినారు
రంగనియొక్క కోవెలలోకే వేంచేసినారు
ఎక్కడికి స్వారి వెళ్లినావయా గోపాలస్వామీ
*కోటలు విడిచి కొండలలోనికి వలసవెళ్లినావా*
*బొబ్బిలివారి యింట వెలసిన గోపాలస్వామి*
కలలో నిలలో వచ్చి రంగా కాపాడు స్వామీ
దొరలపాలిటి వకగండమునూ కాయకపోతివి
నేను పరాసువారి దండ్లోకి వెళ్లి చల్లగ వస్తేను
రాతిగుళ్లకు బంగారంపు మలాము చేయిస్తు
చెన్నపట్నపు చక్రగొడుగులు తెప్పిస్తు రంగా
†బంగారంపు సింహద్వారమె ధ్వజస్తంభమే
గరుడపక్షులా చేయింతును రంగా†
తులసితీర్థమే అందినారు శఠగోప మందినారు
గోవింద భజ గోవిం దంటూ పాల కెక్కినారు
గోవింద భజ గోవిం దంటూ కోటలో బైల్దేరి
డేరాలలోను నబాబుడేరా యేదని పలికెనుగ
వెల్లమైన సుళువైన(?) బిరుదుల నబాబుల డేరా
ఆ నబాబువారి డేరాకాడికి సవారి పట్టండి
హైదరుజంగూ లక్షుమన్నగా డేరాకు వస్తుండె
*హైదరుజంగూ లక్షుమన్నగా సొగటాలాడేరు*
*ధర్మారాయని రాక చూచెను దుబాసి లక్ష్మన్నడు*
*సొగటాలయితే కట్టివెయ్యరా సొనకా లప్పన్న*

† వచనము.

*సొగటా లప్పుడు కట్టివేసెను సొనకా లప్పన్న*
హైదరుజంగూ లక్షుమన్నగా గుఱ్ఱా లెక్కిరిగ
ఎదురుగుండ తా వచ్చినారయా ధర్మారాయుడికి
లక్షుమన్న వో రాక చూచెను ధర్మారావ్వారు
చివుకున పాలకి తగ్గుమన్నాడు బోయివాండ్లనేమి
అనగానే పాలకి తగ్గిరి బోయివాండ్లు యేమి
జోడుగుఱ్ఱాల గప్పున దుమికిరి వారు యిద్దరేమి
†హైదరుజంగూ లక్షుమన్నగా ధర్మారాయుడు కౌగిలించుకొనిరి†
ధట్టి వోర యిటు పట్టుమన్నాడు లక్షుమన్న నేమి
నాలుగు సంచులు తీసినాడుగా ధర్మారాయుడు
హైదరుజంగుకు లక్షుమన్నకు చెరిసగ మిచ్చెను
వారికి మాకు కలతలు పెట్టకు[1] నీది భారమయ్యా
వారిని మమ్మును సమ్మతిచెయ్యా నీది భారమయ్యా
వారి మాటలూ మాకు తెలియవు దుబాసి లక్ష్మముడా
మా మాటలూ వారికి తెలియవు లక్షుమన్న వినుమ
బూసికి నాకు భేటి చేయించు వో హైదరుజంగు
మేము శిశుబాలవృద్ధులతోను కోటలో వున్నాము
మా కోటమీదికి వచ్చేది ధర్మము కాదయ్యా
నీవు, జడియబోకుమా వెరవబోకుమా ధర్మారాయడా
బూసికి నీకు భేటి చేయిస్తాము ధర్మారాయడా
(ఆ)మాటలకు బహుసంతోషించె ధర్మరాయణింగారు
లక్షుమన్నమరిడేరా కాడ పాలకి దిగినారు
†హైదరుజంగూ లక్షుమన్నగా ధర్మారాయుడు
పడాల రాముడు కాలినడకనే వస్తున్నారు పరాసిడేరాకు†
ముందర మొనను నడుస్తున్నదీ[2] ముకుందబల్లెము

1. 'వారికి మాకూ కలతలు పెట్టా' అని. 2. 'నడువుమన్నసే'.

† వచనము.

*ముందరమొనను తూగి నడచెను ముకుందబల్లెము*
నబాబువారి డేరా అప్పుడు గిరదాయించిరిగ
డేరాచుట్టూ వొగ్గుకున్నది ముకుందబల్లెము
డేరాలోపల బూసిగారు తా తొంగిచూచిరేమి
తళుకు తళుకు మరి తళ తళ మన్నది ముకుందబల్లెము
వచ్చేవారు యెవ్వరు చూడు హాసానల్లిభాయి
మహాప్రభో! బొబ్బిలినున్న రంగారాయుడు భేటికి వస్తుండె
మనడేరామీద పడతాడేమో ఆగి రమ్మనవోయి
ఎదురుగుండ మరి చోపుదార్లను పంపుతున్నారేమి
వెండికర్రల చోపుదార్లు తా యెదురుగ నడిచారు
కబర్‌దార్, డేరాకాడికి ఆగిరండీ వెలమదొరల్లార
తివాసీలు మరి జముఖానాలు పరిపిస్తున్నారు
మన్నెడేగలే[1] వెలమదొరలుగా మనవికి వచ్చారు
డేరాలోనికి సెలవులాయెను ధర్మారాయడికి
చదురుమీదికి వచ్చినాడుగా బాలుడు ధర్మయ్య
చదురుమీదనే బైఠోమనెను హాసానల్లిభాయి
కొలువుతీరి తా కూర్చున్నాడు ధర్మారాయుడు
ఆపేటుగాను(?) మరి కూర్చున్నాడు పడాల రాముడు
సన్నబియ్యమే చారపప్పుగా[2] నదరు పెట్టినారు
వేటపోతులు కోళ్లకావిళ్లు చదుర్న వుంచిరి
పచ్చివెన్నగా కోడిగుడ్లుగా చదుర్న వుంచిరి
వలందుసారా సీసాబుడ్లూ చదుర్న వుంచిరి
బూతపల్లి బుక్కాయిపెట్టెలు చదుర్న వుంచిరి
బంగారంపు సీమగొర్రెనే నదరు పెట్టినారు
పన్నెండువేల రూపాయ లప్పుడు చదుర్న పోగోసి
కచ్చేరిమీద లేచినాడుగా ధర్మారాయుడు

1. 'మీరు మన్నెడేగలే' అని.    2. 'చాయపప్పు' అని.

సలాంజీ సలాంజీ బూసీ దొరగారు
సలా మనగనే సలా మన్నాడు బూసీదొరగారు
సలాం భాయీ సలాం భాయీ హసానల్లిభాయి
భాయీ సలాము భాయీ సలాము ధర్మారాయడా
సలాము నీకు సలాము నీకు ఓ హైదరుజంగు
సలా మనగనే సలా మన్నాడు తా హైదరుజంగు
వంగి మూడు ఖుర్నీసులు చేసిరి వేగమున దొరకు
నీ వూ రేమి పే రేమి చెప్పుమా వెలమదొరా నీవు
ఊరిపేరు బొబ్బిలి కోటగా బూసీదొరగారు
బొబ్బిలి అనగా, నీపేరేనా రంగారాయడు
మహాప్రభో నేను కాను నా బావమరదిగా కోటలో వున్నాడు
మా యింటిపేరు దామెర్లవారు నాపేరు ధర్మయ్య
నే రంగారాయణి దివానుగిరిని ధర్మారాయణ్ని
ఎందుకు వస్తివి యేల వస్తివి ధర్మారాయడా
†దేశములోనికి దివాణమని జమాబంది వో తేరు
గల్లకూ తమదగ్గరకూ మనవికి వచ్చాను†
జమాబంది నీవు చేయవయ్యా బూసీదొరగారు
ఈవరదాక జమాబంది ఫ్లిజా కెవ్వ రిచ్చినారు
ఈవరదాక జమాబంది మాకు రాజు లిచ్చినారు
రా జుండంగా మా భేటికి యెందుకు వచ్చారు[1]
రాజుకు మాకూ సరిపడకున్నది బూసీ దొరగారు
మమ్మేల చంపీ బొబ్బిలికోట యేలదలచె రాజు
కాక, దివాణ ముండగ రాజులక్కర మా కే మన్నాడు
దివాణ మొకటా రాజులు వకటా ధర్మారాయడా
మాకు రాజులతో పనిలేదయ్య బూసీదొరగారు

†, వచనము 'తమ దగ్గరకే మనవి కొచ్చాను' అని.

1. 'యెందుకొచ్చినారు' అని,

గోలకొండ నిజాము లిచ్చిన పరమా నున్నది
తురకవంటి సరదారుడుసుమ్మా రంగారాయుడు
కాగానే, రాజమహేంద్రము భేటికి రాకపోయినాడు
దివాణమంటే గడనలేదా రంగారాయణికి
రాజే రాగా మీరు రాజమహేంద్రము రానిపనియేమి
నా భేటికి రాని కోపంచేత నీబొబ్బిలి కోట
†రాజమహేంద్రము నిమామిలోనే బొబ్బిలికోటా
ఆనందరాజుకు వ్రాసియిచ్చినాను†
పెట పెట పెట పెట పండ్లు కొరికెను ధర్మారాయుడు
ఎడమచెయ్యిగా మీసంమీద యెగురుతూవున్నది[1]
కుడిచేతినీ పట్టాలోను అమరించినాడు
బొబ్బిలికోట రాజుకు యిస్తే మా కే మిచ్చేవు
మీకు, పాలకొండలో పన్నెండువూళ్లు జాగీ రిస్తాము
ఆజాగీరు తింటూ రాజులక్రింద నౌకరి చేయండి
కోరమీసము గిర గిర తిప్పెను ధర్మారాయుడు
మా జీవముతో రాజులక్రింద నౌకరి కొలిచేమా
మా ప్రాణములతో రాజులక్రింద నౌకరి వుండేమా
దివాణ మొచ్చి మొవాసుమాటలు ఆడకయ్య నీవు
మొవాసు కేమీ తక్కువ వున్నది నా బొబ్బిలిలోను
నూటికి వొకడా[2] బం టున్నాడు నాబొబ్బిలిలోను
కాళ్ల వెండికడియాలవారు నా బొబ్బిలి వొంటర్లు
ఈటె యీటెకూ యెంచక పొడుతురు నూరేసి మందినిగ
మాకు గోలకొండ నిజా మిచ్చిన పరమా నున్నది
నబాబుమెరుక లేక బూసి న న్నేమి చేయగలవు

† వచనము.

1. 'యెగురుతువున్నాది' అని. 2. 'నూటికి వొకతే' అని.

మాకార్యం మీరు కన్నుల చూతురు[1] బూసీదొరగారు
ఇదిగో, యిరువైనాలుగు వేల బలము రాజుగారి బలము
ఆయవడారము(?) నాలుగు వేలు మా బొబ్బిలివారిదండు[2]
వారిని మమ్మును బారులు గట్టి యుద్ధం చేయించు
మీరు యేనుగ నెక్కి తమాష గడియ కన్నుల చూడండి
రాజు గెలిస్తే నీవు బొబ్బిలికోట రాజుకు యిప్పించు
మేము గెలిస్తిమా, విజేనగరపు రాతికోట మా రాయడికిప్పించు
ఆమాట(ల)కు సమ్మతించడు విజేరామరాజు
కట్టిన యిండ్లూ యిచ్చే టందుకు కారణ మే మనెను
లేదూ నీ శాయశక్తుల నడువుమన్నాడు[3] బొబ్బిలిమీదికి
మనవి వొక్కటీ వినుమంటాడు బూసీదొరనేమి[4]
రాజుకు మాకు మెట్టినయాది దివాణ మన్నాడు
దివాణానికి మేము క్రోశకి(?) యేమి చేయలేదు
దివాణానికి యేమి నేరమూ మేము చేయలేదు
నీవు చక్కన న్యాయం తీర్చు[5] బూసీదొరగారు
ఇప్పటికి నా బొబ్బి లెత్తేది లక్షాపదివేలు
ఇప్పుడు, మీరు వచ్చి దిగినందుకు లక్ష అగావు కడుతాము
నిజాము చేసిన తేరుగళ్లకే పైకము కడుతాము
మా వెంగళ్రాయణి పెండ్లికట్నమే మూడువే లిస్తాము[6]
సిబ్బంది ఖర్చు మీఖర్చుకుగాకూడా యిస్తాము
సిబ్బందివారి కసాయిగొర్లను మేమే యిస్తాము
రాజమహేంద్రము భేటికి రానిది మాది నేరమేమి

1. ‘మాకార్యము నీవు కన్నుల చూస్తువు’ అని.

2. ‘నాలుగేలు మాబొబ్బిలోరిదండు’ అని.

3. ‘నడువుమన్నడు’ అని.

4. ‘బూసిదొరగారినేమి’ అని.

5. ‘న్యాయం తీర్చి వేయు’ అని.

6. ‘మూడువేలిస్తాము’ అని.

†ఆరాజమహేంద్రము హద్దుచేసుక బొబ్బిలిదాకా
మజలీకి వేయేసిరూపాయల చొప్పున యిస్తాము†
అలాగునైతే రాజులు మీరు సమ్మతి పడండీ
రాజులు మీరు సమ్మతి పడితే మేము వెళ్లుతాము
దివాణ ముండగా రాజులక్కర మాకే మన్నాడు
మాకు రాజులతో పనిలేదనెను ధర్మారాయుడు
అలాగునైతే, జమాబంది నీవు చేయవోయి వో హైదరుజంగు
ఆసమయంలోనే, హైదరుజంగుకు జాబు లంపెను విజేరామరాజు
జాబులలోపల యేమని వ్రాసెను కళింగపెదరాజు
బొబ్బిలినున్న, ధర్మారాయుడు రాయబారము వచ్చి నిలిచినాడు
నీవు రాయబారము కుదురనియ్యకు వో హైదరుజంగు
పన్నెండ్వేలరూపాయలు[1] నీకు యీనా మిస్తాను
ఆజాబు చూచి తా జేబులో వేసె తా హైదరుజంగు
లంచము తిన్న హైదరుజంగు తంతరపెట్టెను
మీరు, యింకా యెందుకు కూర్చున్నారు వెలమదొరల్లార
కోటపాడుగునా ధనముపోసినా కోటలు వదలముగ
కోటయెత్తున పీనుగలు పడక తిరిగి వెళ్లమేము
నీవు లంచము తిన్న మాటలాడకు వో హైదరుజంగు
లంచ మనంగనే పరాసులకు బహుకోపం వచ్చె
నాచదురుమీద లెమ్మని పలికెను ధర్మారాయణ్ణి
చెయ్యిపట్టి మరీ గుంజవచ్చెను ముహ్మదు ఖాసీము
ఆఁ ఆఁ అంటూ వారు దిగ్గున లేచిరి
పేటున వున్న పడాల రాముడు చివుకున లేచెను
ఏల మావర్ణానికి యెంత వెత్తిపనులు చేస్తివయ్యా
మాతికి మీసము లేదా మీకు వెలమదొరల్లార

---

† వచనము.

1. 'పన్నెండువేల రూపాయలు' అని.

మొలలో బాకులు లేకపోయెనా ధర్మారాయుడా
నన్ను పంపిన రంగారాయుడి సెలవే లేదాయె
గోల్కొండ దరబారులో బూసికి గోరీ కట్టింతు
ఆగోరీమీద సున్నపునీళ్లు చల్లింపకపోను
†చేతులమీది పిగిలిపిట్టలే మన్నె డేగలే చదుర్న కొట్టెరి
మొలలో వున్న పూలబాకులే చురకత్తులే
చాయల[1] బాకులు జరీల్న వొరదూసిరి†[2]
చదుర్న వున్న హైదరుజంగు గడగడ వణకెను
అబ్బా యిట్లా వెలమలుకాన[3] రాజుకు లొంగరుగ
రాజుకు లొంగని వెలమలు వుంటే మనమే కొట్టాలె
మనకు లొంగని వెలమలు వుంటే రాజులు కొట్టాలె
మమ్ముల కొడితే పూరేమయ్యా పేరే మన్నాడు
మిమ్ముల కొడితే గోలకొండకే మసూరు వుంటుంది
దివాణము వచ్చి[4] మొవాసుమాటలు ఆడకయ్య నీవు
ఆలాగునైతే పరాసువారి పారా లుంచేము
పారాలోను ధర్మారావునే పదిలముచేయండి
బులా వనగనె పన్నెండు పారాల్ గిరదాయించిరి
ఏడు గడెలు నీ పారా నుంటే[5] వెలమబిడ్డనటర
†ఏడు గడెలు నీ పారా నుంటే[5] నీయంత లేసి పౌంజు
దార్లుగా నావంటి వో పాళెగాండ్లుగా ఫే
మకార్ సరదార్లు నాడు అందరు మడిగేరు†
ఇందులోను యే పారావోయి మమ్ముల నాపేది

1. ఛాయభాకులు (క); ఛాయలు భాకులు (చ). ఈ పంక్తియు దీనిపై పంక్తియు వచనమని తోచును.

2. 'వరదూసె' అని. 3. 'కాబట్టే' అని.

4. 'దివాణమొచ్చి' అని. 5. 'నీ పారాలుంటే' అని.

† వచనము.

కాల్లో కాలని పలి(కాడయ్యా)[1] సిబ్బందివారికి
నూగు నూగు మీసాలవారుగా నూటికి దొరలేమి
కాల్లో అనగా, పిగిలికుచ్చులే సోగయీటెలే జవ్వన వంచిరి
వంచిన యీటెలు యెత్తక పొడిచిరి వెలమదొరలు వారు[2]
రామ రామ రా మంటూ వారు గదిమి పొడిచినారు[3]
ఈటెల గుచ్చి లేవనెత్తిరి తెల్లవాండ్లనోయి
బాకుల గుద్దీ పండబెట్టిరి చపేగార్లనేమి
నూటికి పొడిచీ సెలగంటాడు ధర్మారాయడు
పన్నెండు పారాల్ విరుగబొడిచెను పడాల రాముడు
పారా లన్నీ గదుముక వచ్చిరి[4] డేరా బైటికిని
రక్తపుబట్టలతోటట్లుగా పాల కెక్కినాడు
పడాల రాముడు గుఱ్ఱాన్నెక్కి సవారి తీసెను
పారామీదనె నాల్గువందల తెల్లవాండ్లుగా
ఆరువందల చపేగారులే మరణాలైనారు
గోవింద భజ గోవిం దంటూ పాలకి సాగించె
రామ రామ రా మంటూ వారు కోటకు వస్తుండె
కోటవెలుపల వున్నాయయ్యా యేడు కోటలోయి
†సంతపేట మరి చాకలిపేట మేదరిపేట కంచరిపేట చేరి
గూడెము బొందిలిగూడెం బ్రాహ్మణపేట
యేడుపేటలే తగులబెట్టి తా కోటకు వచ్చెను†
తన, బావమరదిగా రంగారాయడు యెదురుగ వచ్చెను
మీరు, చల్లని వార్తలు చెప్పండయ్యా బావ ధర్మరావు
నీ, చల్లని వార్తలు కొల్లబోనుగా యిక నేమున్నది[5]

1. 'కవులో కాలాని పలికెనో సిబందివారికీ' అనిమూలము.
2. 'వెలమదొరలు తమరు' అని. 3. 'గదిమి పొడువగాను' అని.
4. 'పరాలన్నీ గదుముకొచ్చిరి' అని. † వచనము.
5. 'యిక నేమున్నాది' అని.

మీారు, పోయినవారు చల్లగ వస్తిర[1] ధర్మారాయడా
అంతా చల్లగ[2] వచ్చినామయా రంగారాయడా
పైకానికి వొప్పినారుగా పరాసుదొర లేమి
నడుమ లంచము తిన్న హైదరుజంగు తంతర పెట్టెను
పైన యిన్ని చిట్టెలు పెట్టినవాడు విజేరామరాజు
అందుకు నీవు యేమని వస్తివి బావ ధర్మరావు
నేను చదురుమీాదనె పొడుచుక చచ్చే మాటలాడినాను
నీవు చాలని మాటలు ఆడివస్తివా చాలని బంట్రోత
నేను, చాలని మాటలు ఆడ లేదయా రంగారాయడా
చదురుమీాదనే పొడుచుక చచ్చే మాటలాడినాను
అసలింటి తురకబిడ్డయితే యింట్లో [3]చచ్చునుగా
పరాసువాడు గనుకను బావా వెనుకతగ్గినాడు
మనము, కోటపొడుగున ధనము పోసినా కోటను వదలముగ[4]
ఇకను నీపనిమీాద వుండవయ్యా రంగారాయడా
రంగారాయుడి భార్య నాడూ దేవి మల్లమ్మ
ఆ, మల్లమ్మదేవి దివాణమొచ్చె ధర్మారాయడు
నీవు, ఎన్నడురాని ధర్మరాయడా యెందు కొచ్చినావు
మనకు, మరణకాలమే దాపుకు వచ్చెను చెల్లెలు మల్లమ్మ
అందరికిని వొక్కచావుగా వ్రాసినాడు బ్రహ్మ
ఈవేళరాతిరో రేపురాతిరో మరణము సిద్ధముగ
కొమారుడైన వెంకటరావును చంకబెట్టుకొని
కొమార్తైయైన సుందరమ్మను చేత పుచ్చుకొని
గోడుగోడున దుఃఖపడుతుంది[5] దేవి మల్లమ్మ
నాయన, మాయింటను యేల పుడితివి కొడుక వెంకట్రావు[6]

---

1. 'చల్లగొస్తిరా' అని. 2. 'అత్తాచల్లగ' అని.
3. అసలింటతురకా బిడ్డైతే విడ్లో' అని. 4. 'కోటలు వదలరుగా' అని.
5. 'దుఃఖపడతదీ' అని. 6, 'కొడు కెంకట్రావు' అని.

పాపకారి మల్లమ్మకడుపున ఎందుకు పుడితివి
ద్రోహంరాలు మల్లమ్మకడుపున ఎందుకు పుడితివి
నీకు దొరతనపు రేకలు లేవుగ కొడుక వెంకట్రావు[1]
సరిపెణలు చొకట్లూ కొడుక్కు చేయిస్తినేమి
సరిపెణలు చొకట్లూ కొడుక్కు పెట్టనైతినేమి[2]
గోడుగోడున దు:ఖపడుతుంది[3] దేవి మల్లమ్మ
కుమారుని, చంకబెట్టుకొని రంగారాయని కచేరి కొచ్చింది
పేటుగ వుండి, చంకను వున్న వెంకట్రాయని కచేరిని[4] దించింది
చేతులార మరియెత్తుకొన్నాడు[5] రంగారాయుడు
కారణాలు యీలాగు నుండె నో మానాయన నీకు
మా తండ్రిగారి పే ర్పెట్టుకొంటిని[6] వెంకట్రాయడా
కోటలోపల అదృష్టవంతులు వొకరూ లేరైరి
గడకో గడకో పరాసుఅన్నము తినకతీర దేమి
ఇంకా మీరు బ్రతికియెందుకు వెంకట్రాయడా
మొలలోవున్న పచ్చల బాకు జరేల్న వొర దూసి
ఎగురవేసి తా నరకబోయెను వెంకట్రాయణ్ని[7]
చేతిలో బాకూ వొడిసిపట్టెను దేవి మల్లమ్మ
ఎంత వెర్రివారయ్యా మీరు వెలమదొరల్లారా
చామర్లకోటకు నీలాద్రిరావు తులసిమొక్క కాదా
విజేనగరాని కానందరావు తులసిమొక్క కాదా
మనము చస్తే, మన బొబ్బిలికోటకు వెంకట్రావు తులసిమొక్క
చామర్లకోటలో[8] (వుంది) నాకు చెల్లెలు జగ్గమ్మ [యేమి

1. 'కొడు కెంకట్రావు' అని. 2. 'పెట్టరాయనేమీ' అని.
3. 'దు:ఖపడతది' అని. 4. 'కచేరికి' అని.
5. 'యెత్తుకొన్నడూ' అని. 6. 'పేరెట్టుకొంటినీ' అని.
7. 'వెంకట్రాయణ్ని' అనుటకు 'దేవీ మల్లమ్మ' అని.
8. 'దామర్లకోటలో' అని.

జగ్గమ్మవద్దకు పంపుదునయ్యా వెంకట్రాయణ్ని
ఆలాగునైతే నీమన సనెను రంగారాయుడు
చదుర్న వున్న వెంకట్రాయణి చంక కిచ్చినాడు
తిరిగి మళ్లీ[1] దివాణమొచ్చెను దేవి మల్లమ్మ
కరణాల సుందయ్యగారిని హుదుర్న పిలిపించి
నీవు కర కర కర జాబులు వ్రాయి కరణం సుందయ్యా
జాబులలోపల యేమని వ్రాతును దేవీ మల్లమ్మ
పూసపాటివారిల్లు నాకు పుట్టిల్లనుకొంటి
నేను తోడబుట్టిన తోడునుసుమ్మీ విజేరామరాజ
అన్నదేవ నిను చాల నమ్మితి అన్నయ్యదొరగారు
నేను పుట్టినాను చామర్లకోటలో విజేరామరాజ
నేను పెరిగినాను బొబ్బిలికోటలో తఖ్తుమీదనేను
బొబ్బిలికోటా విజేనగరమూ కావటికుండలుగా
ఈ కావిటికుండలు బోర్లదొయ్యకు కళింగపెదరాజ
నావ్రేళ్లమట్టెలు నీళ్ల గలపకు అన్నయ్యదొరగారు
నాచేతెడు గాజులు చెక్కచెయ్యకు అన్నయ్యదొరగారు
నీకు, చేతెడుగాజులు నిలిపినకీర్తి జగతిని వుంటుంది
చీరలు రవికెలు, పసుపు కుంకుమ పంపించుమ అన్నయ్య దొరగారు
బొబ్బిలిదీపము నిలుపవయ్యా పూసపాటిరాజ
నీ వర్ధానికి జడియబోకుమా అన్నయ్యదొరగారు
అంతగా నీ దివాణానికి[2] లేమిడి వస్తే విజేరామరాజ
నా పుట్టింటివారు దామెర్లవారు యిచ్చిన రవికుండె.
ఆరవికె పక్కటే నల్లభైవేలకు తాకట్టెట్టి నేను
గోనెలతో, పదార్థమైతే విజేనగరమే తోలి పంపుతాను

1. 'తిరిమల్ల' అని మూలము.

2. 'అంతగా నాదివాణానికి' అని.

ఆలాగునంట్నూ జాబులు వ్రాసెను కరణం సుందయ్య
పెనిమిటిగారు యెరుగకుండనే రాజుగారికేమి[1]
మల్లమ్మదేవి లోలోపల జాబులు వ్రాయించె
ఆజాబులు వ్రాసి హరకారాల చేతి కిచ్చినారు
గుజిలీవేళలో[2] కూర్చున్నాడు కళింగపెదరాజు
†మల్లమ్మదేవి జాబు లనగనే కండ్ల చూడక
చెవుల వినకను జాబులు చించేసె†
ఆసరసనున్న గుండా లప్పన్న యేమని పలికెను
మీకు, న్యాయము కాదు ధర్మము కాదు విజేరామరాజ
ఆడవారు పంపించిన జాబులు ఆలకించవలెను
నీమాటలు యిప్పుడు చాలించుమి గుండా లప్పన్న
నేను, యీతూరిగాక యేడుతూర్లుగా బొబ్బిలి కొస్తిని[3]
ఏడు తూర్లకూ వొకతూరైనా భేటి కొచ్చినారా
ఏడు మార్లకూ వొకమారైనా జాబు లంపినారా
నే నొకతూ రొచ్చి పల్లకీలు దిగదొక్కి పారిపోయినాను
మజూర్లచేత పెట్టి పంపిరి పల్లకీలు నాకు
చూడు, కాకులు గద్దల కారాడింతును బొబ్బిలిమీదనుగ
పుట్టకోట చప్పంగా దున్ని పొగమొక్కలు వేతు
పాటిపొగాకు పుచ్చుకోక నా పగలే తీరేనా
రంగారాయడి శిరస్సు నేను కోసుకపోతాను
బొబ్బిలి కొట్టి ఆనందరావుకు పట్టం కడుతాను
నీవు జడియబోకుమా వెరవబోకుమా దేవీ మల్లమ్మ
బొబ్బిలి పైకం కళింగపైకం పంచుక తిందాము

---

1. 'పెనిమిటిగారిని యెరక్కుండనే రాజుగారికి మల్లమ్మదేవీ' అని మూలము.
2. 'గుజురీ' అని మూలము. 'గుజిరి' అని (చ)ప్రతి.
3. 'బొబ్బిలికి వెళ్లితిని' అని యుండవలెను.

† వచనమని తోచును.

నీవు చావగల్గితివా[1] కోటలోపల చిచ్చుపెట్టుకోమ్మ
బ్రతుక గల్గితివా[2] నా పాలకొండకు వలసలు రావమ్మ
పాలకొండలో, మూడు వూళ్లుగా ముండగ్రాసము వ్రాసి యిస్తాను
జాబులు తెచ్చిన హరకారాల చెంపలు కొట్టించె[3]
గోడుగోడు మంటూను వచ్చిరి హరకారావారు
*మల్లమ్మదేవి కొలువుకు వచ్చిరి హరకారావారు*
చల్లని వార్తలు కొల్లబోనుగా దేవీ మల్లమ్మ
మూడు వూళ్లుగా ముండగ్రాసమే యిప్పిస్తాడంట
నారాయణ నారాయ ణంటూ చెవులు మూసుకొనెను
పాపకర్ముడవుగ వున్నావేమి[4] పూసపాటి రాజ
దోసిటూను దుమ్మెత్తినదిగా[5] దేవి మల్లమ్మ
రాజుగారిగా వేలంమీదను తూరుపారబట్టె
నీవు దుమ్మునను ధూళైపోదువు పూసపాటి రాజ
ఇన్ని కబురులూ తెలియకున్నాడు రంగారాయుడు
ఆడువారిబు ద్ధనగా యేమి అసరాబు ద్ధనెను[6]
వెలమసీతుల అభిమానమ్ము తనకు తెలియలేద
కోటబైటికి బేదీ(?) యిచ్చిరి ఆడబొట్టెలేమి
కాళ్లు చేతులూ ఆడనివ్వరు కోటలోపలను
పాలకొండమన్యానికి బొట్టెల వలస లంపవలెను
ఏనూటితో వెంగళరావును వెంట పంపుదాము
తమ్ముణ్ని వెంగళరావునే హుదుర్న పిలిపించి
†ఆడబొట్టెల వెంటబెట్టుకొని పాలకొండకు వలస వెళ్లు మనెను†
ఆ మాటలకు బహుసంతోషించె వెంగళరాయుడు

---

1. 'చావగల్తివా' అని. 2. 'బ్రతగగల్తివా' అని.
3. 'కొట్టించి' అని మూలము. 4. 'పాపకర్ముడా వున్నావేమీ' అని.
5. 'దోసెడూను దుమ్మెత్తినాదిగా' అని మూలము.
6. 'అసరాబుద్ధే నీకు' అని మూలము.

లాగు తొడిగెను కాసెపోసెను హనుమంతకాసె
చంద్రకావిరుమాల చుట్టెను వెంగళరాయడు
ఎడమచేతనె డాలు పన్నెను కుడిచేతను బాకు
ముస్తాదయ్యా వస్తున్నాడు వెంగళ్రాయడు
వదినెగారు మల్లమ్మాదేవిమేడ కొచ్చినాడు
పైనముసుమ్మా పైనము సుమ్మా వదినె మల్లమ్మా
ఎక్కడి పైనము యేడ పైనము వెంగళరాయడ
†అన్నయగారి సెలవులాయెను పాలకొండకు
న్యానకు మనము వలసలు పోతాము†
ఆ మాటలకు బహుతామస మొచ్చెను మల్లమ్మకేమి
మాతిన మీసము లేదా మీకు వెలమదొరల్లార
ఆ పాలకొండకు వలసలు పోతే మనము అందరము
ఆ పాలకొండకు అణిదారుడు పూసపాటి రాజు
మనవెంటనే[1] ఆడకు రాజు దా డంపకపోడు
సిపాయి కొక్కస్త్రీని కట్టడా విజేరామరాజు
ఒకరిచేతిలో చచ్చేటందుకు కారణ మే మనెను
మీరు, రామ రామ రా మనంతకాలము రాజ్యము యేలేర
యుగములు జగములు గలంతకాలము భూములు యేలేర
తిరిగిపోయి మీతల్లికడుపున మళ్లా పుట్టేర
చస్తేను మనపే రుండును[2] బ్రతికితేను లేదు
చస్తేను మన కోటలోపల[3] మనమే చావవలె
ఈ మాటలకు బహు తామస మొచ్చెను వెంగళ్రాయణికి
అన్నగారికచేరికి[4] వచ్చెను దొర వెంగళ్రావు

---

† వచనము.

1. ‘మన లోలోపల’ అని. 2. చస్తేను మరిపేరుండూ’ అని.

3. ‘మరికోటిలోపలా’ అని మూలము.

4. ‘కచేరికొచ్చెనూ’ అని.

వెళ్లుతానని[1] మ ళ్లిందు కొస్తివి వెంగళ్రాయడా
మహాప్రభో, ఆడువారికి శౌర్యము వచ్చెను[2] అన్నయ్యాదొరగారు
ఆడువారికి శౌర్యము వస్తే పను లేమున్నవి[3]
నాకు యేమి తోచకున్నదోయి తమ్ముడ వెంగళ్రావు[4]
నా ప్రాణముపంటి బావమరదిగా తాండ్ర పాపయ్య
తాండ్రవారి పాపయ్య యిప్పుడు కోటలో లేడాయె
అతను పోయి రాజారపు కోటలో ఠాణావున్నాడు
తాండ్రవారి పాపయ్య యిప్పుడు కోటలో వుంటేను
ఏడు యేడు పద్నాలుగేళ్లకు సాధ్యమగునా నాకోట[5]
మనకారణా లీలాగు నుండెను తమ్ముడ వెంగళ్రావు[6]
గడెకో గడెకో పరానుఅన్నము తినకతీరదేమి
శ్రీమహాలక్ష్మివంటి బొబ్బిలి చింద్రైపోతుంది[7]
పెద్దలనాటి బొబ్బిలికోట రుణముచెల్లె మనకు
బొబ్బిలిభోగము చెల్లెనయ్యా వెంగళరాయడా
తాండ్రవారి పాపయ్యకు మనము జాబులు వ్రాతాము
జాబులు వ్రాస్తే రాజారము యెట్లా పోతవి[8]
హరకారాల పంపిస్తాము రాజారము మనము
రాజారము బొబ్బిలిసందున రాజుల చౌకీలు
చౌకీ దాటీ జాబులు యెట్లా రాజారము పోను
బికారివేషము వేతుమన్నారు హరకారాలేమి[9]

---

1. 'వెళ్లుతాను' అని.
2. 'శౌర్యమొచ్చెను' అని.
3. శౌర్యమొచ్చితే పను లేమున్నావీ' అని.
4. 'తోచకవున్నారోయి తమ్ముడెంగళరావు' అని.
5. 'సాధ్యమవుతదా నా బొబ్బిలి కోటా' అని.
6. 'తమ్ముడెంగళ్రావు' అని.
7. 'సింద్రై' అని మూలము.
8. 'రాజారామూ యెట్లా పోతావి' అని.
9. 'వేతమన్నరో హరకాళాలేమీ' అని.

ఆలాగైతే మంచి దన్నాడు[1] వెంగళ్రాయడు
†అన్నదమ్ములు బావమరదులు తండ్రికొమాళ్లు మేనమా
మలు లక్కయింటి దివాణములోన కొలువై యున్నారు†
కరణాల రామయ్యగారిని హుదుర్న పిలిపించి
కర కర కర జాబులు వ్రాయుమ కరణం రామయ్య
జాబులలోపల యేమని వ్రాతును రంగారాయడా
ఉత్తరాది బంగారవు రాజు సాగప్పల రాజు
అడవికొల్లు యామూర్తిరాజు ఆనంద పెదరాజు
మన యింటిమీదికి దండు తెచ్చెను విజేరామరాజు
కాకిమూక పరాసులమూక కమ్మక వున్నది[2]
గడెకో గడెకో బొబ్బిలిమీద గనీబుతొతారు
మేము, పాపకారి పెండ్లిండ్లు చేస్తిమి కోటలోపలను
చుట్టాలు మరి బంధువులు వచ్చి కోటలో వున్నారు
ఆడబొట్టెల కోటలో వుంచి జగడపెట్టరాదు
మాకు, కోటలోపల రస్తు లేదుగా తాండ్ర పాపయ్యా
వెళ్లబోతే మరి త్రోవలు లేవు పరాస్పారావారు[3]
కంకణాల చేతుల నుండెను వెంగళ్రాయడు
మా కందరికిగా వొక్కమరణము సిద్ధమాయె నయ్యా
ఈ జాబులు చూచిన తక్షణమందు బావా పాపయ్య
రాజారమూ బొబ్బిలిసందున రాజుల చౌకీలు
రాజుగారిదండు విరుగబొడుచుక[4] కోటకు రావయ్యా

1. 'మంచిదన్నడూ' అని.

† వచనము.

2. 'పారాసులమూకా కమ్మక వున్నాది' అని మూలము.

3. 'పరాపరావారూ' అని మూలము. 'పారాపారావ్వారూ' అని (క), (చ) ప్రతులు.

4. 'దండెరిగి బొడుచుకొని' అని.

ఏనూటితో వెంగళ్రాయని యెదురు పంపుతాను
దిడ్డితలుపులు తీసివుంటాము[1] తాండ్ర పాపయ్య
నీవు మాలపల్లిమీదుగ రమ్మా మిర్యాల సీతన్న
లంచము తిన్న లక్షుమన్న నే తారున పొడవండి
నీవు, కొండబోటుగా తిరిగిరమ్మా తాండ్ర పాపయ్యా
చిట్టెలు చేసిన హైదరుజంగును విడిలో నరకండి
ఈరాత్రి వస్తివా నీకూ నాకూ చూపు లందుతవి[2]
లేకుంటే(ను) నీకూ మాకూ యింతే చూపులుగ
కడసారపూ దండమయ్యా బావా పాపయ్యా
జాబులు వ్రాసి లకోట చేసె కరణం రామయ్య
రంగారాయుడు మోరుచేసెను జాబులమీదనుగ
పచ్చిపాలతో పాకము చేసిరి గోదుమపిండేమి
పాకముచేసి గోదుమ రొట్టెలు వారు చేసినారు
ఆరొట్టెలనడుమా పొదిగినారయా బొబ్బిలి జాబులుగ
జాబులు మోసే హరకారాలు యిద్దర్ని పిలిచి
బికారివేషము వేయించిరి హరకార్ల కేమి[3]
చిరిగిపోయిన పాగా లప్పుడు తలకు చుట్టినారు
చిరిగిపోయిన అంగరకాలె వారు తొడిగినారు
కాసెకోకతో గోదుమరొట్టెలు నడుమున చుట్టిరిగ
మొలలో బాకులు సముజాయించిరి వారు యిద్దరేమి
దిడ్డిగుమ్మము బైటవెళ్లిరి[4] హరకారావారు
వేలాల వెంబడి[5] వొక్కొకగవ్వ బిచ్చమెత్తుకొని

1. 'తలుపులా తీసి వుంటమా' అని.
2. 'యీరాత్తిరొస్తివా నీకూ నాకూ చూపులందుతావి' అని.
3. 'అరకాలాకేమీ' అని.
4. 'దిడ్డిగుమ్మమూ బైలుదెళ్లిరి' అని మూలము.
5. 'యేలాలంబడి' అని,

పన్నండు పారాలు వారుగా గడచివచ్చినారు
పదమూడో పారామీదా మీరా సాహేబు
బుజాన తుపాకి పెట్టుకొని తా పారా యిస్తాడు
ఎవ్వరితాలూ కంటూ వాడు హెచ్చరించినాడు
మేము, జగపద్దేవుతాలూకేమి కుమందాను వినుమి
మాదండ్లోకి యెందుకు వస్తిరి మీరు యిద్దరేమి
జగపతిరాజు[1] దగ్గర మేము కొలువైయున్నాము
నిన్నగాక మరి మొన్నటిదినము నేరముచేశాము
మాకొలువులు గట్టిగ తీసివేసెను జగపతిమహారాజు
మాజీతాలు మరి యెగవేసెను జగపతిమహారాజు
ఉత్తరాది మాయిండ్లకు మేము వెళ్లుతువున్నాము
బత్తెములేక యీవేలాల్లో బిచ్చమెత్తుతాము
సోదాయిస్తేగాని మిమ్మును పోనివ్వ నన్నాడు
పైబట్టలూ తలపాగాలూ సోదా[2] పుచ్చుకొనిరి
నడుమున వున్న గోదుమ రొట్టెలు గట్టిగ విప్పిరి
గోదుమరొట్టెలు తునాతునకలుగ తుంచి చూచినాడు[3]
ఆరొట్టెలనడుమా పొదిగివున్నవి బొబ్బిలి జాబులు
తెలుగు (జాబులు) చదువుకున్నాడు[4] మీరా సాహేబు
దొరకె(ను) దొరకె(ను) బొబ్బిలిజాబులు నేటికి దొరకెను
ఈజాబులుగనుక రాజుగారికి చేతికి యిస్తాను
నా కేనుగ బహుమాన మిస్తాడు విజేరామరాజు
అప్పు డేమని అనుకొన్నారు హరకారావారు
వకరిచేతిలో వీరు చావరు మన బొబ్బిలివారు

---

1. ‘జగపతిరావు’ అని.
2. ‘సోద’ అని.
3. ‘తుంచిచూసినారు’ అని.
4. ‘తెలుగు చదువుకున్నడూ’ అని మూలము.

బొబ్బిలివారి కీర్తి చాలా దూర ముండబోను
అందులోను మరి కించి త్తయినా మనకే వుండాలె
మొలలో వున్న దొంగబాకులూ జరేల్నా తీసిరి
వెనుకా మురదూ య్యాభైముగ్గుర్ని విడిలో[1] పొడిచిరిగ
ఆబాకుతో[2] గుద్దుక ధరణి కొరగిరి హరకారావారు
ఫెల్లు మన్నది రాజువేలము ఘల్లు మన్నదోయి
ఆసందట్లోనె మీరా సాహేబు యెదుటి కెళ్లినాడు
సలాముచేసి నిలబడ్డాడు రాజుగారి కేమి
ఈర ద్దేమీ గల్లం తేమీ మీరా సాహేబు
ఈవేళకాడ నాతో నీకు పను లే మన్నాడు
మహాప్రభో, బొబ్బిలి జాబులు దొరకనేమి మమ్మేలిన ప్రభువ
బొబ్బిలిజాబులు అనగా రాజు బొబ్బ పెట్టినాడు
ఏవి యేవిరా బొబ్బిలి జాబులు యెపుడు కండ్ల చూతు
జాబులు గ(డ)గడ చదివినాడుగా విజేరామరాజు
దొరకే దొరకే బొబ్బిలిఆయువు నేటికి దొరకెను
నా కంట్లో నలుసు బైటికి వచ్చెను యిన్నినాళ్ల కేమి[3]
తాండ్రవారి పాపయ్య యిప్పుడు కోటలో లే డేమి
ఇదే సమయ మన్నాడోయీ బొబ్బిలిమీదికి
తెల్లవారితే తాండ్ర పాపయ్య కోటకు వస్తాడు
తాండ్ర పాపయ కోటకు వస్తే యేడు యేడు(లు మరి)
పద్నాలుగేండ్లకు సాధ్యము కాదు యీబొబ్బిలికోట
కట్టుపంచతో కాలినడకతో బూసిభేటి కెళ్లె
సలాముచేసి నిలబడ్డాడు విజేరామరాజు

---

1. 'యాభైముగ్గు ర్నిడిలో' అని (చ) ప్రతి; 'యిడిలో' అని (క) ప్రతి.
2. 'అ బాకులో' అని మూలము.
3. 'నాకంట్లో నలుసు బైటకొచ్చెను యిన్నాళ్లకమేమి' అని.

డొంకలోని పులి వెళ్లి బూసీ పొదలో చేరింది[1]
ఈ వేళకాడ యెందు కొస్తివి కళింగపెదరాజ
†గుఱ్ఱ ముండగా నాల కుండగా యేను గుండగా పాల
కుండగా కాలి నడకను యీవేళకాడ యెందు కొచ్చినావు†
గుఱ్ఱము నాలకి కొల్లబోనుగా బూసీమహారాజ
బొబ్బిలిజాబులు చిక్కినవయ్యా[2] యీవేళకాడా
జాబులలోపల యేమి వున్నది[3] విజేరామరాజ
తాండ్రవారి పాపయ్య యిప్పుడు కోటలో లేడయ్యా
తెల్లవారితే పాపారాయుడు కోటకు వస్తాడు
†తాండ్ర పాపయ కోటకు వస్తే ఆరు నెలలు పో
రాడినగాని బొబ్బిలి రాదేమి†
ఆ తాండ్ర పాప య్యనేటివాడు యెవ్వా రన్నాడు
బొబ్బిలికైతే పెద్ద పులిగా తాండ్ర పాపయ్య
రంగారాయుడి భావమరదిగా పాపారాయుడు
అతను పోయి రాజారపుకోటలో తానా వున్నాడు
ఎన్ని వేలకు మొనగా డేమి తాండ్ర పాపయ్య
ఎన్ని వేల బల మెందుల కయ్యా పాపయ్యే చాలు
అంత(టి) వడిగల బం టున్నాడా యీ బొబ్బిలిలోను
†తాండ్ర పాపయ పేరు చెప్పితే మా వేలంలోపల
జ వేసిన[4] జోడుగుర్రాలు దాణా మేతా మేయక
అవ్వీ గడగడ వణకును†
తాండ్ర పాపయ పేరు చెప్పితే నీళ్లు తాగ వయ్యా[5]
ఇదే సమయ మన్నా డయ్యా బొబ్బిలిమీదికి

1. గుహలో అనియుండిన బాగుండునేమో. మూలములో గుఱ్ఱము నాలకి తరువాతి చరణ మిది.
2. 'చిక్కేనయ్యా' అని. 3. 'యేమున్నాది' అని.
4. (చ) ప్రతి 'జల్లిలేసిన' అని.
† వచనము.
5. 'పేరుచెప్పితే మాగుఱ్ఱాలు నీళ్లు తాగవయ్యా' అని మూలము.

తెల్లవారితే సాధ్యము కాదు యీబొబ్బిలి కోట
ఆరునెలలు పోరాడగలవా బూసీదొరగారు
ఆరునెలలు పోరాడేదానికి బలములు లే వనెను
నడి స్తివా యిప్పుడు నడువుమా బొబ్బిలిమీదికి
లేకుంటే నాకు సెలవు యిస్తే యింటికి వెళుతాను
నూటికి వొకడా[1] బం టున్నాడు యీ బొబ్బిలిలోన
†తాండ్ర పాపయ రంగారాయుడు యిద్దరు కలిసితే
నీది గోలకొండ కాసాలకట్ట్యూ లక్షా డెబ్బైనాలుగువేల
బలములు దామెనకట్టి నరికించేరు[2]†
తాండ్ర పాపయ, కొండవంచల నీగుర్రాలను గోతిలో పెడుతాడు
నిన్ను కనుమలు దాటి పోనిస్తాడా తాండ్ర పాపయ్య
గోలకొండ యీసందున నీకు గోరీ కట్టించు[3]
ఈ మాట వినగనె తందరగొన్నాడు[4] బూసీదొరగారు
†పిలువండోయి పేరువెళ్లిన సుబేదార్లను జమేదా
ర్లను అవల్దార్లను పేష్కార్ సర్దార్లను
యిప్పుడె హుదుర్న పిలవండీ†
వెండికర్రల చోపుదార్లు పదముగ్గు రొచ్చినారు
పేరుపేరున సుబేదార్లను పిలుస్తువున్నారు
†ముసే గదిల్ ముసే సవాల్ ముసే పనాల హ
లోజా షుకురుల్లా సిద్ధీ చిరేల్ కుమందాను నె ముసే
టక్కనే హైదరుజంగును లక్షుమన్న నే హూదుర్న పిలిపించి†
మొవాసులు వున్న బొబ్బిలిమీదికి యెవ్వరు నడిచేరు

---

1. 'వక్కడు' అని.

2. కాసాలకట్టూ' అని 'క' ప్రతి; 'రాసాలకట్టూ' అని మూలము; 'చ' ప్రతి 'దామేనకట్టీ నరికించాడా' అని.

3. 'గోరీ కట్టించీ' అని.

4. 'ఈ మాటలు వింటనే దొందరగొన్నడు' అని,

† వచనము.

మహాప్రభో, అమాసచీకటి మొయిలు కమ్మినది[1]
ఈవేళకాడ నడవ లేమన్నారు[2] బొబ్బిలిమీదికి
మహాప్రభో, సెలవు లిస్తే నడచే నన్నాడు[3] ముసే పన్నవాడు
తెల్లవా(రేస)రికి బొబ్బిలి జెండా తెగగొట్టి
పరాసువారి జెండా నేను యెత్తే నన్నాడు
లేకుంటే ఫిరంగివేతను నన్ను వెయ్యమనేను
బొబ్బిలి కొడితే బొబ్బిలి యీనాం యేమి యిస్తావు
ఆరువేల రూపాయలు నీకు యీనా మిప్పిస్తా
ఆరువేల రూపాయలు నేను వొల్ల నన్నాడుగ[4]
బోవగిరిని వొకల్లికోటను నేను తీసినాను
†ఆలాగే బొబ్బిలి కొడితే బొబ్బిలిలోపల
యేడుగడియలే దోపే యిమ్మనెను†
ఈ మాటలకు బహుమంచి దన్నాడు విజేరామరాజు
బొబ్బిలిదోపుకు వ్రాసి యిచ్చెను ముసే పన్నకేమి
కొలో కొలని పలికినారుగా[5] సిబ్బందివా రేమి
†కొలో అనగా పన్నెండువేలకే సోలుదారులే పద
మూడువేలకు సెట్టిగార్లుగా ఆరువేలకే పలందు
లేమీ మూడువేలకే పురతకీసులూ నాలుగువే
లకూ గోసంగులూ నడుములు కట్టిరి†
మందుకొట్లకు[6] సెలవులాయెను నబాబుదండ్లోను
మందు గుండు మరి పంచిపెట్టిరి బలములమీదనుగ
బాణాలు బాణాపు రవ్వలూ కట్టించడమాయె

---

1. 'అమాస చీకటి అంధకారము మొయిలు కమ్మినాది' అని.
2. 'కాడా నడలేమన్నరు' అని.
3. 'శల్వ్వ లిస్తే నడచేనన్నడూ' అని.
4. 'వుల్లనన్నడుగా' అని.
5. 'పలికిరి' అని మూలము.
6. 'మందు కోట్లకు' అని.

† వచనము.

*రామలక్షుముల ఫిరంగులయితే గట్టించడమాయె
రామసింగు లనేటి ఫిరంగులా గట్టించడమాయె
†కుంటిఫిరంగులు జబరజంగులె జజాయిలే బో
కుమారులే మగరదిండ్లు అనెడి ఫిరంగులే గట్టించడమాయె[1]†*
మూడువందల కంచుఫిరంగులు గట్టించడమాయె
*పన్నెండువేలకు చెకుముకిబారులు గట్టించడమాయె*
ఆరువేలకే జజాయిబారు అనుపుదిద్దినారు
భూతనాథు డనెడి[2]ఫిరంగిని గట్టించడమాయె
†చిల్లపెంకులే చిప్పరాళ్లు మసిబొగ్గులే డబ్బుల తి
త్తులు యేగానుల తిత్తులు గులకరాళ్లు మరి మం
గలికత్తులు గట్టనచేసిన ఫిరంగిబారేమి†
అమాసచీకటి——అంధకారము బైలుకమ్మివుండె
దండువెడల్పున యిలాయిచుట్టలు వేయించెను రాజు
దండువెడల్పున పగటివత్తులే[3] వేయించెను రాజు
†హైదరుజంగు లక్షుమన్న మరి హసానల్లి
ముసే పన్నగా అంబా రెక్కిరి†
పరాసువారి బలములు అన్నీ మరలబడ్డవేమి[4]
కైపు లేక మరి కార్యమ్మయితే గడియ చేయలేము
పన్నెండేసిపుట్ల వలందుసారా పీపాలే తీసి
మనిషికి శేరుచొప్పున వారూ కొలిచి యిచ్చినారు
కల్లూ సారా బాగా తాగీ కబురు తప్పినారు
పచ్చిమాంసము బ్రాందీ సారా వొడుల గట్టినారు[5]

---

1. 'మగరదిండ్లు అనేటి ఫిరంగులే గట్టింపటమాయె' అని; మొదటి నాలుగు చరణములు (చ) ప్రతిలో లేవు.

2. 'భూతనాథుడనేటి' అని. 3. 'పగురలు వత్తులే' అని.

4. 'మల్లబడ్డవేమి' అని మూలము. 5. 'వడ్ల గట్టినారు' అని మూ

† వచనము.

కలపట్మైతే కార్యమెరుగరు పరాసులైతేను
ఆరుగడియల రాతిరి ఆయెను ఆవేళకాడ
పట్టపగలుగా వున్నదయ్యా[1] పరాసుదం డంత
బొబ్బిలిలోపల జాము ఫిరంగి అవాజులేచింది
అవాజయితే విన్నాడేమి అనమరల్లి ఖాను
ఇప్పుడు వేసిన అవాజులైతే యెవ్వరి వన్నాడు
చిట్టెలవాది[2] రాజుగారు తా నేమని పలికెను
అదిగో బొబ్బిలివారు వచ్చిరి యిక నే మున్నది[3]
ఆమాటలు వింటూ మా రన్నాడు[4] బూసీదొరగారు
మారు మారు మరి ఖిల్లా మారో మాయన్నలారా
మారు మారు మా రన్నమాటకు మరుమాశ్చే[5] లేదు
ఫైర్ ఫైర్ ఫైర్ అన్నాడే(మీా) ముసే పన్నవాడు
ఫెళ ఫెళ ఫెళ మోగించిరీ ఫిరంగీలవారు
మూడు వందల కంచుఫిరంగులు ఫెళ ఫెళ మోగెను[6]
చిత్తవర్షము కురిసినట్టుగా తుపాకి పేలింది
ఆరువేల జజాయిబారుగా అనుపులేపినారు
భూతనాథు డనేడి ఫిరంగిగా ఫెళ ఫెళ మోగింది[7]
కొండలును పర్వతము లన్నీ బోరుపెట్టసాగె
చిచ్చుబుడ్లు పొగబాణా లన్నీ బోరుపెట్టెసాగె[8]
దెబ్బ దెబ్బకు మూరెడు కోట వుర్లి వుర్లి పడెను
రంగారాయుడి వనముపక్షులు అడలి చచ్చినవి[9]
వెంగళ్రాయుని చెరువుల నీళ్లు గదిమి యింకినవి[10]

1. 'వున్నాదయ్యా' అని.
2. 'బిట్టెలవాది' అని.
3. 'యిక నేమున్నాది' అని.
4. 'మారుమన్నాడే' అని.
5. 'మరి మాశ్చేలేదు' అని.
6. 'ఫెళ ఫెళ మోగించు' అని.
7. 'మోగించి' అని.
8. 'బురుజులు కమ్మేను' అని (క), (చ) ప్రతులు.
9. 'చచ్చినావి' అని.
10. యింకినావి' అని.

రామలక్షుముల ఫిరంగు లప్పుడు ఫెళ ఫెళ[1] మోగాయి
తట్టుకోట వొకతట్టుకు తట్టు ధరణికి కూలింది
తట్టుకోటలో కాపురమున్నారు బేరి కోమట్లు
బేరికోమట్లు (మగవా రందరు)[2] బేర మెల్లినారు
గృహాలకాడ వున్నారయ్యా బేరివారిస్త్రీలు
వొకరిచేతిలో చచ్చేటందుకు కారణ మే మనిరి
కొప్పులు విప్పిరి సిగలు వేసిరి బేరివారి స్త్రీలు
వెనుక సిగలు దట్టముగ వేసిరి బేరివారి స్త్రీలు
పైటచెరగులే నడుముల కట్టిరి బేరివారి స్త్రీలు
రాతిపెళ్లలూ వొడుల గట్టిరి బేరివారి స్త్రీలు
రోకళ్లయినా తీసుకొన్నారు[3] బేరివారి స్త్రీలు
పన్నెండువేల[4] పఠానులమీద కలపటమైనారు
రాళ్లు తీసుక రువ్వసాగిరి బలములమీదనుగ
మండివేసుకొని కూర్చున్నారు బేరివారి స్త్రీలు
రోకళ్ల గుద్దీ పండబెట్టిరి తెల్లవాండ్ల నేమి
రోకటిమడమల కుమ్మినారుగా వలందులనుపట్టి[5]
అట్లా నాలుగు గడియలు యుద్ధంచేసిరి బేరివారి స్త్రీలు
రెండువందల సోలుదారులకు తలలు పగిలినవి[6]
మూడువందల వలందులకు నడుములు విరిగినవి[7]
ఏ భైయింటికి గోసంగులు విడిలో మరణాలు
ఏనుగుమీద ముసే పన్నా కన్నుల చూచెను
ముక్కుమీదనే వేలు పెట్టెను ముసే పన్నవాడు

---

1. 'మోగించి' అని.
2. 'బేరికోమట్లు అంతా బేర మెల్లినారు.
3. 'తీసుకున్నరూ' అని.
4. 'పన్నెండేల' అని.
5. 'వలందులా పట్టి' అని.
6. 'తలలు పగిలినావు' అని మూలము.
7. 'వలందులాకు నడుము విరిగినావి' అని.

నేను, గోలకొండదరబారుమీదనే కొట్టిపోరినాను[1]
అంతలేసి మరాటిభూముల హాతముచేసినాను
ఇంతలేసి బంట్రోతుమానా నేను చూడలేదు
పోతుగడ్డకే తగు నన్నాడు బొబ్బిలిదరబారు
ఇది పుట్టకోటకే తగు నన్నాడు యా బొబ్బిలికోట
ఆడంగులా యుద్ధము చూస్తే యీలా గున్నది[2]
మొగవారు యుద్ధానికి వస్తేను క్షణము నిలువలేము
ఈ బొబ్బిలికోటలోపలా గడియ నిలువలేము
ఫైర్ ఫైర్ ఫైర్ అన్నా(డయ్యా)[3] ముసే పన్నవాడు
ఫెళ ఫెళ ఫెళ మోగించిరి ఫిరంగీల బారు
చిత్తవర్షము కురిసిన విధమున తుపాకి పేలింది
గప్పున, బేరిగూడెమే బొందిలి గూడెం మాడిపోయినవి[4]
డేగల పట్టే మన్నెగూడెమే మాడిపోయినది[5]
బేరిగూడెమూ బొందిలిగూడెం పూర్తిగ[6] దోచిరి
డేగల పట్టే మన్నెగూడెమే సాఫుగ దోచిరి
నరసయ్యపేటకు నబాబులమ్కరు దాడుతర్లినది[7]
ఇక్కడ, మూల బురుజులకు లగ్గల కెక్కిరి పరాసులై తేను
తోలుమోకునిచ్చెనలు వేసిరి మూలబురుజు కేమి
నిచ్చెనగుండా యెక్కుతున్నది పరాసుబల మంతా
మూలబురుజున తానా వున్నాడు ముత్యాల పాపయ్య
*సాదనలలో వడిగలవాడు ముత్యాల పాపయ్య*
మూడువందల సిబ్బందిలోనే బురుజున వున్నాడు
ఇంటిమీదికే వస్తూవుంటే యింకా కాసేదా

1. 'కొట్టి పోరిసారు' అని. 'యీలాగున్నాదీ' అని మూలము.
3. 'అన్నాడు అని. 'మదిపోయినాది' అని.
5. 'మాడిపోయినాది' అని. 'బొత్తిగ దోచీరి' అని.
7. 'దాడు తర్లినాది' అని.

గోవింద గోవింద యంటును యీటె లొంచినారు
వంచిన యీటెలు యెత్తక పొడిచిరి తెలగాలైతేను
భళీ భా ళంటూ వారుగా బాకుల పడగుమ్మి
చిలుకముక్కుల బాకులతోనే చెలగి పొడిచినారు
నూటికి పొడిచీ సెల గంటూడు ముత్యాల పాపయ్య
మండివేసి తా పొడుస్తున్నాడు[1] సీర్ల వెంకయ్య
ఈటెలు గుచ్చీ లేవనెత్తెను ముత్యాల పాపయ్య
వాళ్లు కల్లూను సారాయి తాగి కబురుతప్పినారు
మెడలమీద చేతులువేసి మూడు వందలు కోసిరిగ
ఎంత పొడిచినా విరుగు లేదయా తరుగదాయె బలము
గొర్లగోసిన విధమున చాలా గొంతులు కోస్తుండె
కాకిమూక పరాసులమూక కమ్ముకున్నదయ్యా
కోటపొడుగున రక్తధారలే కురవసాగినవి[2]
ఆకోటమెత్తున కోసివేసిరి తెల్లవాండ్ల నేమి
శాయశక్తులా పెనగినాడుగా ముత్యాల పాపయ్య
బారు పడితే బా రెక్కుతున్నది మొగలాయిలదండు
ఏనుగమీద(ను) ముసే పన్నా కండ్ల చూచినాడు
అంబారీనుండి దిగివచ్చాడు ముసే పన్న తాను
ఈ నిచ్చెనలమీదుగా యెక్కివచ్చెను ముసే పన్నవాడు
పరానువారిది లగువు చూడుమా ముత్యాల పాపన్న
సాదనలూ పరవళ్లూ చేసె ముసే పన్నవాడు
పేరు చెప్పి తా ముత్యాల పాపయపేగు వెళ్లబొడిచె[3]
నారాయణ నారాయణ యంటూ పాపయ్య వొరిగెను
పాపయ్య పడగనే పాపయ్యబలముల కొట్టివేసినారు

---

1. మండెమేసి తా పొడుస్తున్నడూ' అని మూలము.
2. 'కురవసాగినావి' అని మూలము.
3. 'పేరు చెప్పగా ముత్యాల పాపయ పేగులెల్ల పొడిచె' అని.

బొబ్బిలివారి కొడి స్తంభమే యెడమకాల తన్నె
బొబ్బిలివారి కొడి స్తంభమూ తెగగొట్టివేసిరి
పరాసుకొడీ లేవదీసిరి మూలబురుజుమీద
బొబ్బిలివారి నగారకుండ[1] *పగులగొట్టినారు
*పరాసువారి నగారకుండ "గణగణ మోగింది
ఝూం ఝూం మ్మనెను నగారదెబ్బా మూలబురుజుమీద
†అప్పుడు కోటలోపల రంగరాయడు వెంగళ్రాయుడు
అన్నదమ్ములూ తండ్రికొడుకులూ మామ లల్లుళ్లు[2]
మేనమామలు (అందరు కలిసీ) సాగటా లాడేరు
ఝూం ఝూం మ్మనే నగారదెబ్బా రాయడు విన్నాడు
కచేరి లేచి మూలబురుజులే పారజూచినాడు
పరాసువారి కొడి స్తంభమూ పారజూచినాడు
నీ, సాగటాలైన కూలిపోనుగా తమ్ముడ వెంగళ్రావు[3]
మూలబురుజుగా అత్తుకొన్నారు[4] పరాసు లిప్పుడు
ఇంటిమీదికి వస్తూవుంటే యింకా కాసేదా
కెవ్వనాను కేకవేసినాడు[5] వెంగళరాయడు
అన్నయ్యా, చచ్చేవారికి సముద్రము మోకాలిబంటి కాద ?
చావనివారికి సముద్రమ్మే తలమునక లేమీా
కాళహస్తి దామెర్లవారుగా విన్నావే రుండు
యార్లగడ్డ జూపల్లివారుగా విన్నావే రుండు
మాణిక్యరావు మల్రాజువారుగా విన్నావే రుండు
వెనుక తిరిగితే వెలమవారికి పను లేమున్నవి[6]

---

1. 'బొబ్బిలివారి నగరాకుండ గణగణ మోగింది' అని మూలము.

† వచనము.

2. 'మామ నల్లుండ్లూ' అని.

3. 'తంమ్ముడెంగళ్రావు' అని.

4. 'అత్తుకున్నరూ' అని.

5. 'కేకేసీనాడూ' అని.

6. 'పనులేమున్నావీ' అని.

నే నుండగా నీ వెందులకోయి తమ్ముడ వెంగళ్రావు[1]
నీ, వుండు వుండు మంటూనే రాయడు నడుము కట్టినాడు
లాగు తొడిగెను కాసెపోసెను రంగారాయడు
సాగు[2] యేదిరా బల్లె మేదిరా సేవక పీరేశా
సాగు బల్లెము తీసుకొన్నాడు[3] రంగారాయడు
లక్షలు చేసే[4] పచ్చల బాకు మొలలో చెక్కాడు
పేరు వెల్లిన వొంటర్ల నప్పుడు హుదుర్ను పిలిపించె
†రావువారిని గజరావువారిని వెలుగోటివారిని
జూపల్లివారిని గుమ్మళ్లవారిని గుమ్మడివారిని
తాండ్రవారిని చెలికానివారిని కాకర్ల సూరయ్య
గారిని పడాలవారిని బండివారిని బంతుల
వారిని చిమ్మటవారిని సిరసానివారిని మా
నేపల్లి మైగాపులవారిని రాజు పిలిచినాడు†
మూడువందలూ నడుములు కట్టిరి వొంట ర్లప్పుడు
దిడ్డితలుపుకాడ నిచ్చెన వేసె రంగారాయడు
నిచ్చెనమీదుగా[5] యెక్కి నారయా మూడువందలోయి
గప్పు చప్పు మనకుండా వారు మ్రుచ్చిలి నడిచిరి
మూలబురుజుకు మ్రుచ్చిలి వచ్చెను రంగారాయడు
వాళ్లు కల్లూ సారాయీ తాగి కైపు తట్టినారు
వొళ్లు తెలియక పడ్డారయ్యా మూలబురుజుమీద
కీసాభాసా ఆడుతున్నారు[6] కొందరు ఆపైన
కాలో కా లంటూ పలికెను రంగారాయడు
కా లనగనే, మూడువందల చువ్వాయీటెలూ జవ్వన వంచిరి

1. తమ్ముడెంగళరావు ' అని.
2. ' సాగు మేదిరా ' అని. ' సాగు ' అని (క), (చ) ప్రతులు.
3. ' తీసుకున్నడూ ' అని.
4. ' లక్షలు తీరిన ' అని.
† వచనము.
5. ' నిచ్చెనగుండా ' అని.
6 ' ఆడుతున్నరూ ' అని.

వంచిన యీటెలు యెత్తక పొడిచిరి వెలమలు తెలగాలు
రామ రామ రా మంటూ వారూ అదిమి పొడవగాను
నూటికి పొడిచీ సెల గన్నాడు రంగారాయడు
నూటికి పొడిచీ సెల గంటాడు పడాల రాముడు
వీథి వీథులుగ తీర్చి పొడిచిరి యినగంటివారు
నూటికి పొడిచీ సెల గంటాడు భట్టు తిమ్మరాజు
శాయశక్తుల పెనగినాడుగా రంగారాయడు
ఈటె యీటెకు యెంచక పొడిచిరి నూరేసిమందినిగ
బారు పడితే బా రెక్కుతున్నదీ మొగలాయిదండు
కాకిమూక పరాసుల మూక కమ్ముక వున్నది[1]
కోట పొడుగునా రక్తధారలే కురువసాగె నేమి
బొబ్బిలినున్న గ్రామదేవత వనమలమ్మ తాను
వనమలమ్మచెరువుకు రక్తము కాలువ సాగింది
నరికితేను పడివున్నవిసుమ్మా నల్లని శిరములు
కొట్టితేను పడివున్నవిసుమ్మా కొప్పుదబ్బ[2] లేమి
చీరుకాడు తా పేగులు గట్టిగ దొర్లాడె మొండెం
ఆవలించు మరి[3] శిరస్సులైతే అదరిపడె మొండెం
రామరావణ యుద్ధ మాయెనే మూలబురుజుమీద
ఎంత పొడిచిన కొడిస్తంభమే దొరక్క వున్నది[4]
నిచ్చెనలమీదుగ యెక్కుతున్నది పరాసుబల మంతా
పొడవలేకను చాలివచ్చెను రంగారాయణికి
మూడుమూళ్లమరి పట్టాకత్తి రాయుడు తెప్పించె
తోలుమోకు నిచ్చెనలు రాయడు తెగనరికివేసెను[5]
నిచ్చెనలతోను పడ్డారోయి మూడువందలైతే

1. 'పారాసులమూక కమ్ముక వున్నాది' అని.
2. 'కొప్పుదెబ్బలేమీ' అని.
3. ఆవలించి మరి' అని.
4. 'దొరక్క వున్నాది' అని.
5. 'తోలుమోకు నిచ్చెండ్లు రాయడు తెగనరికేశేనూ' అని.

పైనవున్న పరాసు లందరిని తలలు కొట్టివేసె
పరాసువారి కోడి స్తంభము తెగనరికివేసెను[1]
పరాసువారి నగారకుండ పగలదన్నినాడు
†తొమ్మిదిగళ్లకు రక్తపుబట్టలతోటట్లుగ[2]
కోడి స్తంభము లేవదీసినాడు†
బొబ్బిలివారి నగారకుండ గణగణ మ్రోగింది
మూలబురుజున మూడువందలను ఠాణా వుంచెను
కోటగవనికి[3] అనుపు పంపెను పడాల రాముణ్ని
రక్తపు బట్టలతోటట్లుగ[2] బావికాడి కొచ్చె
శోభనాల మరి బావులకాడ స్నానం చేసెను
ద్రస్సుఅయ్యా వస్తున్నాడు రంగారాయడు
చంద్రగిరి దివాణములోనికి రాయ డొచ్చినాడు
చంద్రగిరి దివాణములోను వెంగళరాయడు
మల్లా రాయడు కోడిపుంజుల పందెము కడుతుండె
నీ కోడిపందెము కూలిపోనుగా వెంగళ్రాయడా
ఇంటిమీదికే వస్తావుంటే యింకా కాసేదా
కెవ్వునాను[4] కిలార్చినాడుగా వెంగళ్రాయడు
నా కత్తికి సాము నేటికి దొరకెను అన్నయ్య దొరగారు
నా వెండికట్ల తుపాకిన గుండు మొగసే గడి యొచ్చె
నా బంగారు కట్ల బరిసకు యిప్పుడు భాగ్యం దొరికింది
చావంటే సంతోషము సుమ్మా బొబ్బిలివారికి
బ్రతుకంటే బహుదూర మంటారు[5] ఈబొబ్బిలివారు

1. 'తెగనరికేసేవూ' అని. 2. 'రక్తబట్టలా తోటట్లుగ' అని.

3. 'గమిడికి' అని. 4. 'కెప్పునాను' అని మూలము.

5. 'బహుదూరమంటరూ' అని మూలము. 'బ్రతుకమంటె బహుదూర మంటరూ' అని (క) ప్రతి.

† వచనము.

నాకు, సెలవులియ్యా సెలవులు యిమ్మా అన్నయ్యదొరగారు
నీ సెలవే నా సెలవు తమ్ముడ వెళ్లు మన్నాడేమి[1]
లాగు తొడిగెను కాసెపోసెను వెంగళ్రాయడు
చంద్రకావి రుమాలు చుట్టెను దొర వెంగళరావు
మురుగులు గొలుసులు చంద్రహారాలు ధరియించినాడు
పడాల రాముని దగ్గరకు పిలిచె వెంగళరాయడు
ఇంకా చూస్తా వేమి నడుము కట్టుమీ పడాల రాముడా
లాగు తొడిగెను కాసె కట్టెను పడాల రామన్న
చంద్రకావి రుమాలు చుట్టెను పడాల రామన్న
సింగోట మరి వీపులమీద అమర గట్టినాడు
ఎడమచేతనే బల్లెము పట్టె కుడిచేతనే బాకు
నీ రాణువవారికి పైనము చెప్పు పడాల రాముడా
†తెలగాలకు తురకలకేమీ బొందిలీలకు
ముతరాజులకు పైనం చెప్పెను†
వారు రెండువేలకే నడుములు కట్టి హాజరయ్యినారు
రెండువేల మరి వెలమదొరలకే పైనము చెప్పెను
ఈటెలతోడ ముస్తాదయ్యా నిలబడ్డారేమి[2]
దామెర్ల ధర్మయ్యగారుగా ముస్తాదైనాడు
తల్లిగారి కొలువుకు వచ్చెను దొర వెంగళ్రావు
తల్లిగారికే వెంగళ్రావు దండం పెట్టెను
పైనము సుమ్మా పైనము సుమ్మా తల్లి వెంగళమ్మ
ఎక్కడికి పైనము నాయన నీకు వెంగళ్రాయడా
బారులమీద యుద్ధం చేసే భాగ్య మ్మున్నది[3]
నాయన పగవారి కత్తి కిందు నీ కత్తి మీదు

---

1. 'వెళ్లుమన్నా వేమి' అని.

† వచనము.

2. 'నిలువపడ్డరేమీ' అని మూలము. 3. 'భాగ్యమున్నాది' అని మూలము

పగవారి వోదళము కిందూ నీ దళమూ మీదు
దండు గెల్చి చల్లగా రమ్మా కొడుక వెంగళ్రావు[1]
దీవించీ తాంబూల మిచ్చెను తల్లి వెంగళమ్మ
ముత్తవతల్లి నారాయణమ్మకు దండం పెట్టెను
ఏడుగురు మేనత్తగార్లకు[2] దండం పెట్టెను
అప్పగారు మరి రుక్మిణమ్మకు పైనం చెప్పెను
అప్పగారు మరి అలమేలమ్మకు పైనం చెప్పెను
పైనం సుమ్మా పైనం సుమ్మా చెలికా నచ్చమ్మ
పెత్తల్లి రాజమ్మగారికే దండం పెట్టెను
దండు గెల్చి చల్లగా రమ్మా కుమారచంద్రుడా
వదినెగారు మల్లమ్మదేవికి పైనం చెప్పెను
కంకణాల చేతుల నుంటివి[3] వెంగళ్రాయుడా
పెండ్లి కంకణము కాదమ్మా యిది వీర కంకణమ్ము
రాజుమీదనే వీర కంకణము నేను కట్టినాను
అన్నకూతురు సుందరమ్మ మరి దగ్గరి కొచ్చింది
ఎందాకా వెళ్లుతారు మరి చిన్నబాబు మీరు
బారులమీద యుద్ధముచేసే భాగ్య మ్మున్నది[4]
మాపనులైతే యేమి చేస్తావు చిన్నబాబు నీవు
నేను, బార్లమీద గెల్చి వస్తే మీరు భాగ్యవంతులుగా
నే బలములమీద మణిగిపోతినా కొమూర్తై సుందరమ్మ
చురకత్తులూ బాకులు లేవా ఆడువారి కెల్ల
నారాయణ నారాయ ణంటూ నడివీథి పట్టెను

1. 'కొడు కెంగళ్రావు' అని.

2. 'యేడుగూరి మేనత్తగారికీ' అని. 'యేడుగూరి' గ్రామము పేరుగాని ఇంటి పేరుగాని అయినచో 'మేనత్తగారికి' అనియే యుండవలయును.

3. 'కంకణాలచేతూల నుంటివీ' అని మూలము.

4. 'చేయ భాగ్యమున్నాది' అని.

†వెంగళ్రాయుడు ధర్మరాయుడు పడాల రాముడు ముంగలమొన
నాల్గువేలకు యీాలెపౌంజు మరి వెనుకా కదిలింది[1] [నేమి
గోపాలస్వామి గుడికాడి కొచ్చెను వెంగళ్రాయుడు
బావా, చస్తానో బ్రతుకుతానో మరి స్వామిని చూస్తాను[2]
మంచిది మంచిది మంచి దంటూనె కోవెలకు వచ్చిరి[3]
ఎక్కడికి స్వారి వెళ్లినావు మరి గోపాలస్వామి
మా మీాదనే పగలు పడితివా గోపాలస్వామి
లేక, కోటలు విడిచి కొండలలోనికి వలస వెళ్లినావా
శుక్రవారపు సేవలు నీకు యెవ్వరు చేసేరు
బాకున గుద్దీ పండబెడుదునా గోపాలస్వామీా
గోపాలస్వా మీాప్రకార మప్పుడు తల్లడించినాడు[4]
మెడలో వున్న పువ్వుల దండలు ధరణిని పడ్డవి[5]
ఎడమకంటనే నీళ్లు వచ్చెను స్వామివారి కేమి
తిరిగె కిరీట మప్పుడు గిర్రున తిరిగె – గోపాలస్వామి
దేవా[6] చెల్లె చెల్లె మరి బొబ్బిలిభోగము నేటికి చెల్లింది
బొబ్బిలికోటకు మాకు పూర్తిగా[7] రుణము చెల్లె దేవా
రెండు చేతుల రెండు పట్టాలు దూసుకొన్నా డేమి[8]
హరి నారాయణ నారాయణ యంటూ నడివీధి పట్టెను
నారాయ ణనగ పరాసుదండులో మున్నూరు పడ్డారు[9]
పక్షివలెను యెగిరాడు తానుగా[10] దొర వెంగళరావు

---

1. 'వెనక కదలినాది' అని.
2. 'స్వామి చూచేనూ' అని.
3. 'మంచిదంటనే కోవెల కొచ్చిరీ' అని.
4. 'తల్లడించినాది' అని.
5. 'ధరణ్ని పడ్డావి' అని.
6. 'భావా' అని.
7. 'మనకు గట్టిగా' అని.
† వచనము.
8. 'రెండు పట్టాలూ దూసుకున్న దేమీా' అని.
9. 'దండ్లో మున్నూరడ్డారు' అని.
10. 'యెగిరాడు తాడుగా' అని.

పోతూనె నగార వేసే వాంటెవాణ్ణిగా[1] తెగనరికివేసె
రుంజదెబ్బలూ వేస్తే వాండ్లను తలలు కొట్టినారు
నిశానిపట్టేవాణ్ణి గట్టిగా పడగుమ్మేసిరిగ
ఎడమచేత రుమాలు విసిరెను దొర వెంగళరావు
నాల్గువేలకే చువ్వలీటెలు[2] మరి జవ్వున వంచిరి
వంచిన యీటెలు యెత్తక పొడిచిరి వెలమలు తెలగాలు
భాళీ భా ళంటూ వారుగా బాకుల గుమ్మిరిగ
రామ రామ రా మంటూ వారూ అదిమి పొడవగాను
నూటికి పొడిచి సెల గంటాడు భూపతి రాయుడు
నూటికి పొడిచి సెల గంటాడు మల్లారాయుడు
నూటికి పొడిచి సెల గంటాడు ధర్మారాయుడు
నూటికి పొడిచి సెల గంటాడు పడాల రాముడు
నూటికి పొడిచి సెల గంటాడు గుమ్మళ్ల బుచ్చయ్య
ఎడమా కుడినీ చెలగి పొడిచెను కాకర్ల సూరయ్య
తోలి తోలి గుర్రాల పొడిచెను తోకల పొట్టయ్య
నూటికి పొడిచి సెల గంటాడు ముహ్మదు[3] ఖాసీము
నూటికి పొడిచి సెల గంటాడు తులసీరా మైతే
నూటికి పొడిచి సెల గంట్లాడు జేజేరా మైతే
జానకిరాము పట్టాభిరాము తరిమి పొడిచినారు
సీతారామూ తులారామూ బాకుల పడగుమ్మిరి[4]
నూటికి పొడిచి సెల గంటాడు దొర వెంగళరావు
సెలగో సెల గంటూ రాయుడు చతాలించి పొడిచె
పీనుగు పడితే పీనుగుమీదా యెక్కి పొడిచినారు

---

1. 'పోతానె నగారవేసే వంటివాంణిగా' అని మూలము.

2. 'నాలుగేలకే సువ్వలీటె మరి' అని.

3. 'ముమ్మదు' అని.

4. 'బాకుల పడగుమ్మే' అని.

బారు బారులే[1] కూలబొడిచెను పడాల రాముడు
ఇరువైయైదు గుర్రాలు నరికెను పడాల రాముడు
గుర్రాలు నరికీ, గుర్రాల తోకలు బల్లేలకు[2] జల్లీ వేయించె
వీధి వీధులుగ తీర్చి పొడిచిరి యినగంటివారు
అరవంగానే గొంతులు కోసెను ముద్దుల కేదారి
డొక్కలోను బాకు వేసి తిప్పెను ముత్యాల నాయకుడు
అట్లా, గొల్లపల్లికోనేటిదాకను తరిమి పొడిచినారు
రచ్చపల్లిమరిరావులదాకా తరిమి పొడిచినారు
సన్నాసులామెట్టకాడనే కోసి గుట్టవేసె
ఎంత పొడిచినా విరుగలేదయా తరగదాయె దండు
ఈటెలు గుచ్చీ లేవనెత్తెను దొర వెంగళరావు
వెంగళరాయణి చేతిలో యీటె ఫెళ్లున విరిగింది
నా ఆయు ష్షంతా తొలగిపోయె నో పడాల రాముడ
ఈటె విరిగితే విచారమేమి దొర వెంగళరావు
ఈటె విరిగితే బాకులు లేవా దొర వెంగళరావు
అప్పుడు, బాకులతోటి పొడుస్తున్నారు వెలమదొరలు వారు[3]
గుర్రాలా గుర్రపు రౌతులా కూలబొడిచినారు
ఏనుగతొండము పట్టుకొన్నాడు[4] వెంగళరాయుడు
తొండము పట్టుక తొండ మప్పుడు తెగవేసినాడు
అట్లా, కొండబోటుదాకాను వారూ తరిమి పొడిచినారు
ఆకొండబోటున అనుపు లున్నవి ఫిరంగీలబారు
నాలుగువేల జజాయిబారుగా అనుపే వున్నది[5]
ఫెళ ఫెళ ఫెళ మోగించినారు[6] ఫిరంగీల బారు

---

1. 'వారుబారులే' అని.
2. 'బళ్యాలకు' అని.
3. 'పొడుస్తున్నరో...దొరలు తమరు' అని.
4. 'పట్టుకొన్నడో' అని.
5. 'నాలుగేల...అనుపే వున్నాదీ' అని.
6. 'ఘొగించీరి' అని.

ఢాం ఢాం (ఢా)[1]మ్మని లేచినవిగా జజాయిల బారు
ఫెళ ఫెళ ఫెళ మోగుతున్నవి చెకుముకి తుపాకి
రెండువేలతో ధర్మారాయుడు ధరణి కొరగినాడు
నా కుడిభుజంవంటి[2] ధర్మారాయుడు కూలిపోయెనేమి
పేటున వున్న[3] పడాల రాముడు యేమని పలికెను
వెనుక చింతలూ యే మున్నవి[4] వెంగళరాయుడా
వెనుక తిరిగితే వెలమదొరలకు పరువే లేదండి
కొండబోటు[5] నీవు తిరిగి రమ్మా పడాల రాముడా
అగాదుమీదుగా వస్తా నన్నాడు[6] వెంగళరాయుడు
పదివందలా బలము తీసుకొని పడాల రాముడు
కొండవంచను[7] మరి తిరిగి వచ్చెను పడాల రాముడు
అప్పుడు మందు పోసి మరి గట్టిస్తున్నారు ఫిరంగు లన్నిటిని
కెవ్వునను[8] కిలార్చినాడుగా వెంగళరాయుడు
ఫిరంగులమీద దూకినాడుగా దొర వెంగళరావు
†వెంగళరాయణి తోటట్టుగా మూడువందలా వెల
మదొరలుగా వెంబడి దూకిరి†
ఎక్కడి వాండ్లను అక్కడనే పడగుమ్మెసిరిగ
ఫిరంగి వేసే వాండ్లనుబట్టి బాకుల పడగుమ్మి
మందు పోసే మరి వాండ్లనుబట్టి తలలు కోసినారు
గట్టన చేసే వాండ్లనుబట్టి బాకుల గుద్దిరి
ఫిరంగీలకూ క్రోసెడుమేర తరిమి పొడిచినారు

---

1. 'ఘాంఘాంమున లెగిచినావిగా జజాయలాబారు' అని.
2. 'కుడిభుజమంటీ' అని.
3. 'పెట్న వున్నా' అని మూలము.
4. 'వెనకచింతలూ యేమున్నావి' అని.
5. 'కొండబోయి' అని.
6. 'వస్తానన్నడు' అని.
7. 'కొండవంచు' అని.
8. 'కొప్పునాను' అని.

† వచనమని తోచును.

మూడువందల కంచుఫిరంగులు అత్తుకొన్నారేమి[1]
ఇవి బొబ్బిలికోటకు తోలిస్తామా పడాల రాముడా
మహాప్రభో, కాకిమూక పరాసులమూక కమ్ముక వచ్చెనుగ
మందు పోసి మరి గట్టించండి ఫిరంగు లిప్పుడు[2]
మందు పోసి మరి గట్టనచేసి తయారు చేసిరిగ
అడుపులమీద మోరుజాలుగా దండుమీద తిప్పి
ఫెళ ఫెళ ఫెళ మోగించిరి ఫిరంగీల బారు
అనేకబలములు పరాసు బలములు మాడిపోయినవి[3]
ఆపొగ వెంబడి దూకి వచ్చెను తురుపుగుర్ర మేమి
ఎనిమిదివందల బహుబలముల[4] తగులబెట్టేసిరిగా
మూడువందల కంచుఫిరంగులు విడిచిపెట్టినారు
పన్నెండువందల బహుబలముతో[5] వెంగళరాయుడు
అడ్డపల్లి[6] మయ్యారముమీదుగ వస్తూవున్నాడు
రాజుగారి మరి డేరా యేది పడాల రాముడా
అదుగో, పచ్చబనాతు డేరా సుమ్మా దొర వెంగళరావు
రాజుగారి మరి డేరామీదికి దూకులు దూకెను
రాజుగారి మరి డేరాచుట్టూ[7] యాభై పారాలు
ఇరువైయైదు పారాల నప్పుడు విడిలో పొడిచెను
వెంగళరాయణి రాక చూచెను విజేరామరాజు
అబ్బా పారా గడచి డేరాకు వచ్చెను యిక నే మున్నది[8]
బడిగుర్రాన్ని యెక్కినాడుగా పూసపాటిరాజు
బూసీచాటుకు పారిపోయెను విజేరామరాజు

---

1. 'అత్తుకున్నరేమి' అని.
2. 'ఫిరంగు లిప్పూడూ' అని.
3. 'మాడిపోయినావి' అని.
4. 'బాహుబలములా' అని.
5. 'పన్నెండొందల బాహుబలముతో' అని.
6. 'అడ్డపెల్లి' అని.
7. 'రాజుగారి మరిపారాచుట్టూ' అని.
8. 'యికనే మున్నాదీ' అని.

ఈవేళకాడ యేమి పనులుగా విజేరామరాజ
చెడ్డవాడు మరి వెంగళరాయడు బయలుదేరినాడు
నిన్ను జాగ్రతగ వుండుమంటూ[1] చెప్పవచ్చినాను
డేరామీద[2] దూకినాడుగా వెంగళరాయడు
ఏడిర వోరి యేడిర వోరి పూసపాటిరాజు
రాజుగారి వోడేరా చాలా పూని పొడిచినాడు[3]
డేరా కూలిన చందాన రాజ[4] యెన్నడు కూలేవు
నిన్ను చూచి బహురోజు లాయెను విజేరామరాజ
మా అన్న పెండ్లికి చామర్లకోటలో నిన్ను చూచినాను
కడసారపు కండ్లచూపులే చూదా మనుకొంటి
పారిపోయెగా దొంగ గన్నాడు పూసపాటిరాజు
మన్నెము తప్పితె పనికిరాదయా రాజుగారి బలము
రాజుగారిగా బలములమీద కలపటమైనారు
మూడువేలకే కోసివేసిరి రాజుగారి బలము
గొర్లు కోసిన విధమున చాలా గొంతులు కోసిరి
నారాయణ నారాయణ యంటూ మరణాలైనారు
ధణ ధణ ధణ మంటూ, వనమలమ్మ చెరువుకు రక్తము వాగై [పారెను[5]
నరికితేను పడివున్నవి సుమ్మా నల్లని శిరస్సులు
కొట్టితేను పడివున్నవి సుమ్మా కొప్పుదబ్బలోయి
రామ రావణ యుద్ధ మాయెను రావులకాడను
నాకు దాహా మవుతూవున్నదోయి పడాల రాముడా
దాహాముఅయితే రక్తము లేదా వెంగళరాయడా

1. జాగర్తాగా వుండమంటనూ' అని.
2. 'డేరామీదుగా' అని (చ) ప్రతి.
3. 'పూస పొడిచినాడు' అని. 'పూన పొడిచినా'డని (చ) ప్రతి.
4. 'డేరాగూలిన చందము రాజా' అని మూలము.
5. 'వాగైపోతేను' అని,

రక్తము మింగీ జగడము చెయ్యి దొర వెంగళరావు
ఉల్లితోటల గరువులమీదుగ వస్తున్నారేమి[1]
హైదరుజంగు ఫిరంగు లక్కడ ఫెళ ఫెళ మోగించె
ఆరువందల బలములు అక్కడ హారణమ్మోపోయె[2]
ఆరువందల బలములతోడ వస్తూవున్నాడు
హైదరుజంగు అనుపుదాటెను[3] వెంగళరాయుడు
లాలు కుమందాను బలములమీద కలపటమైనారు
అక్కడ అరాబులైన పరిపించాడు లాలు కుమందాను
భూమిమీదనే మందు పరచిగా యిసుక కప్పినారు[4]
పువ్వొత్తులను వెలిగించినారు సోలుదారు లేమి[5]
దాడుమీదను వస్తున్నది[6] ఆరువంద లోయి
అరాబు నడిమికి[7] రానిచ్చిరి ఆర్వందలబలము[8]
చుట్టూ పువ్వొత్తులు ముట్టించిరి సోలుదారులోయి
భగ భగ భగ భగ మంట మండెను భూమిపొడుగునేమి
రెండో అరాబుమీదికి దూకినవి కొన్ని బలములోయి
దానిని కూడను మట్టగించిరి సోలుదారులోయి[9]
రెండో అరాబుమీద మాడిపోయెను ఆర్వాందలబలము[8]
అరాబు పైటెక్కి యెంచీ యెన్నుపై ముళ్లు దాటెను వెంగళరాయడు
కెవ్వునాను[10] కేకేసి దాటెను పడాల రాముడు

---

1. 'వస్తూవున్న రేమి' అని. 2. 'హారణమయ్యిపోయె' అని.
3. 'అనువుదాటెను' అని (క) ప్రతి.
4. 'భూమిమీదనే యిసుకమందు పరిచిగా యిసుక గట్టినారు' అని.
5. 'పువ్వొత్తులూ యెలిగించీరీ సోలుజాదులేమీ' అని.
6. 'వస్తున్నాదీ' అని. 7. 'ఆరాజానడిమికి' అని.
8. 'ఆరొందల బలము' అని.
9. 'అవికూడను...సోలుదాదులోయి' అని. 10. కెవ్వునాను అని.

పడాల రాముడు వెంగళరాయడు యిద్దరు చిక్కిరి[1]
నాల్గువేలకూ[2] యిద్ద రున్నారు మాయన్నలారా
వెంగళరాయని యెడమపక్కనే యెనిమిది గాయాలు
గాయాలన్నీ అసిమిని బాయను(?)[3] వెంగళరాయనికి
అన్నయ్యగారిని చూడబోనుగా పడాల రాముడా
అదురు గుండెయు పిక్క బెదరును[4] వంశానే లేదు
ఈటెలు అలుగులు వెనుకకు తిప్పిరి వారు యిద్ద రేమి
ఈటెమడమను నోటి పోటునా గదుముక పోతారు
(గబ గబ) గదుముకొంటూ వారూ బొబ్బిలి కొస్తారు
హైదరుజంగు మేనల్లుడూ లాలుఖాను తాను
గుర్రాన్ని యెక్కి అడ్డం వచ్చెను లాలు సాహెబోయి
పోకు పోకు మరి వెంగళరాయడ పోకుమన్నా డేమి[5]
మడమ తిరిగి పొయ్యేది మీకూ మర్యాదే కాదు
మా పరాసువారి లగువులు చూడుమా దొర వెంగళరావు
అలసీ సొలసీ వున్నానోయీ లాలుఖాను నేను[6]
ప్రాణంతోడ పోనియ్యను దొర వెంగళరావు
(ఆ) మాటలకు మరి వెనుకకు తిరిగెను దొర వెంగళరావు
గుర్రంమీద సాదన చేసెను లాలుఖాను తాను
పేరు చెప్పి యా వెంగళరాయని నొసటిమీద[7] నరికె
ఎడమచేతనే గాయం పట్టెను దొర వెంగళరావు
రక్తధారలు కురువసాగెను భూమిమీద నేమి
పేటున వున్న[8] పడాల రాముడు యేమని పలికెను
కాసికోకతో గాయం కట్టు దొర వెంగళరావు

---

1. 'యిద్దరు చెక్కిరి' అని.
2. 'నాలుగేలకే' అని.
3. 'అదిమిబాయను' అని (క) ప్రతి.
4. 'పిక్కచెదురుగా' అని.
5. 'పోకుమన్న దేమి' అని.
6. 'లాలుఖాడ నేను' అని.
7. 'పేరు జెప్పిన వెంగళ్రాయని నొష్టమీద' అని.
8. 'పేటుగ నున్న' అని.

వెలమనీతియా గాయము కడితే యెంత వెలితిపద్దు
రక్తము గట్టిగ రుమాల నద్దు వెంగళరాయుడ
వాని రక్తమే[1] కండ్ల చూడక రక్తం తుడిచేనా
మా బొబ్బిలివారి లగువు చూడుమా లాలు సాహెబోయి
సాదనలూ పరవళ్లూ చేసెను దొర వెంగళరావు
లాలు ఖానుని గుర్రాన్ని పొడిచెను దొర వెంగళరావు
గుర్రం పడగా లాలుఖానుడు పారజూచినాడు
పోకు పోకుమా లాలుసాహెబా పోకు మన్నా డేమి[2]
మడమ తిరిగి పొయ్యేది నీకు మర్యాదే కాదు
డాలును వొడ్డీ[3] తప్పించుకో లాలుసాబు నీవు
నీచేతిలో నేను చస్తినా వో లాలుఖానుడ
*గోలకొండ మరి ఖిల్లాలోను నీకు వినుకలేమి[4]
నాచేతిలో నీవు చస్తివా వో లాలుఖానుడ*
ఢిల్లీ పాచ్ఛావుదాకానూ నాకు వినుకలేమి[5]
(ఆ)మాటలకు మరి గిరేల్ను మళ్లె లాలుసాహెబోయి
సాదనలు పరవళ్లు చేసెను దొర వెంగళరావు
పేరు చెప్పి యా. లాలుఖానుని పేగు వెళ్లో[6] బొడిచె
డొక్కలోను బాకేసి చక్కగా గిర గిర తిప్పెను
అల్లా అల్లంటూ లాలుఖాను అగడితలో వొరగ
సందట్లోనే తల కొట్టిరి పడాల రాముణ్ని
హరి నారాయణ నారాయణంటూ ధరణి కొరగెనుగా[7]
వెంగళరాయణి నొసటి రక్తమే[8] కాలువ కట్టింది
ఆరక్తము చూచి మూర్ఛపోయెను దొర వెంగళరావు

---

1. 'దాని రక్తమే' అని. 2. 'పోకుమన్న కేమి' అని.
3. 'డాలును వడ్డీ' అని. 4. 'యినకరేమి' అని.
5. 'యినకరేమి' అని. 6. 'పేరు జెప్పినాలాలుఖానునీ పేగులెల్ల' అని.
7. 'ధరణి వొరిగెనుగా' అని. 8. 'నొష్ఠిరక్తమే' అని.

మూర్ఛపోయిన వెంగళరాయని పట్టుకొన్నారేమి
పట్టి గట్టిగా తీసుకవచ్చిరి బూసిభేటి కేమి
ఇదుగోనయ్యా బొబ్బిలివారి వెంగళరాయుడు
రంగారాయుడి తమ్ముడ యేమి వెంగళరాయుడా
నీ చక్కదనము నే నెట్లా చూతును దొర వెంగళరావు
నీ రూపురేఖలు నే నెట్లా చూతును చక్కని దొరవార[1]
గాయా లన్నీ లెక్కపెట్టెను బూసీ దొరగారు
ఎదురుగాయమే వొక్కటి లేదు వెంగళరాయునికి
ప్రాణభయ మేమీ లేదయ్యా[2] వెంగళరాయుణికి
తమలపాకుతమ్మ వేసి బూసీ[3] గాయం కట్టించె
తగినవారి మరి యిండ్లల్లోను పెండ్లి చేతు ననెను[4]
అపు డెవ్వ రెవ్వరి బలములు వారు గణితి చూచుకొనిరి
రాజుగారిదే నాల్గువేలకు[5] మరణాలైనారు
లాలుఖాన్ మంది[6] రెండువేలకే మరణాలైనారు
ఫిరంగికాడ, ముసే పన్నది రెండువేలకు మరణాలైనారు
అడ్డపల్లి, మయ్యారముకాడ బూసిగారిది రెండువేల కొరగ
కొండబోటుకాడ పడాల రాముడు రెండువేలు చంపె
లాలుఖానుతో పన్నెండువేలు[7] మరణాలైనారు
గణితిచేసుకొని కళింగరాజు బూసిభేటి కొచ్చె
వెంగళరాయుణి కన్నుల చూచె విజేరామరాజు
పక్కలో వుండు పెంచుతా వేమి పరాసుల బూసి
మన దండులో పన్నెండవేలకు[8] కోసివేసినాడు

---

1. 'చక్కని దొరలార' అని.
2. 'ప్రాణభయములూ లేవూ' అని.
3. 'తమలపాకు తమ్మేసి బూసీ కట్టించి' అని.
4. 'పెండ్లిచేసుతాను' అని.
5. 'నాలుగేలకూ' అని.
6. 'లాలుకు మందీ' అని మూలము.
7. 'పన్నెండేలూ' అని.
8. 'మనదండ్లో పన్నెండేలకు' అని.

పరాసువారి శాస్త్రమందున పట్టుపడితేను[1]
బ్రతికించేదే కానీ మేము చంపేది లేదు
ఇన్నిమాటలూ వింటున్నాడు వెంగళరాయుడు
ఒకరిచేతిలో చచ్చేటందుకు కారణ మే మనేను
కాకున గుద్దుక ధరణి కొరగెను దొర వెంగళరావు
నారాయణ నారాయణ యంటూ ధరణి కొరగినాడు
గోవింద గోవింద యంటూ తా ప్రాణ మొదలినాడు
ఇన్ని కబురులూ తెలియవిన్నాడు[2] రంగారాయుడు
నా కుడిభుజంవంటి తమ్ముడే[3] కూలిపోయినాడా
మా వెంగళరాయుడు ధరణి కొరగితే యిక నే మున్నది[4]
పేరు వెళ్లిన వొంట ర్లంతా[5] పడిపోయిరి యేమి
కొలుకుల నీళ్లు రుమాల నద్ది రంగారాయుడు
ఏమీ తోచక కూర్చున్నాడు రంగారాయుడు
విరుగు తరుగులూ చెప్పేవారు వొకరూ లేరైరి
ఈవార్తలూ తెలియవిన్నది దేవి మల్లమ్మ
గోడు గోడునా దుఃఖపడుతుంది[6] దేవి మల్లమ్మ
అయ్యో, కంకణాల చేతుల నుంటివి[7] దొర వెంగళరావు
ఎంత వెలితి వ్రా తాయెను[8] నీకు చెల్లీ సుభద్రా
కొమారుడైన వెంకట కృష్ణుని చంకబెట్టుకొని[9]
కొమార్తైయైన సుందరమ్మను చేత బుచ్చుకొని[10]

---

1. 'పట్టూపడితేను' అని.
2. 'కబురులూ తెలియింన్నాడు' అని.
3. 'నాకుడిభుజమంటి దాయ తమ్ముడే' అని.
4. 'యిక నేమున్నాదీ' అని.
5. 'వంటర్లంతా', అని.
6. 'దుఃఖపడతది' అని.
7. 'కంకణాల చేతూల నుంటివీ' అని మూలము.
8. 'మొత్తిరాతాయెనె' అని.
9. 'చంకబెకోట్టునీ' అని.
10. 'చేతపుచ్చుకొని' అని.

మాయింటను యేల పుడితివి మా నాయన నీవు
పాపకారి మల్లమ్మకడుపున యెందుకు పుడితివి[1]
కోటలోపల అధృష్టవంతులు వకరూ లేక్పైరెరి
సరిపెణలు చొకట్లూ కొడుక్కు చేయిస్తి నేమి[2]
వెండిబిళ్లల పుస్తకాలుగా యెవ్వరు చదివేరు
ఆలాగునంటూ దుఃఖపడుతుంది[3] దేవి మల్లమ్మ
బొబ్బిలివారి యింటిదాసీలు మున్నయి ముగ్గురుగ
పెద్దదాసిని వెంకటలక్ష్మిని హుదుర్న పిలిపించి
మా సంస్థానము నిలుపంగదే[4] వెంకటలక్ష్మి
చామర్లకోటలోన నాకు చెల్లెలు జగ్గమ్మ
జగ్గమ్మవద్దకు యెత్తుకపోవే వెంకట్రాయణ్ని[5]
మేము బలిమి చావులు చస్తామని చెప్పబోకె నీవు
అమ్మా మీరు చావనా మేము బ్రతుకనా దేవీ మల్లమ్మ
మా వెంకట్రాయుడు బ్రతికితేనుగా నీవే బ్రతికేవు
అందాకా వెంకట్రాయణ్ని పోషింపుము నీవు
ఆ తరువాత మానాయన నిన్నే చక్కగ పోషించు
నులకతాడు మొలతాడు కట్టెను వెంకట్రాయణికి
వొళ్లెల్లను విభూతి పూసెను వెంకట్రాయణికి
చీరిక చీరికల గుడ్డ లేసెను వెంకట్రాయణికి
వెంకటలక్ష్మి చంకను పెట్టెను వెంకట్రాయణ్ని
నాయన పకీరువలెను బ్రతుకవయ్యా నను గన్న తండ్రీ[6]

1. 'పుడితీవీ' అని.
2. 'కొడుక్కు పెట్టడాయనేమి' అని (క) ప్రతి.
3. 'ఆలాగునంటూ దుఃఖపడతది' అని.
4. మాసమస్తానమూ నిలుపాగందే' అని మూలము.
5. 'యెత్తుకపోతే వెంకట్రాయుణ్ని' అని మూలము.
6. బ్రతుకావయ్యా నను గన్నా తండ్రీ' అని.

ఒడి కట్టీ వొడి నిండా దేవి వరాలు కట్టింది
ఈపదార్థానికి ఆసించకే వెంకటలక్ష్మి
†కోట్ల బైటికి బైలుదేరగా (వెంకటలక్ష్మి)
గుఱ్ఱాల నెక్కి చోపుదార్లు నీ కడ్డము వస్తారు†
నీ వొడిలో వున్న పదార్థ మంతా వెదచల్లు మనెను[1]
ఆపదార్థము యేరజూస్తారు[2] పరాసులైతేను
ఆసందట్లోనే జరిగి వెళ్లవే చామర్లకోటకు
దిడ్డిగుమ్మము(దాకా) సాగనంపెను వెంకట్రాయణ్ని
గుఱ్ఱాల నెక్కి చోపుదార్లుగా అడ్డం వచ్చిరిగ
ఒళ్లో వున్న పదార్థ మంతా వెదచల్లినదండీ[3]
ఆపదార్థమును యేరజొచ్చిరి పరాసు లప్పుడుగ
సందట్లోనే వెళ్లుతున్నది చామర్లకోటకు
జోడుగుఱ్ఱాలను యెగవేసిరి చోపుదార్లు వారు
చామర్లకోట, దారిలోపల వెంకట్రావును పట్టుకొన్నారేమి[4]
పట్టి గట్టిగా తీసుకవచ్చిరి బూసిఖేటి కేమి
మహాప్రభో, యిదుగోనయ్యా బొబ్బిలివారి చిన్నవాడుయేమి
రంగారాయణి కుమారుడంట వెంకట్రాయుడు
చేతులార మరి యెత్తుకొన్నాడు[5] బూసీదొరగారు
ఈ చక్కదనమును యెంతని చూతును వెంకట్రాయడా
చెక్కిళ్లు మరి నొక్కి తానుగా చేరి ముద్దులాడె
అంతలోనుగా కళింగరాజు బూసిఖేటి కొచ్చె
సలాము చేసీ కూర్చున్నాడు విజేరామరాజు

---

† వచనము.

1. ‘ యెదచల్లామనెనూ ’ అనీ.

2. ‘ ఆపదార్థమూ యేరచూస్తరూ ’ అని మూలము.

3. ‘ వొళ్లువున్నా ... వెదచల్లీనాదీ ’ అని.

4. ‘ పట్టుకున్నరేమి ’ అని.

5. ‘ యెత్తుకున్నాడే ’ అని మూలము.

ఎంత వెర్రి దొరలయ్యా మీారు పరాసుల బూసీ
ఈపులిపిల్లను వేలంలోకి యెందుకు తెచ్చారు
బిడ్డల గన్నా తండ్రివి కావా విజేరామరాజ
విజేరామరాజా (నీవు) నా యెదుట తెమ్మనెను[1]
దేవ దేవ నా మనవి వినుమంటాడు[2] విజేరామరాజు
బొబ్బిలివారి శూరత్వమ్ము కన్నుల చూచావా
బొబ్బిలివారి బల మంతాను చూపిస్తా చూడు
ఆవేళనే ఆయుధాలగా పండుగ వచ్చింది[3]
చురకత్తులూ బాకులు అన్నీ చదుర్న నిలిపిరి[4]
పైడి బిళ్లల పుస్తకాలుగా చదుర్న నిలిపిరి[4]
నిమ్మ పండ్లు మామిడి పండ్లుగా చదుర్న వుంచిరి[5]
అటుకులు బెల్లం పంచదారగా చదుర్న వుంచిరి[5]
బంగారంపు, పావురాలా సీమచిలుకలా చదుర్న వుంచిరి[5]
బంగారంపు కోడిపుంజులా చదుర్న వుంచిరి[5]
ఆచదురుమీాదనే వెంకట్రావును విడిచిపెట్టినారు
నిమ్మ పండ్లు మామిడి పండ్లుగా కండ్ల చూడడాయె
అటుకులు బెల్లం పంచదారగా కండ్ల చూడడాయె
వెండి చిలుకలా పైడి చిలుకలా యెడమకాల తన్నె
బాకులలోన వొకబాకైన చేత తీసుకొని[6]
రెండు చేతులా నిలబెట్టెను[7] వెంకట్రాయుడు
సెబాస్ రే![8] పులిపిల్ల పులిపిల్లే గానీ మేకపిల్లవునా

---

1. 'యెదటా తెమ్మనెనూ' అని.
2. 'దేవు దేవు నామనవినమంటాడు' అని.
3. 'పండు గొచ్చినాది' అని. 4. 'నిలిపీరీ' అని.
5. 'చదుర్న వుంచీరీ' అని. 6. 'వకబాకైనా చేత తీసుకొచ్చె' అని.
7. 'నిలబెట్టేనూ' అని.
8. 'షహీర్' అని. షబారే అని (క), (చ) ప్రతులు.

నేను, గోలకొండ మరాటిమీదికి పెంచుకొంటాను
తగినవారి యిండ్లల్లోను[1] పెండ్లి చేతునసెను
పేటున వున్న రాజుగారు తా నేమని పలికెను
అదుగో మహాప్రభో, నామీదనే కత్తి దూసెను వెంకట్రాయుడు
మదపుటేనుగమడమకిందనే మట్టించవలెను[2]
పాపకర్ముడవు వున్నా వేమీ విజేరామరాజ
ఏడు గడియలు రాజు నప్పుడు వోలుఖాన చేసే[3]
వెంకటలక్ష్మిచంకను పెట్టె వెంకట్రాయణ్ని
చాలినంత పదార్థ మిచ్చెను వెంకట్రాయణికి
చిన్నవాణ్నిగా బాగా పెంచి గోలకొండ కంపు[4]
ఎత్తుక నేను పోలే నన్నది[5] చామర్లకోటకు
సవారి గట్టిగ సాగించెను బూసీదొరగారు
వెంకట్రావూ వెంకటలక్ష్మీ సవా రెక్కినారు
పన్నెండుమంది బోయీ లప్పుడు సవా రెత్తినారు
చామర్లకోటకు పోతున్నాడు వెంకట్రాయుడు
అప్పు డేమని పలికినాడుగా బూసీదొరగారు
చిట్టలమారిరాజు నెప్పుడూ[6] ఋణము నమ్మరాదు
మూడువందల తురుపుగుర్రము వెంబడిచ్చి పంపె
చామర్లకోటను ప్రవేశించెను వెంకట్రాయుడు
తురుపుగుర్రము తిరిగీ వచ్చి[7] దండ్లో కలిసింది
ఇన్నివార్తలూ తెలియవిన్నది[8] దేవి మల్లమ్మ

---

1. 'తగినవారీ యిండ్లల్లోనూ...చేసుతాను' అని.
2. మదమటేనుగా మడిమికిందనే మట్టించావలెనూ' అని.
3. 'వోలుఖానాచేసే' అని.
4. 'గోలకండ కంపె' అని.
5. 'పోలే దన్నది' అని.
6. 'చిట్టెలమారీరాజు నప్పుడూ' అని మూలము.
7. 'తిరిగీ వచ్చి' అని.
8. తెలియింసాడి' అని.

నాయునా, పగవారిచేతిలో కొడుకా పట్టుపడ్డా వేమి[1]
పట్టుపడ్డచోటనూ[2] కొడుకా ప్రాణ మెట్లు వుండె
గోడు గోడునా దుఃఖపడ్డది దేవి మల్లమ్మ
పెద్దలనాటి తగటిపెట్టలే కిందికి దింపించి
శోభనాల మరి బావులకాడ స్నానం చేసింది
వెనుక సికలు దట్టంగా వేసిరి వెలమవారి స్త్రీలు
బంగారంపు నీ రోసిన కోకలు శృంగారించిరి[3]
బ్రాహ్మణవారి[4] అచ్చమ్మ నప్పుడు హుదుర్న పిలిపించి
గౌరిపూజలు చేసినారుగా బావివొడ్డునాను
వెండివి బంగారపువి చేటలు తెప్పించినాది
మూసివాయనా లిచ్చినదిగా దేవి మల్లమ్మ
తబుకులతోను రూపాయ లప్పుడు[5] దానా లిచ్చిరిగ
దాన మిస్తేను యెవరూ వొల్లరు ఆ బొబ్బిలిలోను
ఇవతల తీసుక అవతల యిస్తురు ఆబొబ్బిలిలోను
అవతల పుచ్చుక యివతల యిస్తురు ఆబొబ్బిలిలోను
గోపాలస్వామిగుడికాడి కొచ్చిరి వెలమవారి స్త్రీలు
గోపాలస్వామికి ప్రదక్షిణాలే వారు చేసినారు
కడసారవు దీప మంటూనే[6] దీపం పెట్టారు
కడసారవు నైవేద్య మంటూను[7] నైవేద్య మిచ్చిరి
కడసారవు దండ మంటూను దండం[8] పెట్టిరిగ
దేవుడి ముంగట యేమని పలికెను దేవి మల్లమ్మ

---

1. 'పట్టుపడ్డవేమి' అని.
2. 'పట్టుపడ్డచోటానూ' అని.
3. 'శృంగారించీరీ' అని.
4. 'బ్రహ్మణోరి' అని.
5. 'రూపాయిూలూ' అని. 'రూపాయ లప్పుడు' అని (క) ప్రతి.
6. 'కడసారపా దీపమంటనే' అని.
7. 'కడసారపా నైవేద్య మంటనూ' అని.
8. 'కడసార్రపా దంణ మంటను దణ్ణం' అని.

రాజా వోరాజా నీవు విజేరామరాజా
మమ్ముల చంపి ఎన్నాళ్లు బ్రతికేవు పూసపాటి రాజ
నా బొబ్బిలి పోయిన మూడోనాడు రాజుకు మరణాలు
వీరపతివ్రత మల్లమ్మదేవి శాపమ్మే తగులు[1]
దేవుని ముంగట శాపం పెట్టి గిరేల్న మళ్లింది
ఆగవన్లోకి[2] మరి అడ్డం వచ్చెను తండ్రి రామయ్య
నోట్లో మాట నోట్లో వుండగ శాకున గుద్దుకొనె
నారాయణ నారాయణ యంటూ ధరణి కొరగినాడు
గోవిందా గోవింద యంటూ ప్రాణం వదలాడు[3]
పెనిమిటిగారి కచ్చేరి కొచ్చె దేవి మల్లమ్మ
వెనుకా ముందూ చూడక తాను కచ్చే రెక్కినది[4]
కచ్చేరిలోను కూర్చున్నారు వెలమదొరలు వారు[5]
కచ్చేరిలోను వున్నాడేమి అల్లుడు నరసయ్య
అసరసనే కూర్చున్నాడు రంగారాయుడు
వెలమదొరలు కారటయ్యా మీారు వెలమదొరల్లార
మాతిని మీాసం లేదా మీాకు వెలమదొరల్లార
పరాసుకూడు తినిపిస్తారా ఆడువారి కెల్ల
కొయ్యామని గొంతుకు[6] చాపెను దేవి మల్లమ్మ
కాళ్లూ చేతులూ ఆడవాయెను రంగారాయుడికి
పడమటిసీమ వెలమలు విన్నా పరువు దక్కబోదు
నేను బొబ్బిలికి వచ్చి[7] ముగ్గురు బిడ్డల తల్లిని అయినాను
ఎన్నడైన నీకు మొగ మిచ్చి నే మాటలాడినానా

---

1. 'నాశాపం తగులు' అని మూలము.
2. 'ఆగవింట్లోకి' అని మూలము.
3. 'ప్రాణ మొదిలినాడు' అని.
4. 'కచేరెక్కనాది' అని.
5. 'కచేరిమీాద...దొరలు తమరు' అని.
6. 'కొయ్యమాని గొంతూకు' అని.
7. 'బొబ్బిలి కొచ్చి' అని.

ఇనాళ్లకు మాట్లాడించెను విజేరామరాజు
కొయ్యమని గొంతుకు[1] చాపెను దేవి మల్లమ్మ
కచేరిమీద దిగ్గున లేచెను రంగారాయడు
మొలలో వున్న పచ్చలబాకును ఝరేల్న వొర దీసె
కాళ్లకు వేళ్లకు చుట్టుకొన్నది కొమార్తె సుందరమ్మ
అమ్మా అత్తవారి యింటిలో వుంటేను బ్రతుకుదు వన్నాడు
నేను చినబాబుపెండ్లికి వస్తిని బాబు రంగరావు
తలిదండ్రాదుల చావులు నేను చూడ వచ్చినాను
ఈ మాటలకు బహు తామసమొచ్చె అల్లుడు నరసయ్య
భార్యను మరి సుందరమ్మనే బాకున పడగుమ్మె
డొక్కలో బాకు వేసినాడుగా[2] గిరగిర తిప్పెనుగ
అయ్యో బాబు బా బంటూను తా ప్రాణం వదలింది[3]
రాజదివాణము వెళ్లినాడుగా రంగారాయుడు
తల్లిగారిని వెంగళమ్మనే కన్నుల చూచెను
నా చేతిలో నీకు మరణం (వ్రాసె) తల్లి వెంగళమ్మ
అందరికిన్ని వొక్క చావుగా వ్రాసినాడు బ్రహ్మ
నారాయణ నారాయ ణంటూనె ప్రాణం వదిలింది[3]
ముత్తవతల్లి నారాయణమ్మను గొంతుక కోసెను
పెత్తల్లి రాజమ్మగారినే గొంతుక కోసెను
ఏడుగురి మేనత్తలబట్టి[4] గొంతులు తెగకోసె
ధగ ధగ మెరసే కత్తులు చూచిరి కొంద రాడువారు
వొకరి చాటుకే వొకరు వెళ్లిరి మాయన్నలారా
వొకరిమీదనే వొకరిని వేసీ వరుస గొంతు కోసె

---

1. 'కొయ్యమాని గొంతూకు సాపెనూ' అని మూలము.
2. 'బాకేసినాడుగా' అని మూలము.
3. 'ప్రాణమొదిలినాది' అని మూలము.
4. 'ఏడుగూరి మేనత్తలు పట్టి' అని.

పెద్దకూతురు రమణమ్మను గొంతుక కోసెనుగ
అచ్చమ్మ బుచ్చమ్మగారినీ బాలమ్మను పొడిచె
సమర్థచాపమీది స్త్రీలనే తుపాకి నేసెగద
గర్భిణితోను వున్నస్త్రీలను తా మెడలు నరికెను[1]
కడుపులోని పిండాలు వూడీ ధరణిని పడినవి[2]
పాలు తాగే పసిబిడ్డలబట్టి తెగేసి నరికెనుగ
అంతకన్న నెత్తురు ముద్దల గోడల గొట్టాడు
చదువుకొనే బాలలబట్టి బాకున పడగుమ్మె
అటకలు యెక్కిన చిన్నవాండ్లనే బల్లేల పొడిచెను
భార్యను మల్లమ్మదేవినే గొంతుక పడగోసె
నారాయణ నారాయణ యంటూ ధరణి కొరగెనామె[3]
వేలాలన్నీ వెతుక్కరారా సేవక వీరేశా
అయ్యా, దీపం పెట్టే దిక్కు లేదుగా దివాణములోను
అంటరాదుగా ముట్టరాదుగా మరదలు సుభద్ర
నీ చెయి ముట్టి యేలాగు చంపుదు సుభద్రాదేవీ
చేతిలో బాకు సెలవివ్వండి వెలమదొరల్లార
బాకు తీసిగా తెరచాటునా రాయు డేసినాడు
ఆబాకున గుద్దుక ధరణి కొరగెను సుభద్రాదేవి
నారాయణ నారాయణ యంటూ ధరణి కొరగినది[4]
బొబ్బిలివారి యింటి దాసీలు ముప్ఫయియిద్దరుగ
మాపనినీ యేమి చేస్తావు[5] బాబుదేవు నేడు
చాలినంత పదార్థము కట్టుక (మీా రందరు యేమి)

---

1. 'వున్నలస్త్రీనూ. మొన్ను నరికేను' అని. 'దామెన్ను .నరికేను' అని (క), (చ) ప్రతులు.

2. 'ధరణ్ని పడగానూ' అని మూలము.

3. 'ధరణి కొరిగినాది' అని. 4. 'ధరణి కొరిగినాది' అని,

5. 'మాపనుల్లూ యేమి చేస్తవూ' అని,

బైటికి వెళ్లి బ్రతుకుమన్నాడు (రంగారాయుడు)[1]
పడమటికి వెళ్లి పరాసుకూడు మేము తినగలేము
మేము మల్లమ్మదేవి చచ్చిన దిక్కున చస్తా మన్నారు
కొయ్యలేకనే విసిగినాడుగా రంగారాయడు
పడాలవారి పన్నెం డిండ్లూ బాగుచేసినారు
పన్నెండు పూరిండ్ల నిండా మందు పరచినారు
పడాలవారి ఆడువారినే ముందుగ చొరదోలె
ఆవెనుకాను దాసీలనూ పడదోలిరి యేమి
తలుపులు తాళాలు వేసినాడుగా చెలికాని వెంకయ్య[2]
జానకితాడూ ముట్టించెను[3] పడాల వీరయ్య
కోటపొడుగునా మంటలు మండె కోటలోను గోల
భూమిపొడుగునా మంటలు మండె భగభగ మంటలుగ
ఆమంటలలోపల మాడిపోయిరి ఆడువారు యేమి
గుఱ్ఱాల చావళ్లూ పట్టీ చిచ్చు పెట్టినారు
కచ్చేరిచావళ్లు గట్టిగ చిచ్చు పెట్టినారు
లక్షుల(?)యింటి దివాణము గట్టిగ తగులబెట్టినారు
బొబ్బిలిలోపల మంటలు చూచెను మూసా బూసి యేమి
ఆబొబ్బిలిలోపల మంటలు యేమి విజేరామరాజ
మంటలు కావు మతాబులయ్యా బూసీదొరగారు
మీరు వచ్చినా గడనున్నదా రంగారాయణికి
బొబ్బిలిలోపల పెండ్లిండ్లయితే చేయిస్తున్నాడు
అవాయిచువ్వలు బాణ సంచా కాలుస్తున్నారు
మర్మమెరుగని బూసిగారుగా మూరు మూరు మనెను
ఫెళ ఫెళ ఫెళ మోగించిరీ ఫిరంగీల బారు

---

1. 'చాలినంత పదార్థము గట్టుక బైటికెళ్లి మీరు బ్రతుకుమన్నడూ' అని.
2. 'చెలికావెంకయ్య' అని. 3. 'జానక...ముట్టిగించెనూ' అని.

కోటలోపల సూరయ్యగారి దివాణం విరిగింది[1]
రాజదివాణములో దూకినవిగ ఫిరంగీల బారు
వెంగళరాయణి చంద్రశాలలో గుండ్లు దూకినవి[2]
అప్పుడు బొబ్బిలివారి పదార్థమంతా బావికి తోలించె
బావులు గట్టిగ పూడ్పించెను రంగారాయడు
బావులకాడ సీమబాతుల నూటికి తెగగోసె
*కోటలోపల కంచిమేకల నూటికి తెగగోసె*
కోటగవనిలో,పలుకులు పలికే రామచిలుకలా గొంతులు కోసెను
వడసారము, నాల్గువందల సిబ్బందితోను రాయడు వున్నాడు
అన్నలారా మాయన్నలార రాణువవాళ్లలార
మీరు, పెండ్లాల బిడ్డలమీదను ప్రేమలు గలవారు
తల్లీదండ్రాదులమీదనూ దయలు వున్నవారు
బిడ్డల తీసుక బిరేల్ను బొబ్బిలి బైలుధేరి[3] పొండి
మహాప్రభో, మీ వుప్పూ పులుసూ చాలా తిని వూరికె వెడు
నీతో మేము చచ్చేవారము రంగారాయడా [తామా
ఎవ రెవరీ యిండ్లకును వారూ పరుగులెత్తినారు
పెండ్లాలా బిడ్డలబట్టీ గొంతులు కోసిరిగ
అరవంగానే గొంతులు కోసిరి ఆడువారి నెల్ల
పాలుతాగే పసిబిడ్డల బట్టి యెగేసి నరికారు
అంతకన్న నెత్తురు ముద్దలా గోడను కొట్టారు
రక్తపుబట్టలతోను రాయని యెదుటను నిలిచారు[4]
మాకు, కాళ్ల సంకెళ్లు వదలెనయ్యా రంగారాయడా
అప్పుడు, లాగు తొడిగెను కాసె పోసెను రంగారాయడు
మురుగులు పోగులు సరిపెణ గొలుసులు బంగరు కడియాలు

---

1. 'దివాణ మిరిగింది' అని.
2. 'గుండ్లు దూకినావి' అని మూలము. 3. 'బైలుదెర్లి' అని.
4. 'రక్తపుబట్టలా తోటట్టూగా రాయుడెదట నిలిచె' అని.

పెద్దలనాటి కిరీట మప్పుడు శిరసున ధరియించె
ఈ నాల్గువందల[1] యీటె పౌంజుగా నడుములు కట్టారు
కోటగవనిలో గోవింద పెట్టి కోట బైలుదేరి[2]
లాలుకుమందను బలములమీద కలపటమైనారు
గోవింద భజ గోవిం దంటూ యీటె లొంచినారు
వంచిన యీటెలు యెత్తక పొడిచిరి వెలమలు తెలగాలు
భాళీ భా ళంటూ వారుగా బాకుల పడగుమ్మి
గొల్లపల్లి కోనేటిదాకనే దూరి పొడిచినారు
కోసి గుట్టలు వేసినారయా రావులకాడనుగ
నూటికి పొడిచి సెల గంటాడు రంగారాయుడు
నూటికి పొడిచి సెల గంటాడు చెలికాని వెంకయ్య[3]
రంగారాయణి మేనల్లుడూ చెలికాని వెంకయ్య[3]
నూటికి పొడిచి సెల గంటాడు పడాల వీరయ్య
నూటికి పొడిచి సెల గంటాడు బత్తుల వీరన్న
నూటికి పొడిచి సెల గంటాడు కిమిటి జోగి[4] తాను
నూటికి పొడిచి సెల గంటాడు భూపతిరాయుడు
నూటికి పొడిచి సెల గంటాడు బండి జగ్గు తాను
నూటికి పొడిచి సెల గంటాడు ముకుందనాయకుడు
ఆరునూర్లకు[5] దూకి పొడిచెను ఆవు సెట్టెన్న
రచ్చపల్లి మరి రావులదాకా తరిమి పొడిచినారు
పీనుగు పడితే పీనుగు మీద తొక్కి నరికినారు
మోకాటిలోతున 'రక్తకాల్వలే' పారుతూవున్నవి[6]

---

1. 'యీనాలుగొందలా' అని.
2. 'బైలుదెర్లి' అని.
3. 'చెలికానెంకయ్య' అని.
4. 'కిమటిజోగి' అని మూలము. 'కిమట జోగి' అని (క), (చ) ప్రతులు.
5. 'ఆరునూటికీ' అని.
6. 'పారుతువున్నా వి' అని.

కొండబోటుదాకాను వారూ తరిమి పొడిచినారు[1]
*కొండవంచను అనుపు వున్నదీ చెకుముకి బా రేమి
ఆరువేలకే చెకుముకి బారూ అనుపు లేపినారు*
ఈనాల్గువందల బహుబలములే[2] ఫెల్లున కూలేను
రంగారాయుడి మోకాటిలో తుపాకి దె బ్బన్న
జోడుగుండ్ల బారూ తగిలెను రంగారాయణికి
మోకా లొంచుక కూర్చున్నాడు రావు రంగరావు
మోకా లొంచుక పొడిచినాడయా ముప్ఫయి ముగ్గురిని
ఇన్ని కబురులూ తెలియవిన్నాడు[3] బూసీ దొరగారు
ప్రాణముతోను రంగారావును పట్టుక ర మ్మనెను
ఎప్పటివలెనే వారికి దేశం మొఖాస యిస్తాను
తగినవారి యిండ్లలోను పెండ్లిచేసుతాను
మూడువందల చువ్వాయీలెల బలము వచ్చినది[4]
దొరకు దొరకుమా రంగారాయడ దొరకు మన్నారు[5]
బూసిగారుగా మిమ్మునుఅయితే మెచ్చుకొన్నారేమి[6]
ఎప్పటివలె మీ దేశం మీకు మొఖాస యిస్తారు
మీకు తగినవారి[7] యిండ్లలోను పెండ్లి చేసుతారు
పాసిన కూట్లో కలి పోసితే[8] పదునుకు వస్తుందా
నా ప్రాణముతోటి దొరకుతానా రాణువవాళ్లలార
మూడువందల చువ్వాయీలెగా అగుల్లోకి(?) తెగ నరికి
తన పొడుగునా గుట్టవేసుకొనెను (రంగారాయడు)
ప్రాణముతోటి దొరక డంటూను[9] తిరిగివెళ్లినారు

---

1. 'అనుపువేసినారు' అని మూలము. 'తరిమి పొడిచినారు' అని (క), (చ) ప్రతులు.
2. 'నాలుగొందలా బాహు' అని.
3. 'తెలియిన్నాడు' అని.
4. 'వచ్చినాది' అని.
5. 'దొరకూ మన్నారు' అని.
6. 'మెచ్చుకొన్నరేమి' అని.
7. 'మీకూ తగినావారీ' అని.
8. 'కలి పోసీతే' అని.
9. 'దొరకడంటనూ' అని.

మహాప్రభో, ప్రాణముతోను దొరకడయ్యా[1] రంగారాయుడు
వెనుకాలను తురుపుగుర్రమే పంపించెను బూసి
రంగారాయణి కుడిభుజమైతే తెగనరికివేసెను[2]
ఒకరి చేతిలో చచ్చేటందుకు కారణమేమనెను
ఎడమచేతనే బాకు తీసుకొని గుద్దుక వొరగెను
నారాయణ నారాయణ యంటూ ప్రాణం వదలిలాడు[3]
కోడి కూసి తెలవారేసరికి[4] కోట తీసినారు
పడ్డటువంటి రంగారాయుని యెత్తుకెళ్లినారు
బూసిగారి డేరాలకాడనే దింపిరి రాయణ్ణి
రంగరావునే కన్నుల చూచెను బూసీ దొరగారు
నీ చక్కదనము యెక్కడ చూతును రంగారాయడా
ఈ పాపం పుణ్యము యెవ్వరి దోయి దుబాసి లక్ష్మడా
ఈ పాప మంతాను రాజుదె కానీ మనది కాదయ్యా
ఈ పాపం పుణ్యము యెవ్వరిదోయి వో హైదరుజంగు
పాప మంతను రాజుది కానీ మనది కాదయ్యా
అంతలోను మరి కళింగరాజు కచేరికి వచ్చెను[5]
ఈ పాపం పుణ్యం యెవ్వరి దోయి విజేరామరాజా
ఈ పాపం పుణ్యం మన దన్నాడు విజేరామరాజు
ఉమ్మడిమాట ఆడితి వంటూను[6] బాకు తీసె బూసి
పాపం పుణ్యం నా దన్నాడు విజేరామరాజు
ఈబొబ్బిలి వారి పాపం[7] రాజా తప్పక తగిలేను
స్త్రీహాత్యా శిశుహాత్యా రాజా తప్పక తగిలేను
అంతలోను మరి కళింగరాజు యేమని పలికెను

---

1. 'దొరకాడయ్యా' అని.
2. 'తెగనరికేసెను' అని.
3. 'ప్రాణమొదిలినాడు' అని.
4. 'తెల్లారేవరకూ' అని.
5. 'కచేరి కొచ్చెనూ' అని.
6. 'ఆడితివంటను' అని.
7. 'పాపం' అనుటకు బదులు 'ఉసురైతే' అనుట సముచితము.

బొబ్బిలిలో వింతలు చూచి వస్తాము[1] వస్తావా బూసీ
†హైదరుజంగూ లక్షుమన్నగా రాజుగారుగా
మరి బూసిగారుగా ముసే పన్న అయిదుగురూ
మరి కోటలోపలకు చూడవచ్చినారు†
కోటలోపల, పీనుగలమీద పసిబాలురూ పాలు తాగుతారు
గోడు గోడున దుఃఖించాడు బూసీ దొరగారు
ఈపాపం పుణ్యం యెవ్వరి దోయి విజేరామరాజ
ఈ పాప మంతను నాదే కాని మీది కా దయ్యా
స్త్రీహత్యా శిశుహత్యా రాజా తప్పక తగులును
ఆ ముసే పన్నకు యేడు గడియలు దోపు యిచ్చినారు
ఆపైని మరి లగ్గల కెక్కిరి కోటపైకి వారు
చెరువు(?)కుండ తప్పాళా లన్నీ చేరదోలినారు[2]
వెండిన్నీ బంగార మంతా చేరదోలినారు[3]
విలువ తీరని కోకలు గట్టిగ వాంటెల గట్టిరి
వరహాలు రూపాయలు అన్నీ చేరదోలినారు[3]
విలువయైన కత్తులను దోచిరి[4] ఆ బొబ్బిలిలోను
ఎవ రెవరి డేరాలకు వారూ చేరదోలుకొనిరి
బొబ్బిలి తీసిన సంతోషాన పూసపాటిరాజు
తన యేడు డేరాల నడుమనే విజేరామరాజు
ఎర్ర పట్టు డేరా యెత్తించెను కళింగ పెదరాజు
పందిరిమంచంమీద రాజుకే మల్లెల పానుపు
మల్లెల పానుపుమీదను రాజు నిమ్మళించినాడు
బొబ్బిలి పోయిన మూడో నాడు తాండ్ర పాపయ్య

---

1. 'బొబ్బిలిలోనూ వింతవింతలూ చూచివస్తమూ' అని మూలము.
† వచనము.
2. 'శెరువుకుండతప్యాళాలన్నీ చారదోలినారు' అని.
3. 'చారదోలినారు' అని, 4. 'ఇలవలేని కత్తూలు దోసిరి' అని.

చాపు కబురు మరి జగడము కబురు చాలా విన్నాడు
ఇరువైయముగ్గురు వెలమదొరలుగా పొడుచుక చచ్చిరి
ఏభైయముగ్గురు సిపాయిలయినా విడిలో చచ్చిరి
మొలలో వున్న బాకు తీసెను తాండ్ర పాపయ్య
రంగరాయణి పెద్దసేవకుడు మిర్యాల సీతన్న
ఆగవయ్యా క్షణ మాగవయ్యా తాండ్ర పాపయ్యా
ఇక్కడ చస్తే వూ రేమయ్యా[1] పే రే మన్నాడు
మన రంగారాయడు చచ్చిన దిక్కున పొడుచుక చస్తాము
దగ్గర వున్న సిబ్బందివారికి సెలవు లివ్వ మనెను
ఆరువందల సిబ్బందితోను పాప య్యున్నాడు
అందులో నాయకుల సరదార్లను హుదుర్న పిలిపించి
వింనారటోయి సరదార్లు మీరు వివరముగా నేడు
మీరు పెండ్లాల బిడ్డలమీదను[2] ప్రేమలు గలవారు
తల్లీదండ్రాదులమీదా దయలు వున్నవారు
ఎవ్వ రెవ్వరి జీతాలు వారు[3] లెక్కలు చూచుకొని
మీ యిండ్లకు మీరు వెళ్లండీ మాయన్నలారా
మహాప్రభో మీరు చావను మేము బ్రతుకనా పాపారాయడా
మేము కాశీ పైనము వెళ్లెద మన్నాడు[4] తాండ్ర పాపయ్య
కావిదోవతులు కమండలాలు ధరియించిరి వారు[5]
లక్ష్మిదేవిగుర్రాన్ని యెక్కెను తాండ్ర పాపయ్య
గరిణేల గుర్రాన్ని యెక్కెను మిర్యాల సీతన్న
తెల్లంగా తెల్లారేదాకా తియ్యక నడిచిరి
తెల్లంగా తెల్లార గట్టకు బొబ్బిలికి వచ్చిరి[6]

---

1. 'ఇక్కడ చస్తే పో రేమయ్యా' అని.
2. 'పెండ్లాలబిడ్డాలమీదనూ' అని. 3. 'మీరు' అని.
4. 'కాశీపైనమువెళ్లుతమన్నడు' అని. 5. 'ధరియించినారు' అని.
6. 'బొబ్బిలి కొచ్చిరీ' అని.

బొబ్బిలివారి చెరువులమీద గుఱ్ఱాలు దిగినారు
ఎంత వెఱ్ఱి చావులు చస్తివి దేవీ మల్లమ్మ
నేను, రాజారపు కోటలో వున్నది యెరక్కపోయితివా[1]
కాకిచేతనే కబురు పంపితే నేనే వచ్చేను[2]
మూడు సేర్లుగా బియ్యము తేరా మిర్యాల సీతన్న
అంగడికి వెళ్లి[3] బియ్యం తెచ్చెను మిర్యాల సీతన్న
స్నానం చేసీ పొంగించెను మిర్యాల సీతన్న
బొబ్బిలివారి పేరు చెప్పి మరి పిండా లేసిరిగ
పేరు పేరున పిండ ప్రదానము చాల చేసినారు
కడసారము అన్నం[4] పెట్టర మిర్యాల సీతన్న
అన్నం లేదూ హారం లేదూ తాండ్ర పాపయ్య
అటుకులు బెల్లం పంచదారగా అతను తెచ్చినాడు
తొలికబళమ్ము[5] యెత్తినాడుగా తాండ్ర పాపయ్య
మరుకబళమ్ము[6] చేదువేసెను పాపారాయణికి
చే దనగనే జలములో[7] కలిపెను మిర్యాల సీతన్న
ఎక్కి వచ్చిన వెల్ల గుఱ్ఱాల కొంకులు నరికిరి
ఆ బాకున గట్టిగ గుద్దుకోబోయె పాపారాయుడు
చేతిలో బాకు నిలువబట్టెను మిర్యాల సీతన్న
ఆగవయ్యా క్షణ మాగవయ్యా తాండ్ర పాపయ్యా
రాజును చంపిన మరుసటినాడుగ పొడుచుక చస్తేను
ఆలాగైతే బొబ్బిలి కోటకు పేరే వుంటుంది
ఆమాటలకు బహుసంతోషించెను తాండ్ర పాపయ్య
కటారిమొనను వ్రాసినారయా కల్లజాబు లేమి
ఆనందరావూ చందారయ్యా పేరు పెట్టినారు

---

1. 'యెరక్కపోయినావా' అని. 2. 'వస్తాను' అని.
3. 'అంగడి కెళ్లి' అని. 4. 'కడసారపు అన్నం' అని.
5. 'తొలికబళాము' అని మూలము. 6. 'మరికబళాము' అని.
7. 'జలధిలో' అని.

అసురసంధ్యవేళ బైలుదేరిరి వేలాలవెంబడిగ[1]
వస్తేను మరి లేస్తూనున్నారు[2] రాజుగారి బలము
మేము రాజుగారికి జాబులు తెస్తిమి మాయన్నలార
విజేనగరమునుంచీ వస్తిమి మేము యిద్దరము
ఆనందరాజు జాబు లంపెను బాబుదేవు కేమి
ఆనందరాజు జాబు లనగనే పారా విడిచిరిగా
ఈకల్లజాబుల కాకితాలుగ మాయచేసినారు[3]
గుజలీవేళను[4] కొలువు తీరెను కళింగమహారాజు
వస్తూనే, దండం పెట్టి నిలబడ్డాడు మిర్యాల సీతన్న
ఎవ్వరితాలూ కంటూ రాజు అడుగుతువున్నాడు
మాది జగపద్దేవుతాలూకండీ కళింగ పెదరాజ
అక్కడ అన్నం లేక మీ కొలువుకు మేము వచ్చినాము
తెల్లవారితే తగిన జీతము చేయిస్తా ననెను
మనిషికి, శేరు బియ్యమూ డబ్బుచొప్పున బత్తెము యిప్పించి
భోంచేసి మా డేరాకాడ నిమ్మళించ మనెను
భోంచేసిగా మళ్లీ వస్తమా మిర్యాల సీతన్న
ఒకదినానికి వొకరి సొమ్ము మన కెందుల కన్నాడు[5]
శేరు బియ్యము డబ్బుచీటులూ ఫకీర్ల కిచ్చిరి
డేరాకాడా పండుకొన్నారు[6] వారు యిద్దరేమి
రాజుగారి మరి సేవకులయితే యేమైముగ్గురుగ
ఆరోజున యేమైయిద్దరు నేరం చేసిరి
వీమైయిద్దరు ఖాసావారిని పారావేయించె[7]

---

1. 'అసరసంధ్యాలా బైలుదెల్లిరీ యాలాలంబడిగా' అని.
2. 'వస్తేను మరి లేస్త మన్నరూ' అని.
3. 'మాయజేసేరూ' అని.
4. 'గుజరీవేళను' అని.
5. 'మనకెందూ కన్నాడు' అని.
6. 'పండుకొన్నరూ' అని.
7. 'పారావేయించి' అని.

పెద్దసేవకుడు వొక డున్నాడు చల్లా రాముడు[1]
కాళ్లు గుద్దుతూవున్నా డయ్యా రాజుకారి కేమి
ఆవ లీవలా సెమ్మేలైతే వెలుగుతూవున్నవి[2]
త్రుల్లిపడి తా లేచినాడుగా మిర్యాల సీతన్న
నీ నిద్రల్లా నీ రై పోనూ తాండ్ర పాపయ్యా
తెల్లంగా తెలవారిపోయెను పాపారావ్వారు
తెల్లవారితే చోపుదార్లుగా డేరా కొస్తారు
అదరిపడి దిగ్గున లేచెను తాండ్ర పాపయ్య
నేను చచ్చినాను బ్రతికినా కానీ దేవిడిగుం డొస్తా[3]
డేరాతాళ్లూ తెగగోసెనూ మిర్యాల సీతన్న
గోడబారుగా జొరబడ్డాడు డేరాలోపలికి
కాళ్లు గుద్దే చల్లా రాముడు కలపటమైనాడు
ఈటె తీసుకొని కలపటమూయె చల్లా రాముడు
బాకున గుద్దీ పండబెట్టెను చల్లా రాముణ్ని
నిద్రపోతూ మరి వున్నాడయ్య విజేరామరాజు
దేవిడిగుండా తిరిగి వచ్చెను తాండ్ర పాపయ్య
దేవిడికాడా పారాసిపాయి పారా యిస్తుండె
హెచ్చరికంటూ, బాకున గుద్దీ పండబెట్టెను పారావాణ్ణేమి
డేరాలోపల జొరబడ్డాడు తాండ్ర పాపయ్య
పులి పులి వచ్చె లే లే వయ్యా పూసపాటి రాజా
నిద్రలోపలా యే మన్నాడు విజేరామరాజు
పులైతేను పొడువ మన్నాడు చల్లా రాముణ్ని
నీ ప్రాణానికి నేనూ పులిని తాండ్ర పాపయను

---

1. 'వక్కొడున్నడూ చల్లారామూడూ' అని.

2. 'యెలుగుతయున్నావి' అని.

3. 'దేవిడినుండొస్తా' అని. 'దేవిడిగొండొస్తా' అని (చ) ప్రతి; 'పేరుండ ఖలెను' అని (క) ప్రతి.

తాండ్ర పాప య్యనగా రాజు తందరగొన్నాడు
పక్కలోను బా కుంచుక రాజు తడుములాడుతాడు
సాగు యేదిరా బల్లె మేదిరా చల్లా రాముడా
సాగు యెందుకు బల్లె యెందుకు బాకు తెచ్చినాను
బొబ్బిలికోటా విజేనగరమూ కావటికుండలుగ
కావటికుండలు బోర్లదోస్తివా విజేరామరాజ
తెల్లవారితే బొబ్బిలికి బూసి పట్టం కడుతాడా
మా రంగారాయడు మించిపోయెను పదవయ్యా రాజ
నిన్ను తీసుకొని కూడారమ్మని నన్ను పంపినాడు
డొక్కలోను బా కేసి రాజును గిరగిర తిప్పెను
దొంగపోటున పొడిస్తివయ్యా తాండ్ర పాపయ్యా
దొంగపోటు కా దయ్యా యిది బొబ్బిలిపో టనెను
మాట్లాడే విజేరామరాజును[1] నోట్లో కుమ్మెను
డొక్క బద్దలుగ చీరినాడుగా రాజుగారి నేమి
ఆఫేగులు తీసి జందెము వేసెను రాజుగారి కేమి
రక్తం తీసి గంధం పూసెను రాజుగారి కేమి
ఇది వీరగంధమ్మయ్యా విజేరామరాజ
ఇవే వీరజందెములయ్యా విజేరామరాజ
†బొబ్బిలి పులీ వచ్చేనంటూ[2] బూసిగారిదం
డంతా అప్పుడు గల్లంతయినది†
*కోటమీద మరి ఫిరంగులుగా దండుమీద తిప్పి*
తూరుపు పడమర తెలియక వారేద్లు ఫెళ ఫెళ మోగించిరి
వాండ్లలోనే వాం డ్లంతా నరకులాడినారు
వాండ్లలోనే వాండ్లు చచ్చిరి నాల్గువేల[3] కేమి

---

1. ‘మాట్లాడే వోరామరాజరాజునూ నోట్లో కుమ్మేను’ అని /మూలము.

† వచనము.

2. ‘బొబ్బిలిపూలీ వచ్చేనంటగ...గల్లంతైనాది’ అని. 3. ‘నాలుగేల’ అని.

మనము, బూసిగారి దండ్లోకి పోదమా మిర్యాల సీతన్న
ఇంత రాజును చంపీ మనకు యింకేటి[1] బ్రతుకు
నవలతు, కళింగ మేలే కళింగరాజు ధరణి కోరగినాడు
పారిపోతే మరి దాం గంటాడు పరాసుల బూసీ
రాజుమీాదనే[2] పొడుచుక చచ్చెను తాండ్ర పాపయ్య
ద్వారంలోనే పొడుచుక చచ్చెను మిర్యాల సీతన్న
తెల్లవారెను ప్రొద్దు పొడిచెను బూసీ వచ్చెను
బొబ్బిలివారి ఉసురూ[3] రాజుకు తప్పక తగిలింది
స్త్రీహత్యా, శిశుహత్యా (పాపం) రాజుకు తప్పక తగిలింది
చచ్చివున్న పాపయ్యను చూచి తందరగొన్నాడు
తట్టుకు జానెడు చేసెడు మీాసం తాండ్ర పాపయ్యాది[4]
వంచినను[5] మరి వంగకున్నది మీాసం పుష్టేమి
దూకి వచ్చి పొడువవచ్చినట్టుగ పాప య్యున్నాడు
అయిదుగురు విడిపించిన గానీ[6] బాకే రా దేమి
తందరపోయి డేరాకు వెళ్లెను[7] బూసీ దొరగారు
బొబ్బిలి పైకం కళింగపైకము పూర్తిగ మునిగెను[8]
తాండ్ర పాపయ్యవంటి బంటులు యి కెంద రున్నారో
వీర బొబ్బిలికోటలోన యికను వుండరాదు

---

1. ‘మనమూ యింకేటి’ అని.
2. ‘రాజుమీాదుగా’ అని.
3. ‘బొబ్బిలివారీ పాపము’ అని.
4. ‘చేతెడు మీాసం తాండ్ర పాపయ్యా’ అని; ‘చేసెడు మీాసం’ అని (చ) ప్రతి.
5. ‘వంచినాను’ అని.
6. ‘అయిదుగూరు విడిపించినగానీ’ అని.
7. ‘డేరా కెళ్లెను’ అని.
8. ‘బూర్తిగ మునిగేను’ అని.

పోయి, విజేనగరమువాలు(?)లోపల డేరా వేయించి
రాజుకొడుకునే ఆనందరాజును హుదుర్న పిలిపించె
సలాము చేసి నిలబడ్డాడు ఆనందమహారాజు
సలా మనగనే సలా మన్నాడు బూసీదొరగారు
మాబాబుదేవును చంపిస్తివా బూసీ దొరగారు
అతని పాపమే అతనికి చెందెను ఆనందరాజా
మీబాబుదేవును దహనంచేసి[1] రమ్మన్నా డేమి
†ఆనందరాజు హైదరుజంగు లక్షుమన్నగా ముగ్గురు
కలుసుక వచ్చినారయా బొబ్బిలికైతేను†
రాజును చూస్తూ ఆనందరాజు దుఃఖపడుతాడు
హైదరుజంగూ లక్షుమన్నగా సముదాయించిరి
జీలుగగుంట్ల బైలున రాజును దహనంచేసిరి[2]
రాజుసరసనే తాండ్ర పాపయ్యను దహనంచేసిరి[3]
రాజు చచ్చిన తావున వొక్క స్తంభ మెత్తినారు[4]
తాండ్ర పాపయ్య చచ్చిన దిక్కున స్తంభ మెత్తినారు[5]
తండ్రిగారివి అస్థు లప్పుడూ యేరుకొన్నాడేమి[6]
తిరిగి మళ్లను విజేనగరమూ వారు వచ్చినారు
పెదరాజు అస్థులు అప్పుడు కోటలో దాచిరి[7]

---

1. 'మీబాబుదేవుని దానం జేసి' అని మూలము.

† వచనము.

2. 'జీలగగుంటా బైల్ల రాజుని దానం చేసీరి' అని.

3. 'దానం చేసీరి' అని.

4. 'చచ్చినా తావున వొక్కా స్థంభ మేసినారు' అని మూలము.

5. 'స్తంభ మేసినారు' అని.

6. 'తండ్రిగారివీ హస్తు లప్పుడూ యేరుకొన్నదేమి' అని.

7. 'హస్తులు...దాచీరి' అని.

బూసిగారి డేరాకు వచ్చెను ఆనందమహారాజు
అప్పుడు, విజేనగరము ఆనందరాజుకు పట్టం కట్టిరి[1]
బొబ్బిలికోట ఆనందరాజుకు జాగీ రిచ్చినాడు
బొబ్బిలి పైకం కళింగ పైకం చెల్లగట్టవయ్యా[2]
సిబ్బందిఖర్చు బత్తెపుఖర్చుగా కూడా కట్టండి
సిబ్బందివారికి కసాయిగొర్లను యిప్పించు మనిరి
బూడిదకట్నం పన్నెండువేలు[3] యిట్లు కట్టు మనిరి
బూడిదకట్నం పన్నెండువేలూ[3] బూసి కిచ్చినాడు
బొబ్బిలి పైకం కళింగ పైకము సగము కట్టినాడు
సిబ్బందివారికి కసాయిగొర్లను రాజే యిప్పించె
తతిమ్మాపైకం తెమ్మంటూను జులుముచేసినాడు
నా దేశంలోనే డబ్బు లేదుగా బూసీ మహారాజ
మరాటిగుఁరముచేత దేశమే దోపిడిపోయింది
డెబ్బయిరెండు మన్యాలవారుగా వెత్తిపడ్డా రేమి[4]
మీరు యేరు దాటి యేలూరు వెళ్లితే పైకం పంపిస్తా
కట్టుమనె జండాలతాళ్లు కదలుమనె బలము[5]
లక్షాడెబ్బయినాల్గువేలతో వచ్చిన బూసేమి
లక్షా యేభైవేలబలముతో బూసి లేచినాడు
కనుమ దాటి గంజాముకాడికి బూసీ వచ్చెను
చొప్పపాలెపు రేవున దాటె పరాసుల బూసి
మూడు నెల్లకే యేలూరులో ప్రవేశించినాడు

---

1. 'పట్టం కట్టిరి' అని.
2. 'కళింగపైకం . ల్లిగట్టవయ్యా' అని.
3. 'బూడిదెకట్టం పన్నెంవేలు' అని.
4. 'తొత్తిపడ్డరేమీ' అని.
5. 'కట్టుమాని జండాలతాళ్లు కదలుమాని బలము' అని.

ఏలూరు పెదపాటిసందున దుబాసి లక్షుముడు
కొలువు తీరి తా కూర్చుండివుండగ[1] లక్షుమన్న నేమి
చెన్నపట్టణపు బొందిలీలుగా జీత మడిగినారు
నా మచిలీబందరుకు[2] వస్తే జీతా లిస్తాను
ఇస్తే కానీ కదలనివ్వము లక్షుమన్న నిన్ను
ఎంత లేదు జీతాలు యిక్కడా యివ్వ నన్నా డేమి[3]
ఆరికట్లగా సీతారాముకు కోపం వచ్చింది
బారు పెట్టి మరి చేతను వున్న[4] పిస్తోల్ తుపాకి
జోడుగుండ్ల బా రెట్టి గట్టిగ పొట్ట పగులగొట్టె
ఏలూరి పెదపాటి సందున లక్షుమన్న చచ్చె
అక్కడినుంచి లేచినాడుగా బూసీ దొరగారు
యూవత్తూ, ఆరునెల్లకే ప్రవేశించెను గోలకొండ కేమి
గోలకొండ నలరాతికాడనే తా హైదరుజంగు[5]
ఇన్ని బలములను చంపుక నేను యింకేటి బ్రతుకు
గోలకొండకు వెళ్లీ నేను యేమని చెప్పుదును
బాకున గుద్దుక ధరణి కొరగెను తా హైదరుజంగు
నబాబువారి భేటికి వెళ్లెను బూసీ దొరగారు
సలాము లందుక కచేరిమీద కొలువు తీరినాడు
బొబ్బిలి తీసిన వృత్తాంతమ్మూ చెప్పినాడు బూసీ
రాజు చచ్చిన కబురు[6] చెప్పెను నబాబువారికి

---

1. 'కూర్చుండుండగ' అని.
2. 'నామచ్చిలీని బందారుకు' అని.
3. 'యివ్వనన్న దేమి' అని.
4. 'మరి చేతులున్న' అని.
5. 'తా సైదరుజంగు' అని మూలము.
6. 'రాజు వచ్చిన ఖబురు' అని.

ఈమాట వినగనే కోపము వచ్చెను[1] నవాబువారికి
నేను, విజేనగరమూ కొట్టుమంటేను బొబ్బిలి కొట్టావా
పాపం పుణ్యాం యెరుగని బూసీ అములు మారిపోయె
పుదుచ్చేరిలో[2] ప్రవేశించెను బూసీ దొరగారు.
పెద్దాడ నాగేశం కొడుకు మల్లేశం తాను
మల్లేశం చెప్పినకథ వినుడి.

---

1. 'ఈమాట వింటానె కోప మొచ్చెను' అని.

'పుచ్చేరికీ' అని. 'పుశ్చేరి' అని (చ) ప్రతి.